# చతుర

నవంబర్ 1999
రూ. 7/-



## మాయలేడి

గోపరాజు నాగేశ్వరరావు

# 'మాట్లాడేబొమ్మలు' పై సమీక్షలు

**సెప్టెంబరు 'చతుర' లో ప్రచురితమైన కొలువమల్లయ్య రచన 'మాట్లాడేబొమ్మలు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

## సామాజిక చిత్రణ

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

'మాట్లాడే బొమ్మలు'లో కరీంనగర్ నుండి తమ ఊరికి వెళ్లే బస్సుకోసం పొద్దుపోయేవ రకు ఎదురు చూడడంతో ప్రారంభమయిన అయిలయ్య జీవనయానం ఎన్నో గతుకులు, ఒడిదుడుకుల మధ్యసాగి, ఆసరా అవసర మైన చరమాంకంలో మళ్లీ అదే బస్టాండుకు వచ్చి సమయానికి రాని కొడుకు కోసం ఎదురు చూడడం, ఆయన భార్య కూడా ఊరిలో ఇంటి గడప దగ్గర అలాగే ఎదురు చూడడం, ఎందరో దంపతుల దయనీయ జీవితాలకు ప్రతీక.

వ్యవసాయంపై ఆధారపడిన అయిలయ్య బాధ్యతలు కనీసపువే అయినా క్రమంగా తన బావ సాంబయ్యకన్నా దిగజారడం తర తరాల రైతు దుస్థితికి దర్పణం. ఖచ్చితమైన ఆదర్శాలుండీ అవి ఆచరించే ధైర్యంలేక, సామాజిక వాస్తవాలకు లోబడి ఉద్యోగం, నగర జీవితంలో ప్రవేశించిన వాడు సాంబయ్య. ఆదర్శాలు వాస్తవాల మధ్య సంఘర్షణపడే సాంబయ్య అతని కూతురే అన్నట్లు తనకేం కావాలో తనకే తెలియని మధ్య తరగతి మనస్తత్వానికి ప్రతీక.

రాచరికాల కాలంనుంచీ ఈనాటివరకూ తెలంగాణాలో మధ్య తరగతివారికి తన్ను తాను దిద్దుకునే ఆరాటంలో ఏ పోరాటమూ సాయపడకపోగా కుటుంబ సంబంధాలను సైతం కుంటుపరచే ప్రభావం కల్గిస్తున్నాయి. నవలలోని ముఖ్యపాత్రలు ఇందుకు ఉదాహ రణలే. కరీంనగర్ ప్రాంతం నేపథ్యంగా సాగిన ఈ రచనలో రచయిత ప్రాంతీయ యాసను పాత్ర స్వభావం, భావం మన స్సుకు తాకేటట్లు సమర్థవంతంగా వాడాడు.

తరాలు మారినా పాత తరంపట్ల కొత్త తరం దృక్పథంలో మార్పు రాని తీరు, పరి స్థితులు వారిని మాట్లాడే బొమ్మలుగా మార్చేతీరు చక్కగా చెప్పింది ఈ నవల. కరీంనగర్ ప్రాంతంలో ఒక తరపు మధ్య తరగతి, గ్రామీణుల సామాజిక జీవితానికి ఈ నవల సమకాలీన చరిత్ర అనవచ్చు

–సి. హెచ్. చంద్రశేఖర్
హైదరాబాద్-500022

## చారిత్రక, సామాజిక పాఠ్యాంశం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఆదర్శాలు, సిద్ధాంతాలు అనేవి ఆచరణలో అందరికీ సాధ్యంకావు. సామాజిక, కుటుంబ, ఆర్థికపరమైన సమస్యలు వాటిని అడ్డుకుం టాయి. 'మాట్లాడే బొమ్మలు' నవలా నాయ కుడు సాంబయ్యను ఈ విషయాలే తన ఆదర్శాలకు దూరం చేశాయి.

వరకట్నం లేకుండా పెళ్లి చేసుకోవాలను కున్న మొదటి ఆశయం, తండ్రి మూలంగా వీగిపోయింది. సృజనాత్మకమైన ఉపాధ్యాయ వృత్తికై ఇంజనీరింగు సీటును వదులుకు న్నాడు.

పిల్లల చదువుల విషయంలో కూడా భార్యదే పైచేయి కావడంతో తన సిద్ధాంతా నికి నీళ్లు వదులుకోవాల్సి వచ్చింది.

తెలంగాణా ప్రాంతపు వెనకబాటుతనాన్ని,



వారి జీవన విధానాన్ని చక్కగా వివరించారు రచయిత.

నవలను చదువుతున్నంతసేపు ఒక ఉపాధ్యాయుడు తన విద్యార్థులకు చారిత్రక, సామాజిక శాస్త్ర పాఠ్యాంశాన్ని బోధిస్తున్నట్లుగా వుంది.

తీయని తెలంగాణా యాసతో, తెలుగు నవలా సాహిత్యాన్ని మరికాస్త బలోపేతం చేసిన నవల, మాట్లాడే బొమ్మలు. టైటిల్ కూడా గంభీరంగా వుంది. రచయితకు, ప్రచురణ కర్తలకు ధన్యవాదములు.

—నెల్లుట్ల సుదర్శనరావు
మణుగూరు కాలరీస్

## వాస్తవికతకు పెద్దపీట

(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)

ద్వైదీభావాలతో కొట్టుమిట్టాడుతూ జీవితాన్ని గడపవలసి రావడం ఎంత నరకప్రాయమో 'మాట్లాడే బొమ్మలు' నవల చక్కగా వ్యక్తీకరించింది. అట్లే తరాల మధ్య అంతరం రోజురోజుకు పెరిగిపోయేలా చదువుకున్నవాళ్లను పల్లెలకు దూరం చేసేలా, విద్యావ్యవస్థ ఉంటుందనే విశ్లేషణ పాఠకులను ఎంతగానో ఆలోచింపచేసింది.

ఈ నవలలో సాంబయ్య పాత్ర చిత్రీకరణ పాఠకులను కాసింత గందరగోళానికి గురిచేసేదిలా ఉండడానికి కారణం ఆ పాత్ర సజీవమైనది కావడం! అయితే ఈ పాత్ర మనస్తత్వం మెజారిటి ప్రజల మనస్తత్వానికి సరిపోతుండడంతో పాఠకులు ఆ పాత్రలో తమను తాము ఐడెంటిఫై చేసుకోవడంలో నవల ప్రభావం తక్కువేమి కాదు.

అతిశయాలకు, ఆడంబరాలకు విలువిస్తూ నిజజీవితానికి, స్వచ్ఛమైన జీవనశైలికి తిలోదకాలిస్తూ ఫాల్స్‌ప్రిస్టేజిలే జీవితంగా గడిపే సరస్వతి పాత్ర నేటి సగటు మహిళకు ప్రతినిధి!

తాము పొందలేనిది తమ పిల్లలయినా పొందాలనే తపనతో రెక్కలు ముక్కలు చేసుకుని శ్రీనును చదివించిన అయిలయ్యకు చివరిదశలో కొడుకు మొండిచెయ్యి చూపిన వైనం చూసి పాఠకుల హృదయాలు బరువెక్కాయి. సమాజంలో నిత్యం జరిగే సంఘటనల పట్ల విద్యార్థులను స్పందించనీయకుండా కట్టడి చేస్తూ కుటుంబానికి పరిమితం చేస్తూ మున్నెన్నడు లేనివిధంగా కెరీరిజం దిశగా పయనింపచేయడంవల్లే వ్యక్తి స్వార్థం ప్రబలి ఆ కుటుంబం కూడా ముక్కలవుతుందని శ్రీనివాస్ పాత్ర హెచ్చరిస్తుంది.

తెలంగాణా మాండలికంలో సాగిన శైలి, గ్రామీణ సంస్కృతి, సంప్రదాయాలను గుర్తు చేసిన తీరు పాఠకలోకాన్ని ఎంతగానో ఆకట్టుకుంటుందనడంలో అతిశయోక్తి లేదు.

—జి.శివారెడ్డి
హన్మకొండ- 506009

## జీవనపోరాటం

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఇరవై ఒకటో శతాబ్దంలోకి అతిత్వరలో అడుగిడబోతున్న మనమంతా అనుభవించిన, అనుభవిస్తున్న కష్టసుఖాల్ని అన్నిరంగాలనుంచి అన్ని రకాలుగా గుర్తుకు తెచ్చారు కాలువ మల్లయ్యగారు సెప్టెంబరు నెల చతురలో.

పల్లెలో పుట్టి పెరిగి విజ్ఞానాన్ని సంపాదించిన సాంబయ్య ఆదర్శాలు, ఆలోచనలు ఆచరణలోకి రాకుండా కాలానుగుణంగా మరుగునపడ్డాయి. చివరకు తనకోసం తన చదువుకోసం కష్టపడిన తల్లితండ్రుల్ని వృద్ధాశ్రమంలో సైతం ఆదుకోలేకపోయాడు. తల్లితండ్రులకి దూరం అయ్యాడు. సరస్వతి తన పిల్లల్ని పల్లెలో వుంటే సరిగా చదవరని, పట్నంలో ఉంచటం అన్న ఆలోచన స్వార్థపూరితమైనా మంచిదే.

ఈ రోజుల్లో మాతృభాష తెలుగు కంటే





ఇంగ్లీషే అన్నింటా ఆధిక్యత కలిగివుంది. పిల్లల్ని ఇంగ్లీషు మీడియం స్కూల్లో చేర్పటం తప్పనిసరి. అంతమాత్రంచేత తల్లితండ్రుల్ని మర్చిపొమ్మని నిర్లక్ష్యం చేయమని ఏ చదువు, ఏ సంస్కృతి నేర్పదు. ఏదో ఒక కారణం చెప్పుకుని తమని తాము సమర్థిం చుకునే సాంబయ్య, శ్రీనివాస్‌లాంటి వాళ్లే ఎక్కువ ఈ రోజుల్లో. తమ నిస్సహాయతని అసమర్థతని కప్పిపుచ్చుకోవటానికి అనేక కారణాలు వెతుకుతారు. కానీ రేపు వృద్ధా ప్యంలో తమకి ఇలాంటి పరిస్థితి ఎదురవు తుందని గ్రహించని వారు ఎందరో! తమకి ఇలాంటి స్థితి వస్తే రేపు తమ గతి ఏమిటి అని ఒక్కసారి ఆలోచించుకుంటే ఈనాడు తమ తల్లితండ్రులకి ఈ పరిస్థితి కలిగిం చరు.

–యన్.ఇందిర
తిరుమలగిరి 500015

## మధ్యతరగతి 'బొమ్మల' జీవనయానం

(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)

'కాలువ మల్లయ్య' గారి 'మాట్లాడే బొమ్మలు' మానవ యాంత్రిక జీవనాన్ని, పరిస్థితులకోసం జీవనగమనాన్ని మార్చుకుం టున్న మానవనైజాన్ని ప్రతిబింబించగల్గింది.

ముఖ్యంగా ఓ సాధారణ మధ్యతరగతి మనిషి యొక్క ఆలోచనా విధానాన్నీ ఏదో చేద్దామనుకుని కూడా ఏమీ చేయలేని చేత గాని తనాన్నీ వర్ణించగల్గింది సాంబయ్య పాత్ర.

నీకు వాళ్లిచ్చే కట్నం మీదున్న మోజు వాళ్ల కుటుంబం మీద లేదు అని తండ్రిని తూలనాడిన సాంబయ్య చివరకు వాళ్లకిష్ట ముండి సంతోషంగా ఎంతిస్తానంటే అంతే తీసుకోవాలి అని రాజీపడడం, తల్లిదండ్రుల్ని చివరి రోజులలో దగ్గరుంచుకుని ఆసరాగా నిలవకపోగా తన పరిస్థితులు అలాంటివని సరిపెట్టుకోవటం, తనలాగే చేసేవారిని మాత్రం కృతఘ్నులుగా భావించటం, ఇష్ట మైన ఉపాధ్యాయ వృత్తికోసం ఇంజనీరింగ్‌నే వదిలివేసిన వాడిని ఎక్కువ జీతంకోసం వేరే ఉద్యోగాల్లో చేరడమా అంటూనే అప్లికేషన్లు, రాత పరీక్షలు పూర్తిచేయడం ఉద్యోగం వస్తే చేరనని మొండికేయడమూ ఇదంతా ఏ ఉద్యోగమైనా సాధించగలననే ఆత్మతృప్తి కోసం చేసుకునే ఆత్మద్రోహం.

మమ్మీ, డాడీ పిలుపులు ఇష్టం లేదం టూనే పిల్లలకు ఇంగ్లీష్ మీడియం చదువులు చెప్పించడం... ఇలాటివన్నీ కంటి తుడుపుకు కూడా పనికిరాని మధ్యతరగతి ఆదర్శాలు. సమాజాన్ని ఉద్ధరించాలన్న ఆలోచనలు ఉంటేచాలు ఉద్ధరించేసినట్లే అనుకోవటం ఈ సమాజంలో అనేకుల భావన.

'మీ డ్యూటీ మమ్మల్ని ఫెయిల్ చేయ డమా', 'ఆయన బాధకే నేను బడికస్తున్న' లాంటి పలుకులు నేటి పిల్లల మనోభావా లకు, కష్టపడటం ఇష్టంలేని తత్వానికీ నిదర్శ నలు. విశ్లేషణాబుద్ధిని బాగా అలవర్చుకుం టున్న ఇప్పటి పిల్లలు 'నాన్నకే తెలియదేం కావాలో?' అని అనటంలోనూ ఆశ్చర్యం లేదు.

అయిలయ్య ఆలోచనా ధోరణిద్వారా చాలా విషయాలు చర్చించారు రచయిత. తన కొడుకు తనకు కాకుండా పోయేటట్ల యితే తాను అస్సలు చదివించనని అయి లయ్యే కాదు ఏ తండ్రైనా మథనపడాల్సిన విషయమే.

కథతోపాటు అప్పటి సమకాలీన జీవితం, రాజకీయ ఒడిదుడుకులూ, ఎమర్జెన్సీ లోటు పాటులు, రైతన్నల కష్టాలు, అన్నల పోరా టాలూ వివరించడం ఓ కథగా కాకుండా నిజంగా జరిగిన ఓ చరిత్రగా తీర్చిదిద్దిన వైనం ప్రశంసనీయం.

–విశ్వతేజ విశ్వనాథరెడ్డి
నల్లగట్ల, కర్నూల్ జిల్లా

★



# చతుర

నవంబర్ 1999 సంపుటి: 22 సంచిక: 10

"తొలికాన్పు నాటికయినా నీకు ముక్కుపుడక చేయిస్తా"నంటూ... భార్యకు తొలిరేయి అతడిచ్చినమాట... మూడుకాన్పుల తర్వాత కూడా తీరని ముచ్చటగానే వుండిపోయిందా సంసారంలో.

ముక్కుపుడకెట్టి, గళ్లకోకకట్టి, సిగలో పూలెట్టి... తన భార్య... రుషిపత్నులమధ్య అరుంధతిలా వెలిగిపోయే దృశ్యాన్ని ఊహించుకుంటూ... ఆ ప్రయత్నంలో ఎన్నో చెయ్యని నేరాలకు శిక్షలు పొందాడతడు.

చివరికి.... ఆమె అందం, నిప్పులా బతకాలనే స్వభావం, భర్త నీడలో పేదరికాన్నయినా ఐశ్వర్యంలాగానే అనుభూతి పొందగలిగే ఔన్నత్యం... కూడా... అతినికి శిక్షే అయితే...?

ఆశయాలూ, అవసరాలూ సమాంతరరేఖలై
సాగే అభాగ్యుల జీవితాలకు అక్షర విశ్లేషణ

## గోపరాజు నాగేశ్వరరావు

# మాయలేడి

ఈ నెల 'చతుర' సమగ్ర నవల



రాత్రంతా మార్తమ్మకు కంటిమీద కునుకన్న మాటేలేదు. నిద్రకూ, మనసుకూ ఆ సంబంధం ఏమిటోగానీ ఒక్కోసారి నిద్రపోతేనే తప్ప మనసుకు శాంతి చిక్కదు. మనసు శాంతితో కుదురుకుంటేనే తప్ప కంటికి నిద్రరాదు!

తెల్లవారబోతోంది.

విడతలవారీగా రాత్రంతా కునికిన వీధికుక్కలు కంగాళీగా అటూ యిటూ పరుగులు పెడుతూ మోరలెత్తి అరుస్తున్నాయి.

ఆ అరుపులు విని 'తెల్లవార్తోంది' అనుకొని ఒకసారి నిట్టూర్చి చాపమీంచి లేచి కూర్చుంది.

గుడిసెలో ఒకమూలగా కుక్కిమంచం మీద వొంగి పడుకొని ఉన్నాడు భర్త. చాపమీద వరుసగా ముగ్గురుపిల్లలూ ఆదమరిచి నిద్రపోతున్నారు.

ఆమె నెమ్మదిగా లేచి నిల్చుంది. గుడిసె వాకిట్లోకి వెళ్ళి తడక తలుపుకు బిగించిన తాడు ముడి విప్పింది. తలుపు బార్లా తెరిచి బైటికి తొంగిచూసింది.

అద్భుతమైన దేవతాపుష్పంలా వెలుతురు విచ్చుకుంటోందనుకుంటూ వాకిట్లో కళ్లాపి చల్లి ముగ్గులు పెట్టేందుకూ, కసువూడ్చి శుభ్రం చేసేందుకూ తయారైంది. ప్లాస్టిక్ బకెటూ, నీళ్ళమగ్గు, చీపురూ పట్టుకొని బైటికి వెళుతూ ఎందుకో తలుపు దగ్గరే ఆగింది సంకోచిస్తూ.

పక్క గుడిసె భాగ్యమ్మ కసువూడ్చి కళ్లాపి చల్లేందుకు బైటికి వచ్చేవేళ కూడా అదే! ఆమె అలా తారసపడితే ఆమె కళ్లలో కనిపించే అతిశయాన్ని ముందే ఊహించుకుంది మార్తమ్మ.

ఆ అతిశయం తనను ఎంతగా న్యూనత పరుస్తుందో! ఎంతగా ఆవేదన పెడుతుందో!

తమ లేమికన్నా కలిమిగల వాళ్ళ చూపులే అమితంగా బాధపెడతాయి కొందరిని.

అందుకే ఆమె బైటికి వెళ్ళేందుకలా సందేహిస్తోంది.

భర్త పడుకున్న నులకమంచం 'కిర్రు'మని చప్పుడు చేసింది. ఆ వెంటనే జోలె ఉయ్యాలలోంచి లేచి కూర్చున్న పిల్లాడిలా అతిప్రయత్నంమీద కుక్కిమంచంలోంచి లేచాడతను.

తడక తలుపుదగ్గర నిల్చున్న భార్యవేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏంటే మార్తూ...? "

శిలకు చైతన్యం వచ్చినట్లే కదిలిందామె. "ఏటుందీ? " అంది చాలా నీరసంగా.

"అట్టాగే నిలబడిపోతే ఏంటిదా అని అడిగినాన్లే"

"కసువూడవ బోతుండాను" అని, ఏదో జ్ఞాపకం వచ్చి రివ్వున వెనక్కి తిరిగి భర్త మంచం దగ్గరికి వెళ్ళింది.

"నిన్న రేత్తిరి భాగ్గెమ్మ మొగుడు ముక్కుపుడక తెచ్చిండు" అంది తలను కిందికి వాలుస్తూ.

"నిజవా? " ఆశ్చర్యంగా చూశాడు పేతురు.

"నిజం గాకుంటే నిన్నుడికియ్యాను అసత్తెం జెప్పేనా! రేత్తిరి దాన్నది నాకు సూపిచ్చింది గూడా! ముక్కుపుడక ఎంత సక్కగుందనీ... దాని రాయి వొజ్రంలాగా మెరుస్తాంది..."

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళు కూడా వజ్రాల్లానే మెరిసేయి!

భార్యకు ముక్కుపుడకమీద ఎంత భ్రమో, ఎంత యిష్టమో అతడికి తెలియంది కాదు! భాగ్యమ్మ ముక్కుపుడకను గురించి చెబుతున్నప్పుడు మార్తమ్మ కళ్ళు అలా మెరవడానికి కారణం అదే!

భార్యకు ముక్కుపుడక కొనిపెట్టలేని తన దౌర్భాగ్యానికీ, నిస్సహాయతకూ తనను తనే నిందించుకున్నాడతను.





క్రమంగా అతడి నిస్సహాయతలోంచి కోపం తలెత్తింది, ఆ కోపం ఆవేశంగా మారింది.

"ఛూ... త్తేరీ! భాగ్యమ్మ మొగుళ్ళాగా నానూ మందిని ముంచేవోణ్ణయితే సంద కాడ దెచ్చేవోడ్ని నీకు ముక్కుపుడక. అసు వంటోడ్ని గాన్నేను. సెప్పులు గుడితే వొచ్చేది బువ్వకి సాల్తే సాలు బగవొంతుడా అంటా బతికేవోడ్నే గానీ శబ్బర పన్లు సేసే వాడ్ని కాదు" అని "అయినాగానీ మార్తీ...! మనం ముంతలో సిల్లర దాచిపెడుతుండాం గదా! యియ్యాళ గాకుంటే రేపు గొననా ముక్కుపుడక" అని యిక భార్యకు మాట్లాడే అవకాశం యివ్వకుండా ముఖం కడుక్కుం దుకు బైటికి వెళ్ళిపోయాడు.

భర్త అలా తన మాటలను పూర్తిగా విన కుండా లేచిపోవటం ఆమెకు నచ్చలేదు. నొచ్చుకుంది!

అందుకే కొంచెం తిరస్కారంగా "బహుగొ న్నావ్‌లే ముక్కుపుడక. మన లగ్గమైన కాడ్నించీ యిదే అంటన్నావ్. అయినా భాగ్యమ్మకి మొగుడు ముక్కుపుడక తెచ్చిం డని అన్నానుగానీ నువ్వు తీస్కరాలేద న్నానా! అంత మాత్తరానికి అంత యిసురూ, కోపం దేనికంటా... సోద్దెంగాక" అంటూనే తడక తలుపును కాల్తో తన్నింది.

తన మాటలు భర్త వింటున్నాడా, లేదా అని బైటికి వెళ్ళి అతడివైపుకు తొంగిచూ సింది.

నిర్వికారంగా వేప్పుల్లతో పళ్లు తోముకుం టున్నాడతను.

ఆ నిర్లక్ష్యానికి కారం పూసినట్లయిందా మెకు. "ముక్కుపుడక లేకుంటే ముద్ద దిగ దని అడిగినానా, సంసారం సాగదని సెప్పి నానా? ఎందుకోగానీ దానిమీద భ్రెమవుండే దంతే! అది కూడా నువ్వు కొంటానంటేనే గానీ లేదంటే నాకేటికుంటుంది. అంతమా త్రానికి భాగ్గెమ్మ మొగుడు మందిని ముంచే పెళ్ళానికి ముక్కుపుడక తెచ్చిండో మంతరం జేసే తెచ్చిండో మనకేంటికి? శాత్నైతే నువ్వూ దేవాల; శాతగాకుంటే గమ్మునుండా లంతే" అని ఆ కోపంలో భాగ్యమ్మ కనిపి స్తుందన్న భయంకూడా మర్చిపోయి విసు రుగా నీళ్ళ బకెటు అందుకొని వాకిట్లోకి వెళ్ళింది.

భార్య అలా గుడిసెలోంచి బైటికి రావటం క్రీగంట గమనించిన పేతురు హడావిడిగా దోసెడు నీళ్ళు పుక్కిలించి వేగంగా ఇంట్లోకి వెళ్ళాడు.

మార్తమ్మ గుడిసె ముందు కసువూడ్చి కళ్ళాపి చల్లింది. ముగ్గుముంత తెచ్చి ముంతలోంచి చిటికెలతో ముగ్గుపొడి తీస్తూ అందంగా ముగ్గులు పెట్టింది.

వొంగొని అలా ముగ్గులు పెట్టీపెట్టీ లేచి, నిటారుగా నిల్చుంటూ నడుము కలుక్కు మందేమో "ఉస్సో..." మని పెద్దగా మూల్గింది.

పక్కగుడిసె భాగ్యమ్మ కందిపుల్లల దడి వెనుక కూర్చుని అప్పటిదాకా అంట్లు తోము తోందల్లా లేచి నిలబడి, దడిమీంచే ఈమెను చూసి, అంట్లు తోమటం ఆపింది. చేతులు కడుక్కుని పైట చెంగుతో తుడుచుకుంటూ ముఖాన్ని చాటంత చేసుకొని మార్తమ్మకేసి దూసుకువెళ్ళింది అయస్కాంతంకేసి వెళ్ళే గుండు సూదికిమల్లే!

రెండు చేతులతో నడుము ఒత్తుకుం టోన్న మార్తమ్మ ఉలిక్కిపడి భాగ్యమ్మను చూసింది. పలకరింపుగా నవ్వింది.

భాగ్యమ్మ కళ్ళు వజ్రాల్లా మెరుస్తో న్నాయి. కనుబొమలు అతిశయంతో కదలా డుతున్నాయి. ఆమె నల్లటి పెదాలకూ, తెల్లటి పళ్లకూ మధ్య నవ్వులు చిట్లుతు న్నాయి. ఆ నవ్వులన్నీ వెల్తురుగా మారి ముఖం నిండా పులుంకుంటున్నాయి.

"ఏంటే అప్పా, బహు కుశాలుగుండావ్,



బావ యింకా ఏంటయినా కొని తెచ్చిండా, ఏంటి? " అనడిగింది మార్తమ్మ ఆమెవేపే చూస్తూ.

భాగ్యమ్మ ఆ మాటలకు మరింతగా వెలిగిపోయింది. ఇంకో అరడుగు దగ్గరికి జరుగుతూ "నిన్న రేత్తిరి పొట్లంలో వుండగానే ముక్కుపుడక సూసినావు గానీ ముక్కుకు పెట్టుకున్నాక ఎట్టాగుందో సూళ్ళేదుగా నువ్వు" అంటూ ముక్కూ, మూతీ ముందుకు చాపుతూ "ఎట్టాగుందంటావ్? " అనడిగింది భాగ్యమ్మ.

మార్తమ్మ గద్దలా ఆమె ముక్కువేపు చూసింది. ముక్కుకు మెరుస్తోన్న ముక్కుపుడకనూ చూసింది.

ఆనందమో ఆసక్తోగానీ కళ్ళు యింతేసి చేసి "ఎంతసక్కగుందే అప్పా" అంది మార్తమ్మ విప్పారిన ముఖంతో.

భాగ్యమ్మ ఏదో చెప్పబోతుంటే సమయానికి గుడిసెలోంచి భార్యను కేకవేసి పిల్చాడు పేతురు.

అతడలా పిలవడంతో మార్తమ్మకు అక్కడ్నించి వెళ్ళిపోయే అవకాశం చిక్కింది. క్షణం కూడా ఆలస్యం చెయ్యకండా "ఎల్తానే అప్పా... నా మగడు పిలుస్తుండాడు" అంటూ కదిలి వేగంగా గుడిసెలోకి వెళ్లిపోయింది.

నీరసంగా నిట్టూర్చింది భాగ్యమ్మ. అడుగులో అడుగు వేసుకుంటూ మళ్ళీ అంట్లగిన్నెల దగ్గరికి చేరుకుంది.

★ ★ ★

రోజూ పొద్దున్నే చద్దన్నం తిని చెప్పులు కుట్టే సామాన్లసంచిని మోసుకుంటూ ఊళ్ళోకి వెళ్ళడం, ఆర్డీఓ ఆఫీస్ ఎదురుగా ఉన్న చర్చిముందు చింతచెట్టుకింద కూర్చొని సాయంత్రం దాకా చెప్పులు కుట్టటం, సాయంత్రం కాగానే సామాన్లను సంచిలో సర్దుకొని తిరిగి ఇంటికి వెళ్ళటం, మధ్యాహ్నంవేళ తన సంపాదనలోంచి రెండో, మూడో చుట్టలకూ, రెండుసార్లు టీ తాగేందుకూ మాత్రమే డబ్బులు ఖర్చుపెట్టి, మిగిలిందంతా భార్యకు యివ్వటం పేతురు దినచర్య.

ఆరె, కంతాని, దారబ్బంతి, బూట్ పాలిష్ డబ్బా, బ్రష్షూ... యిత్యాది సామాన్లను యధావిధిగా ఖాకీ సంచిలోకి సర్దుకున్నాడు పేతురు. అక్కడ్నించి భార్యను కేకేసి పిల్చాడు.

భాగ్యమ్మను వదిలించుకొని వచ్చింది మార్తమ్మ.

"బువ్వెట్టు" అడిగాడు.

సత్తుకంచంలో చద్దన్నం పెట్టిందామె. రాత్రి తినగా మిగిలినపచ్చడి చేత్తో తీసి కంచంలో వేసింది. కంచంపక్కనే మంచినీళ్ళ గ్లాసుపెట్టి, "ఇగదిను" అంది తను కూడా ఎదురుగా కింద కూర్చుంటూ.

పేతురు వచ్చి కంచందగ్గర కూర్చున్నాడు. గడ్డగా ఉన్న అన్నాన్ని వేళ్లతో పొడుస్తూ, "పిల్లలింకా నిదర లెగవలేదేం? " అనడిగాడు.

తల తిప్పి యింకా నిద్రపోతోన్న పిల్లలవేపు ఒకసారి చూసి తల దించుకుందామె.

ఆమె అలా ముక్కుపుడక విషయం ఎత్తకుండా మౌనంగా కూర్చోవటంతో స్థిమితపడ్డాడు తను. మాట్లాడకుండా అన్నం తినటం ముగించి కంచంలో చెయ్యి కడుక్కుని లేచాడు. నులకమంచం పట్టెమీద ఉన్న నల్లంచు ఎర్ర తువ్వాలుతో చేతులు తుడుచుకొని అలవాటు ప్రకారం జేబులు తడిమి చూసుకున్నాడు.

చిల్లర డబ్బులు చేతికి తగల్లేదు.

రోజూ సాయంత్రం భర్త ఇంటికి రాగానే సంపాదించిందంతా తన చేతిలో పెట్టినా ఒక రూపాయిమాత్రం ఆమె తిరిగి భర్త జేబులో వేస్తుంది. పొద్దున్న చద్దెన్నం తిని





చెప్పులు కుట్టేందుకు వెళ్ళగానే ఆ రూపా యితో చుట్టలు కొనుక్కోవడం అతని అల వాటు.

ఆనవాయితీగా అలా జరుగుతోన్న దానికి భిన్నంగా మార్తమ్మ ఎన్నడూ చెయ్యలేదు. రూపాయి జేబులో పెట్టటం ఏనాడూ మర్చే పోలేదు. అలాంటిది ఈ రోజిలా జరిగిం దంటే...

"నా సుట్టల మామూలు ఏదే? " ఇంకా జేబుమీంచి చెయ్యి తియ్యకుండానే అడిగాడతను.

భర్త అన్నం తిన్న ఎంగిలి పళ్ళాన్ని ఎత్తి పక్కన పెట్టి వచ్చిందామె. ఒకళ్ళవెంట ఒక ళ్ళుగా పిల్లలు అప్పుడే నిద్రలేచి కూర్చుంటు న్నారు.

"ఏంటంటున్నావూ? " భర్తను అడిగింది యిందాక సరిగా వినిపించుకోనట్టు.

"సుట్టల మామూలు రూపాయేదీ? "

ఆమె ముఖం కళ తప్పింది. గోటితో చెవి కింద గోక్కుంటూ "మన సిన్నముండ పల కాబలపం గొనమని యాడస్తాంటే దాన్ని మాయబుచ్చనీకి రిబ్బను గొనుక్కోయే అని నీ కాడి రూపాయి రేత్తిరే దానికిచ్చినాన్లే" అని, అంతలోనే ఏదో గుర్తొచ్చినట్టు ముఖం నిండా దీపాలు వెలిగించుకుంటూ అంది "ముక్కుపుడక గొందామని ముంతలో దాపె డ్తున్న డబ్బుల్లోంచి ఒక్క రూపాయి తీసి య్యనా? "

కొరడా దెబ్బ తిన్నట్టే అమాంతం ఎగిరిప డ్డాడతను. భార్యవేపు అదోలా చూస్తూ, "పేనం బోయినాగానీ యింక ముంతలో నుంచి సిల్లి పైసా గూడా తీసేదిలేదు. అదింక అంతే. ఆ సిల్లరంతా అట్టా... అట్టా... పెరిగీ పెరిగీ, యింకా యింకా దాపెట్టీ, దాపెట్టీ వొచ్చే కిట్టమాసు పండ క్కన్నా తెత్తానే నీకు ముక్కుపుడక" అన్నాడు మురిపెంగా.

భాగ్యమ్మ చూపించిన ముక్కుపుడక ఆమెకు గుర్తొచ్చింది. కొంటే గింటే అలాం టిదే కొనాలనిపించింది. ఆ విషయమే భర్తతో అనాలని నోరు తెరిచింది కానీ మౌనం వహించింది.

జీవితాంతం అలా ముంతలో చిల్లరడ బ్బులు దాచిపెట్టినా ముక్కుపుడక కొనటం సాధ్యం కాదనేది జీవితానుభవం ఆమెకు నేర్పిన పాఠం!

ఆ ముంత ఎన్నిసార్లు డబ్బులతో నిండి పోలేదూ!

ఎన్నిసార్లు భార్యాభర్తలిద్దరూ అర్ధరాత్రి దాకా ఆరు బయట ఆకాశంకింద ఊసులా డుకుంటూ రేపో, మాపో బజారుకు వెళ్ళి ముక్కుపుడక కొని తెద్దామని కలలు కన లేదూ!

సమయానికి ఏదో అవాంతరం! ముంతలో డబ్బు ముక్కుపుడకకి కాకుండానే కళ్ళముందే ఖర్చయిపోయేది. మళ్ళీ కుటుంబం కాస్తంత కుదుటపడగానే మొదటి నాణెంనుండి దాపుడు మొదల య్యేవి. ఎన్నో యుగాలకు మళ్ళీ ముంత నిండేది. మళ్ళీ ఒక అవాంతరం కాచుకొని ఎదురయ్యేది. అలా ఎన్నిసార్లు జరుగ లేదూ...

మార్తమ్మ గుండె పొదిలో ముడుక్కున్న జ్ఞాపకాలు వెలికి తన్నుకొస్తున్నాయి.

ఒకనాటి ముంత నిండిన రాత్రి-

పేతురు ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. వస్తూ వస్తూ ఎన్నడూ లేనిది అర్ధరూపాయి పెట్టి భార్యకు మల్లెపూలు కూడా తెచ్చాడు. భర్త ఆలస్యంగా వచ్చాడన్న చిరుకోపం ఒక వేపూ, మల్లెపూలు తెచ్చాడన్న సంతోషం మరోవేపూ...

"ఇంతాలీసెమైందేం? " మందారాల కళ్ళతో అడిగిందామె.

"బెంజిమేను పిలిపిత్తే ఎళ్ళినాన్లే"



"ఏంటికంట? "

"అదేనే కిస్నా జిల్లాలో మొన్న గాలోనకి సముద్దరం పొంగి శానా ఊళ్ళు మునిగిపో నాయంట. బెంజిమేను రాజకీయం మడిసి! ఊర్లో దిరిగిండంట. వొరద బాదితులకి సగాయం సెయ్యాల్నంట. బియ్యం, వొడ్లు, గుడ్డలు, మందులు యింకా ఏంటేంటియో పోగేసిండు. అయిగాక సందాలేసిండు. డబ్బులు వొసూలు చేసిండు. మన కులపు సంగం పేరుమీద వొరదల్లో ఇళ్ళు కూలినో ళ్ళకి అయి పంచిపెట్టాల్నని నన్ను కూడా రమ్మని పిల్చిండు. ఆ యవ్వారంలోనే ఆలీ సెమైంది"

"వానియంట నువ్వేంటికంట? " అడిగిం దామె ముఖం కొంచెం వికారంగా పెడుతూ.

"మడిసికి మడిసి తోడంతే!"

భర్త చెప్పిన సమాధానానికి సంతృప్తి చెందలేదామె. భర్త విడిచి చేతికి అందించిన చొక్కాను గోడమేక్కు తగిలించి వచ్చి "అస్మంటి యవ్వారాలు మనకేంటికి? ఈడ ఎంత వొసూల్జేసినారో వసూల్జేసిన దాంట్లో ఎంత నొక్కేసి వొరదబాదితుల కెంతిత్తారో! ఇది మందితో గూడిన పని. మాటొచ్చినా దంటే మనంటోళ్ళకి తలంపులొద్ది. బెంజి మేను పనే రాజకీయం గామట్టి అసుమంటో ళ్ళకి ఎవుళ్ళేమన్నా పట్టింపులుండవ్. నీ మానాన నివ్వు సెప్పులు గుట్టుకోక ఆడెంట యళ్ళటం కొరివితో తల గోక్కున్నట్టవుద్దేమో! ఆలోచించు" అంది నేలవేపు చూస్తూ.

పేతురు తాత్వికంగా నవ్వాడు. "ఆ సందాలూ, ప్రెజాసేవా అయ్యన్నీ సూసుకుం డేది వాళ్ళేనే ఎర్రిదానా, మనకేటీ సంబంధం లేదు. ఇగ బెంజిమేను నన్ను ఎందుకు యంట రమ్మన్నాడో సెప్పనా? " అని చివాల్న తలెత్తి భార్యవేపు చూశాడు.

ఆమె ఆసక్తిగా వింటోంది.

"ఆడ వొరదలకి గొర్లు, మేకలు, గొడ్డూ గోదా కూడా మునిగి సచ్చినాయంట. ఆటి తోళ్ళన్నీ వొలిపిచ్చి నాకే యిప్పిత్తానన్నాడు బెంజిమేను. ఆ తోళ్ళన్నీ దెచ్చి ఉప్పుతో ఊరేసి సక్కంగా సాపుచేసి గొప్పోళ్ళ సెప్పులు గుట్టినానే అనుకో... నాసామి రంగా ముక్కుపుడకేంటి కర్మ ముప్పేట గొలుసైనా సేయిత్తానింక. ఈ దెబ్బతో దరిద్దరం తీరిపోద్దే మనకి" అంటూ పేతురు ఇక మాట్లాడేందుకు మార్తమ్మకు అవకాశమే యివ్వలేదు.

ఇద్దరూ అన్నాలు తిని ఆరుబయట నుల కమంచం వేసుకొని పడుకున్నారు. మార్తమ్మకు మల్లెపూలు తురిమేడు. పిల్లలు ఇంట్లో నిద్రపోతున్నారు. పైగా వెన్నెల రోజులు. చంద్రకాంతి, తళుకుచుక్కల కాంతీ కలిసి భూమ్మీదకి జాలు కురుస్తోంది.

"మన ముంత నిండినాది గదా, నువ్వు, బెంజిమేను ప్రెజాసేవ పనిమీన ఎళితే మరి మన పని ఎవురు చేస్తారూ? " గోముగా అడిగిందామె.

"ముక్కుపుడకేనా? నేనుమాత్తరం పొద్దు గాల్నే బెంజిమేను కాడికెళ్లాల. ఊర్లు దిరిగి నేనొచ్చే వొరుకూ ఆగినావంటే నే రాంగానే ఇద్దరం కల్సి బజారుకెళ్దాం. కోరిన ముక్కుపుడక కొందాం. అంతవొరుకూ ఆగలేనంటవో రేపు నువ్వే ఎళ్ళి కొనుక్కో. ముంతలో డబ్బులు ముక్కుపుడక్కి సాల్తయ్యిలే!" అన్నాడు పేతురు.

మార్తమ్మ ఏదీ నిర్ణయించుకోలేకపో యింది. అలా ఆలోచిస్తూ ఎంత సమయం గడిపిందో కానీ పేతురు భళ్ళున వాంతి చేసుకొని మంచంమీద విలవిల్లాడిపోతోంటే దిగ్గున లేచి నిల్చుంది. పిల్లల్ని నిద్రలేపింది. పొరుగింటి వాళ్ళనూ లేపింది. జరిగింది చెప్పింది. ఎవరో వెళ్ళి రిక్షా తెచ్చారు. పేతుర్ని రిక్షాలోకి చేర్చారు. మార్తమ్మనూ ఎక్కించారు. పిల్లలకు తోడుగా భాగ్యమ్మ నుంచారు. రిక్షా ధర్మాసుపత్రికి దారితీసింది. భాగ్యమ్మ మొగుడు యోహాను సైకిలుమీద

రిక్షా వెంటే వెళ్ళాడు.

రిక్షా ఆస్పత్రి మెయిన్‌గేట్ ముందు ఆగింది. యోహాను, మార్తమ్మ రిక్షావాని సహాయంతో పేతుర్ని మోసుకొని ఆస్పత్రి లోపలికి తీసుకొని వెళ్ళారు.

"ఇంక నా బాడుగ డబ్బులిస్తే యల్తాను" పేతుర్ని ఆస్పత్రి బల్లమీద పరుండపెట్టిన వెంటనే అడిగాడు రిక్షా అతను.

మార్తమ్మ గుండె ఝల్లుమంది. బేలగా దిక్కులు చూసింది. అంతవరకూ ఆమె భర్తను గురించే ఆందోళన పడుతోంది కానీ డబ్బుల విషయం ఆలోచించలేదు.

"నీ కాడేమైనా డబ్బులుండాయా? " యోహాన్ను అడిగిందామె.

"ఉండాయిగానీ అయి నాయిగావు. రేప్పొద్దుగాల్నే దుకాణంలో యియ్యాల్సిన డబ్బులయి" చెప్పాడు యోహాను.

"పొద్దుగాలైతే నీ డబ్బులు నీకిత్తాను. ఇప్పుడు ఎంతకర్సయినా నువ్వేబెట్టు. నా డబ్బులు ఇంటికాడ ఉండాయి" ముక్కుపుడక కోసం ముంతలో దాచిన డబ్బులు గుర్తొచ్చి ధైర్యంగా అంది మార్తమ్మ యోహానుతో.

యోహాను జేబులోంచి డబ్బులు తీసి రిక్షా బాడుగ చెల్లించి అతడ్ని పంపించాడు. ధర్మాస్పత్రి సిబ్బందికీ, డ్యూటీ డాక్టరుకూ చేతులు తడిపాడు.

అంతా సవ్యంగానే జరిగింది. పేతుర్ని పరీక్ష చేసి ప్రమాదం లేదన్నాడు డాక్టరు. తిన్న ఆహారం అరగక వికటించిందని చెప్పాడు. ఇంజక్షను చేసి, మందులు రాసిచ్చి అవి వాడే విధానం వివరించి చెప్పాడు.

మార్తమ్మ గుండె కుదురుకుంది. భర్త అంత త్వరగా కోలుకున్నందుకు సంతసించింది. భర్తను రిక్షాలో ఎక్కించుకుని ఇంటికి తెచ్చింది.

డాక్టరు రాసిన మందులను కొని తెచ్చాడు యోహాను.

ఇంటికి చేరుకోగానే యోహాన్ను అడిగింది మార్తమ్మ "ఎంతియ్యాలి నీకు? " అని.

లెక్క చెప్పాడు యోహాను.

మార్తమ్మ నిర్వికారంగా వెళ్ళి ట్రంకు పెట్టెలో దాచిన డబ్బుల ముంత తెచ్చి కాయితం మీద బోర్లించింది. నాణేలన్నీ గలగలా కింద రాలేయి. వాటిని లెక్కించింది. యోహాను బాకీ చెల్లుకు కూడా యింకా కొంత కొరవేపడ్డాయా డబ్బులు.

ఉన్న డబ్బులను యోహానుకు పొట్లాం కట్టి యిస్తూ, "ఇంకా పది రూపాయలియ్యాల నీకు" అంది మార్తమ్మ.

యోహాను అభ్యంతరం చెప్పలేదు. మౌనంగా మార్తమ్మ అందించిన డబ్బుల పొట్లాం చేత్తో పట్టుకొని బైటికి దారితీస్తూ మంచంమీద మగతగా పడుకున్న పేతుర్ని పలుకరించాడు.

అతను పలుకలేదు.

"కొంచెంసేపు అట్టాగా పండుకున్నాక లెగుస్తాడ్లే... యల్దాం పద" అంటూ భాగ్యమ్మ కూడా లేచింది.

ఇద్దరూ గుడిసెలోంచి బైటికి వెళ్ళిపోయారు.

పిల్లల్ని మళ్ళా నిద్రపుచ్చింది. వాళ్ళు కదలకుండా పడుకున్న తర్వాత భర్త మంచం దగ్గర నిల్చొని అతడి ముఖంలోకి తొంగి చూసింది.

పేతురు అప్పుడే కళ్ళు తెరిచాడు. భార్య వేపు చూసి నీరసంగా నవ్వాడు.

రాత్రి అలా జరక్కపోతే తను పొద్దున్నే లేచి బెంజిమెన్ వెంట వెళ్ళేవాడు. మార్తమ్మ కోరికప్రకారం ఆమె వెంట బంగారం కొట్టుకు వెళ్ళి ముక్కుపుడక కొనటం యివ్వాళ కుదిరేదికాదు.

దేవుడలా తనను అనారోగ్యంతో కట్టడి

చేసి యింట్లోనే వుంచినందుకు అదంతా భాగ్యమ్మ అదృష్టమే అనుకున్నాడతను.

"అంతా సామిదయనే! నీ యంటొచ్చి ముక్కుపుడక కొనమనే ప్రెభువిట్టా సేసిండు. లేకపోతే యీ సరికి నాను బెంజి మేను యంట ఎళ్ళేవాణ్ణి"

విషాదంగా నవ్విందామె.

సత్తుగిన్నెలో కొంచెం అన్నం, మజ్జిగ కలిపి బాగా పిసికి పిండివేసింది. "ఈ జావ తాగి పండుకో" అంది భర్తకు గిన్నె అందిస్తూ.

గిన్నె అందుకుని గిన్నె అంచును పెదా లకు అంటించి నెమ్మదిగా జావ తాగేడ తను. ఖాళీ గిన్నెను తిరిగి యిస్తూ "తెల్లా ర్తుండాది" అన్నాడు.

"తెల్లార్తే యేమాయెగానీ పండుకో" అంది మార్తమ్మ.

లేచి కూర్చున్నాడతను.

"నిమ్మలంగానే వుండాది నాకు. బెంజి మేను పని ఎటూ సెడిందిగా! మనం ఎళ్ళి ముక్కుపుడక తెద్దాం" అన్నాడు.

మార్తమ్మకు ఏం చెప్పాలో తోచలేదు.

"ఆ యవ్వారం యిప్పుడేంటికీ సప్పుడు జెయ్యక పండుకో" అంది.

ముక్కుపుడక అంటేనే ముఖం చాటంత చేసికొనే మార్తమ్మ యిప్పుడంత నిర్లిప్తంగా ఎందుకు ఉన్నదాని ఆలోచించాడు పేతురు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది!

"ఆస్పత్రికీ మందులకీ కర్సయింది గదూ? " అడిగాడు.

ఆమె మౌనంగా తల దించుకుంది.

"ముంతలో దాపెట్టిన డబ్బులు కలా సైనె గదూ? " అడిగాడు.

ఆమెకు నిజం చెప్పబుద్ధి కాలేదు. చెబితే భర్త బాధపడతాడని ఆమెకు తెలుసు.

అందుకే సమాధానం చెప్పకుండా మౌనం వహించింది.

ఆ మౌనం, ఆ నిర్లిప్తతా చాలు భార్య మనోగతాన్ని గ్రహించేందుకు!

ఇలా రహస్యంగా గుండె ఆవేదనతో ఆవి రైనా ఫర్వాలేదు. గంభీరంగా నటించవచ్చు కానీ ఆమె పెదవి విప్పి నిజం చెబితే అతడి ఆవేదన అవధులు దాటుతుంది. దాంతో ఆమె కూడా ఆవేదనపడుతుంది.

జమిలిగా కుమిలిపోవటం మినహా ఒరిగే దేముంటుంది గనుక!

"పోనీలేయే... దేవుడు సక్కంగ సూత్తే ముక్కుపుడకదేం భాగ్గెం! యియ్యాళ గాకుంటే రేపుగొనకపోతామా" అంటూ అమాంతం ముసుగుదన్ని కదలకుండా పడుకున్నాడు.

రెండురోజుల తర్వాత తెలిసింది పేతు రుకు వంట్లో బాగోలేదని బెంజిమన్ 'ప్రజా సేవ' పనికి వెంకటేశ్వర్లును తోడు తీసుకొని వెళ్ళాడట. అతనూ బెంజిమెన్ కలిసి తుపాను బాధితులకోసం సేకరించిన బియ్యాన్ని బజార్లో అమ్ముతూ పట్టుబడ్డా రట. అతనికున్న పలుకుబడివల్ల బెంజి మెన్ను తప్పించి కేసు మొత్తాన్ని వెంకటే శ్వర్లు మీద మోపి చట్టం తనపని తాను చేసుకొని పోతోందట!

కీడులో మేలంటే అదే కామోసు, పేతురు జబ్బుపడడం మంచిదైంది. అలా జబ్బున పెట్టి తన భర్తను కాపాడిన దేవుడి కృపకు మార్తమ్మ అణువణువూ ఆరాధనతో పులకిం చింది. "ప్రెభువు దయశాత మగడు జబ్బున పడిండుగానీ లేకుంటే యంకటే శ్వర్లు బదులు తను జేలు పాలయ్యేవోడు" అంటూ గుండెలు బాదుకుంది.

అలా ముక్కుపుడక ముంత వట్టిబోయినా జెయిలు గండం తప్పినందుకు పేతురు కూడా సంతోషించాడు. ఆ సంతోషమే సగం బలమైంది. త్వరలోనే కోలుకొని మళ్ళీ చర్చిదగ్గరికి వెళ్ళడం, చింతచెట్టు నీడలో




కూర్చొని చెప్పులు కుట్టటం మొదలుపెట్టాడు. మళ్ళీ డబ్బులు సంపాదించడం ఇంటి అవసరాలకు పోను కాస్తో కూస్తో ముంతలో దాచటం ప్రారంభమైంది.

మళ్ళీ కొన్ని యుగాలు గడిచి ముంత నిండబోతోందనగా ఏదో ఒక అవాంతరం. అది గడిచి గట్టెక్కి మళ్ళీ డబ్బులు దాచటం, మళ్లీ ఏదో అవాంతరం ఎదురవటం అలా ముక్కుపుడక ముంత నిండుతూ ఖర్చవుతూ, మళ్ళీ నిండుతూ మళ్ళీ ఖర్చవుతూ... విధి తమ జీవితాల్లో ఎన్నెన్ని చమత్కారాలు చేసిందో, అనుకుంటూ ఉంటుంది మార్తమ్మ!

అలా గతంలోకి కూరుకుని వెళ్ళి శిలలా నిల్చున్న భార్యను చేత్తో తట్టి పిల్చేడతను. అప్పటికే అతను ఖాకీ సంచి చేతపట్టుకొని బైటికి వెళ్ళేందుకు తయారయ్యాడు.

ఉలిక్కిపడి బాహ్యప్రపంచంలోకి వచ్చిందామె.

“నేను సెర్చికాడికి యల్తన్నాగానీ పిల్లల్ని లెగిపి బువ్వ దినిపియ్యి. అంకిరెడ్డిగోరి గేదె సచ్చిందంట. పెద్దోణ్ణి ఎళ్ళి బండిమీద యాసక రమ్మని సెప్పు” అని భార్యను పురమాయించి గుడిసె బైటికి వెళ్ళిపోయాడు.

ఆమె కూడా భర్త వెనకాలే బైటికి వచ్చింది. చుట్టలక్కూడా రూపాయి లేకుండా వెళ్తోన్న భర్తవేపు అతడు కనుమరుగయ్యేదాకా చూస్తూ నిల్చుండిపోయింది.

★ ★ ★

పేతురు వెళ్ళిన కొంచెంసేపటికి పిల్లలు నిద్రలేచేరు. మార్తమ్మ వాళ్ళచాత ముఖాలు కడిగించింది. స్నానాలు చేయించింది. అన్నం పెట్టింది.

అన్నం తినగానే పెద్దబ్బాయి ఏలియా చచ్చిన గేదెకోసం అంకిరెడ్డి ఇంటికి వెళ్ళేడు. చిన్నబ్బాయి క్రిష్టోఫర్ ఆటలకూ, అమ్మాయి మేరీ రిబ్బను కొనుక్కుందుకూ వెళ్ళారు.

ఇంటిపని, వంటపని ముగించింది మార్తమ్మ. భర్త సాయంత్రంగానీ ఇంటికి రాడు. పిల్లలు ఎక్కడెక్కడో తిరిగి ఆడుకొని మధ్యాహ్నం ఆకలి వేళకు వస్తారు.

మార్తమ్మకు ఉబుసుపోవటంలేదు. నులక మంచంమీద అలా చాలాసేపు కూర్చుని విసుగుచెంది కాలక్షేపంకోసం భాగ్యమ్మ ఇంటికి వెళ్దామని లేచింది.

భాగ్యమ్మ గుర్తుకు రాగానే ముక్కుపుడక గుర్తొచ్చింది.

భాగ్యమ్మ కొనుక్కున్న ముక్కుపుడక నిజంగానే ఎంత బాగుందో! కాకుంటే అది భాగ్యమ్మ ముఖానికి నప్పదు. ఆమె లావుగా గుమ్మటంలా ఉంటుంది. చాటకు మల్లే వెడల్పాటి ముఖం. అది కూడా తెల్ల వార్లూ తాగినవాడి ముఖానికి మల్లే ఉబ్బి, ఎక్కడో గుంతలో గోళీల్లా లోతు కళ్ళూ, గుబురుగా పెరిగి అసహ్యంగా కనిపించే కనుబొమలూ, చలిమిడి ముద్దలాంటి గుండ్రటి ముక్కూ, నూనెతో మర్దించిన కాకికి మల్లే నల్లగా జిడ్డోడే వంటి రంగూ, తీరూ.

ముక్కుపుడక బాగుందిగానీ భాగ్యమ్మకు అది నప్పలేదు అని మనసులోనే అనుకుంది మార్తమ్మ. నిజం చెప్పాలంటే ఆ ముక్కుపుడక అందం పోయింది, అది భాగ్యమ్మ ముక్కునపడి.

అదే తన ముక్కుకు ఉంటే ఎంత బాగుంటుందో! తను అందంగా ఉంటుంది. ఎర్రటి వంటి రంగూ, అంత లావూగాని సన్నమూ కాని శరీరం. ఎత్తూ అందుకు తగిన వంపులూ, నాజూగ్గా కనిపించే సింహం నడుమూ.

ముఖం కూడా బాగుంటుంది! అద్దాల్లా మెరిసే చారెడేసి కళ్లూ, కోల ముఖం... కోటేరు ముక్కూ.

తన ముక్కుకు భాగ్యమ్మ ముక్కుపుడక పెట్టుకుంటే తనవల్ల దానికీ, దానివల్ల

తనకూ మరికొంచెం అందం యినుమడి స్తుంది.

ఒక్కసారి భాగ్యమ్మను అడిగి ఆమె ముక్కుపుడక తీసికొని తన ముక్కుకు పెట్టుకొని అద్దంలో చూసుకోవాలనిపించింది మార్తమ్మకు. తనకు కూడా ముక్కు పుడక పెట్టుకొనే రంధ్రముంది ముక్కుకు. అది పూడిపోకుండా సన్నటి చీపురుపుల్లా ఉంది. ఇక లేనిదల్లా ముక్కుపుడకే! భాగ్యమ్మను అడిగి కొంచెంసేపు ముక్కుపుడక పెట్టుకొని అద్దంలో చూసుకుంటే ఆ మురిపెంకూడా తీర్తుంది.

మార్తమ్మ యిక ఆలస్యం చెయ్యలేదు. అద్దంలో చూసుకుంటూ ముంగురులు సవరించుకుంది. ముక్కు రంధ్రానికి ఉన్న చీపురుపుల్లను గోళ్ళతో పట్టిలాగి, మళ్ళీ అవసరానికి భద్రంగా గూట్లో దాచింది. చీర కుచ్చిళ్ళు సరిచేసికొని బైటికి వెళ్ళింది. తడక తలుపు వేసి తాడుతో బిగించి భాగ్యమ్మ ఇంటికి దారితీసింది.



ఇంట్లోంచి వెళ్లిన పేతురు మాదిగపల్లె దాటేడు. పల్లెకూ ఊరికీ మధ్యనున్న ఖాళీ స్థలమూ దాటి ఊళ్ళోకి వెళ్ళాడు. చర్చి దగ్గరికి చేరేడు. చెట్టుకిందే ఉన్న అరిగిపోయిన మొండి చీపురుతో రెండు గజాల స్థలం ఊడ్చి చీపుర్ని మళ్ళీ చెట్టుకింద గిరాటేశాడు. గోనె పట్టా పరిచేడు. ఖాకీ సంచి లోంచి చెప్పులు కుట్టే సామాన్లను బైటికి తీసి పట్టామీద పెట్టేడు. సంచిని విదిలించి అడ్డంగానూ, మళ్ళీ నిలువుగానూ మడిచి చెట్టు మానుకు ఆన్చిపెట్టి గోనె పట్టామీద కూర్చున్నాడు.

కొంచెంసేపటికి తెగిన చెప్పులను కాళ్ళతో యీడ్చుకుంటూ వచ్చేడు వెంకటేశ్వర్లు. పేతుర్ని చూసి పలకరింపుగా నవ్వేడు. కాళ్ళకున్న చెప్పులను విదిలించి వదలి "కొంచెం ఆలస్యమైనా ఫర్వాలేదుగానీ జాగ్రత్తగా కుట్టు" అన్నాడు.

చుట్టముక్కక్కూడా డబ్బులు లేని సమయంలో అలా పొద్దున్నే బోణీ తగిల్నందుకు పేతురుకు చాలా ఆనందం అనిపించింది. వెంకటేశ్వర్లు విడిచిన చెప్పుల్ని చేతుల్లోకి తీసికొని పరీక్షగా చూసేడు. "ఉంగటాలు దెగినాయి. అడుగులు అరిగిపోనాయి. మడాలు ఊడ్తుండాయి. కొత్త సెప్పులు గొనరాదంటనే" అనబోయి ఆగిపోయేడు.

'సరే... అలాగే కొంటాన్లే' అని వెంకటేశ్వర్లు పాత చెప్పులు బాగుచేయించుకోకుండా కంపెనీ చెప్పులు కొనేందుకు వెళ్ళిపోతే తగిలిన బోణీని చేతులారా చెడగొట్టుకున్నట్టే!

"నిన్ననే కొత్తంగా సొల్యూశను తెచ్చినాను. శానా మంచిదది. నీ సెప్పుల్నిగాని అడుగులూ, ఉంగటాలూ పీకి ఆ సొల్యూశన్తో అంటించినానంటే యింక సెప్పులు అరిగిపోవాలగానీ అతుకులూడవు" అంటూ పట్టామీద కూర్చున్న వాడల్లా అంగుళం పైకి లేచి గోనెపట్టాను కొంచెం పక్కకు జరిపి "కూకోయే... యంకటేశర్లన్నా" అన్నాడు అభిమానంగా.

వెంకటేశ్వర్లు తాపీగా పట్టామీద కూర్చున్నాడు.

చెప్పుల్ని గుండ్రాయికేసి బాది దుమ్ముదు

లిపేడు పేతురు. అప్పుడు గుర్తొచ్చి వెంకటేశ్వర్లును అడిగేడు. "అన్నా! బెంజిమేను నిన్ను కేసులో యిరికిచ్చి తను మాత్తరం తప్పిచ్చుకుండంటగదా? అసుమంటి యదవపని ఏంటికి సేసిండు? " అని.

వెంకటేశ్వర్లు పేతురువేపు అజ్ఞానిని చూసిన జ్ఞానిలా చూసేడు.

"అందులోనే ఉంది బెంజిమన్ తెలివంతా! నాతోపాటు అతనూ కేసులో యిరుక్కుంటే పైరవీలకూ, బెయిళ్ళకూ ఎవరు తిరుగుతారు? అందుకే అతను తెలివిగా తప్పించుకున్నాడు. మన ఊరినీ హైద్రాబాద్‌నూ ఏకం చేశాడు. పోలీసులకు ఒకటే ఫోన్లు! చివరికి మంత్రుల బాధ పళ్ళేక పోలీసులు నామీద పెట్టే కేసు మాత్రమే పెట్టి మొదటి ప్రయత్నంలోనే బెయిలొచ్చేట్టు చేశారు. అప్పటిదాకా బెంజిమన్ నిద్రపోలేదనుకో! పైగా బెయిలిప్పించి నేను బైటికి రాగానే వెయ్యి రూపాయలు రొఖ్ఖం కూడా యిచ్చాడు. తెలియని వాళ్ళేదో అనుకుంటారు కానీ నిజానికి బెంజిమను శానా మంచోడు" అని చెప్పేడు వెంకటేశ్వర్లు.

పేతురు ఎక్కడో ఆలోచిస్తూనే వెంకటేశ్వర్లు చెప్పులను మళ్ళీ ఒకసారి గుంద్రాయి మీద బాదేడు.

"బంగారం కొట్లు తెరిచే టైమైందా? " అడిగేడు వెంకటేశ్వర్లు.

"ఏమో... నాకేటి తెలుసూ! ఐనాగానీ యీ సెప్పులు బాగయ్యేపాటికి తెరవరా!" అన్నాడు పేతురు. అంతలోనే అతను బంగారం కొట్టు విషయం అడిగింది ఎందుకో తెలిసికోవాలన్న కుతూహలం కలిగి "ఇంత పొద్దుగాల బంగారం కొట్టుకి యల్తన్నావేంటి కత? " అని కూడా అడిగేడు.

బంగారం కొట్లో రకరకాల ముక్కుపుడకలుంటాయని పేతురుకు జ్ఞాపకం వచ్చింది. అది జ్ఞాపకం రాగానే మార్తమ్మ కూడా జ్ఞాపకం వచ్చింది.

"మరేంలేదు. బెంజిమన్ యిచ్చిన డబ్బులతో మా ఆవిడకు కాలిపట్టీలు కొనాలి" చెప్పేడు వెంకటేశ్వర్లు.

"ముక్కుపుడకలు గూడా ఉంటాయిగా ఆడ! నీ బార్యకి ముక్కు పుడగ్గూడా కొన్రాదూ! అస్మంటియంటే ఎంత బ్రెమో ఆడాళ్ళకి. అయి బెట్టుకుంటే సక్కంగగూడా ఉంటారు. ఎటూ బెంజిమేను డబ్బులిచ్చిండు గదా, పట్టీలతోపాటు ముక్కుపుడకా కొను. భాగెవా, బంగారవా ముక్కుపుడక ఎంతవుద్దనీ..."

"మా ఆవిడకు ముక్కుపుడకేగాదు, బంగారపు గొలుసూ ఉంది. నానుతాడు ఉంది. రెండుంగరాలూ, నల్లపూసల గొలుసూ ఉన్నాయి. కాలిపట్టీలు గూడా ఉండేవిగానీ అరిగిపోయి జారిపోతున్నాయని తీసి పెట్టెలో పెట్టింది" చెప్పేడు వెంకటేశ్వర్లు.

పెళ్ళానికి అన్ని బంగారపు వస్తువులు చేయించటం మానవమాత్రులకు సాధ్యంకాదనీ అలాంటిది సాధించిన వెంకటేశ్వర్లు అద్భుతమైన వ్యక్తి అన్నంత అబ్బురంగా అతనివేపు చూస్తూ,

"అయితే, నీ భార్యకి ముక్కుపుడకుండాదా? " అని అడిగేడు పేతురు.

వెంకటేశ్వర్లు తల పంకిస్తూ గర్వంగా నవ్వేడు.

అతడి గత చరిత్ర పేతురుకు తెలియందేమీ కాదు! పదేళ్ళ క్రితం దాకా వెంకటేశ్వర్లు పళ్ళెంలో బజ్జీలు, పునుగులూ పెట్టుకొని వీధుల్లో తిరుగుతూ అమ్మేవాడు. రాత్రి వేళల్లో సినిమాహాళ్ళదగ్గర బ్లాకులో టిక్కెట్లు అమ్మేవాడు.

ఆవిడెవరోగానీ మొగుడుచచ్చి ముండమోసిన మూడునెలలకే అర్ధరాత్రివేళ అరుపులకు లేచింది. తనను దేవత పూనిందనీ, యికపై భూతభవిష్యద్వర్తమాన కాలాలను మనోనేత్రంతో వీక్షిస్తూ సర్వజనుల యోగక్షే

మాలకు తానే కర్తగా ఉంటానని మారాంచే సింది. బట్టలు మార్చింది. కాషాయాంబరా లకు పరిమితమైంది. దర్శించుకున్న భక్తు లకు ఉజ్వల భవిష్యత్తు కల్పించేందుకు హామీలు యిచ్చింది. ఆ హామీలకు భరో సాగా తాయెత్తులూ, మంత్రించిన పుష్పాలూ యిచ్చింది. అమ్మవారిలా అవతారం ఎత్తింది.

క్రమంగా భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగిపోవటంతో తన వ్యాపారానికి అమ్మ వారి ఇల్లే అనువైన చోటుగా భావించి భక్తు లకు బజ్జీలు అమ్ముతూ ఆ ఆశ్రమం ముందే కుదురుకున్నాడు వెంకటేశ్వర్లు.

రాత్రివేళల్లో అమ్మవారి ఆశ్రమంలో భజ నలు జరిగేవి. అప్పటికి పళ్లెంలో బజ్జీలు అయిపోతే, యిక ఉబుసుపోక అతను కూడా బజ్జీల పళ్ళేన్ని భద్రంగా దాచిపెట్టి భజనలు చెయ్యటం మొదలుపెట్టాడు.

అతగాడిది భారీ విగ్రహం. మాంచి వొడ్డూ- పొడుగూ, బలంగా పిడిరాయికిమల్లే ఉంటాడు. ఆరోగ్యానికి తోడు కంచుగొంతూ, ఆ కంచు గొంతుకు తోడు పాటకారి తనమూ.

అలా భజనల్లో కీర్తనలు పాడుతూ పాడుతూ అమ్మవారికి సన్నిహితమ య్యాడు. ఆ సాన్నిహిత్యం మరింతగా బల పడి ఆశ్రమాధిపత్యం వహించేస్థాయికి ఎది గేడు. బజ్జీలు అమ్మటం మానివేసి భజన లకు పరిమితమయ్యాడు. బ్లాకుటిక్కెట్ల జోలికి మళ్ళీ వెళ్ళలేదు.

ఒకరోజు అర్ధరాత్రి అమ్మవారి పవళింపు గదిలో మరి ఏం జరిగిందో కానీ అమ్మవారి గావుకేకలు ముందుగా వినిపించాయి. ఆమె కేకలు ఆగిపోయాక గది బయట కనిపిం చాడు వెంకటేశ్వర్లు.

అమ్మవారి అరుపులు విని వచ్చినవారితో 'అమ్మవారికి శివసాయుజ్యం కొరకు పిలుపు వస్తే ఉన్నఫళంగా వెళ్ళిపోయారనీ వెళుతూ వెళుతూ భూగోళాన్ని ఆశించిన దుష్టశక్తు లను గద్దించి మరీ వెళ్ళారనీ, ఆ గద్దింపులే వినిపించిన అరుపులనీ' చెప్పేడు.

అమ్మవారి భౌతిక శరీరంనుంచి హంస లేచిపోయి, వారి సూక్ష్మశరీరం శివైక్యం కావటంతో ఆశ్రమం వెలా తెలాపోయింది. భజనలు ఆగేయి. పూజలూ, వ్రతాలూ ఆగేయి. భక్తజన సందోహం కనిపించటం లేదు. ఆశ్రమం కొడిగట్టిన దీపంలా కాంతి వాడింది. క్రమంగా అది జనం హృదయా ల్లోంచి చెరిగిపోయింది.

తన చావుకు ముందే అమ్మవారు తమ ఆశ్రమాన్నీ, ఆస్తులనూ తనకు దఖలుచేస్తూ రాసిచ్చారని వెంకటేశ్వర్లు దస్తావేజులు చూపించాడు. కొంతకాలం ఆగి, అటుపైన ఆశ్రమాన్ని బార్ అండ్ రెస్టారెంటుగా మార్చాడు. దాని పెట్టుబడికి ఆశ్రమానికి చెందిన యితర ఆస్తులను తెగనమ్మేడు.

అలా హాయిగా సారా వ్యాపారంలో కుదు రుకొని జీవితానికి ఢోకా లేనంతగా ఆర్థిక భద్రత సమకూరేక నెమ్మదిగా రాజకీయాల వేపుకు మళ్ళేడు. బెంజిమన్‌తో కలిసి పని చేస్తూ యిప్పుడిప్పుడే నాయకత్వంలోకి వస్తు న్నాడు.

'ఛూత్-నీ యవ్వ! యధవాయితనం లేకుండా, మందిని ముంచకుండా, లోకుల శ్రమను దోచకుండా, సెబ్బరపన్లు సెయ్యా కుండా, సివరాకరికి దేవుళ్ళనూ, దెయ్యా లనూ, మడుసులనూ, పసరాలనుగూడా యాపారంగా మార్సి రూపాయలు సెయ్యందే సిన్నోడు ఛణంలో పెద్దోడు గావటం కల్లోని మాట'! అనుకొంటూ కొంత కసిగానూ, కొంత ఆవేశంగానూ వెంకటే శ్వర్లు చెప్పుల్ని బలంగా గుండ్రాయికేసి బాదేడు పేతురు. దుమ్మంతా వొదిలేక సహం ఊడిన చెప్పు అడుగులను సొంతం ఊడపీకేడు. పైముక్క అడుగునా, కింది ముక్కపైనా 'ఉసిక్కాయితం'తో బరబరా రుద్దుతూ ఆలోచనలో పడ్డాడు!





మార్తమ్మకు ముక్కుపుడక కొనలేకపోతో న్నందుకు అతడికి మనసులో ఎంత కసిగా వుందో అంత బాధగానూ వుంది.

చివరికి యోహాను కూడా భార్యకు ముక్కుపుడక కొన్నాడంటే అలాంటివా ళ్ళంతా తనకన్నా అదనంగా చేస్తోన్న శ్రమ అంటూ ఏదీలేదు. ఒకవిధంగా ఆలోచిస్తే శ్రమకూ ఫలితానికీ అసలు సంబంధమే లేదు.

తను మార్తమ్మకు ముక్కుపుడక ఎందుకు కొనిపెట్టలేక పోతోన్నాడూ?

తన శ్రమతో చెప్పులు తయారవుతు న్నాయి. పాత చెప్పులు బాగవుతున్నాయి. ఉత్పత్తి కళ్ళకు కనిపిస్తోంది. ఆ ఉత్పత్తి విలువ తన విలువకు మించిపోదు. తనలా చెయ్యకుండా ఎవడో యంత్రాలమీద చేసిన చెప్పుల్ని లక్షల పెట్టుబడితో అద్దాల బీరు వాల్లో పెట్టి అమ్మిస్తేనే భార్యకు ముక్కుపు డక కొనగల్గినా, మురిపేలు తీర్చినా!

తనకు అది ఈ జన్మకు సాధ్యంకాదు.

అంటే ఈ జన్మకు మార్తమ్మకు ముక్కుపు డకలేదు.

ఇలా కాకుండా దొంగలానో పట్టుపురుగు లానో పిశాచం వంటి పీడకుడిలానో రాజకీ యంగానో బ్రతికితే బావుంటుందేమో?

అమ్మో! ప్రతిష్ట పోతుంది...

జనం చెడుగా చెప్పుకుంటారు...

కీర్తికి మురికి పడుతుంది....

మార్తమ్మ జాతకంలోనే ముక్కుపుడక లేదేమో. జాతకంలో లేనిది మనసుకు ఎలా తట్టిందబ్బా!

ఈ తప్పంతా కనిపించని దేవుడిదీ జాత కానిదీ కాదు. కనిపించే మనిషిదే! కానీ ఎవడు వాడు? ఎక్కడుంటాడు? ఎలా ఉంటాడు?

అతడ్ని నేనేమీ చెయ్యలేనా?

పేతురుకు గుండె ఆవిరై దుఃఖం పొంగింది. ఆ దుఃఖాన్ని మాటల రూపంలో బైటికి వెళ్ళగక్కితేనే తప్ప మనసు శాంతించదు.

"యంకటేశ్వర్లన్నా!" పిల్చేడు పేతురు.

"ఊఁ..."

"కోయిల గుడ్లు పొదిగిన కాకి గూడా దగా పడ్డానన్న దుగ్ధతోన కోయిల పిల్లల్ని పొడిసి సంపుద్దంట. కాకికాడికి నేనే సవటనయ్యానంటే నమ్మా! బతుకంతా దగా పట్టం మళ్ళా నిమ్మళంగా కోలుకు న్నాంక మళ్ళా మళ్ళా అట్టాగే దగా పట్టం... జల్మ యిగ యిట్టాగా పోవాల్నే గానీ నాకింక గేనంరాదు, అంతే!

"నీకింకా సెప్పలేదుగానీ నా భార్యకి ముక్కుపుడక మీన శానా బ్రెఁవ! కొందాఁ వంటే నా వల్లగాకుంది. కొన్లేదన్నది మర్చే పోవటం గూడా వల్లగా కొచ్చింది. ఇంతకీ నా దలిద్దరానికి ఎవురు బాద్యులో తెలవ టంలేదు.

"అన్నా! సెప్పులు గుట్టేవోడ్ని నేనెంతా? నా టికానా ఎంత? వొచ్చే సిల్లర డబ్బుల్తో బువ్వే దినాల్నో, బువ్వ దినకుండా దాపెట్టి ముక్కుపుడకే గొనాల్నో తెలవకొచ్చింది.

'నీకేంటికిరా అంతపెద్ద ఆశ?' అనొచ్చు గానీ అట్టాగా అంటే సమాదానం సెప్పలేను గానీ నాగ్గూడా ఆశుందంతే! అది తీర్లేదంటే తప్పు నాదా? ప్రెపంచకం తీరుదా? అన్నదే అర్ధంగావాల నాకు" అని ఏదో ఉద్వే గంతో చలించిపోతూ ఉసిక్కాయితాన్ని చెప్పు అడుగులమీద వేగంగా రుద్దుతూ...

"అన్నా! దాని ముక్కుపుడక యవ్వారంలో ఎంత కత నడిసిందో సెప్పనా!" అని మన సులో ఉన్న తన గోడును వెళ్ళబోసుకోటం ప్రారంభించాడు పేతురు.

"అది మా లగ్గమైన తొలిరేత్తిరే ముక్కుపు డక సేయిత్తానని మాటిస్తేనేగానీ మంచంకా డికి రానంది. ఎంతైనా మావ కూతురు గందా బింకం బోయింది. అలియిగాని ఆలో

శన లేంటిగా అనంగానే అలిగి కూకుంది. ఆ వజాన ఆలోశిచ్చీ ఆలోశిచ్చీ నిమ్మలంగా సెంతకి జేర్నాను. ముచ్చట్లు జెప్పి మురిపిచ్చినాను.

ఓసోస్, అదేటి భాగ్యంగానీ నిత్తెం రొండు టైరు సెప్పులకి ఆడరు దగిల్నా, దేవుడి కృప శాత మంది సెప్పులకి ఉంగటాలు దెగుతున్నా తొల్సారి కానుపుకల్లా ముక్కుపుడక కొననూ. అనంగానే అది సిన్నంగా నవ్వినాది. సెగదాకిన మైనవోలే కరిగిపోనాది.

అన్నా! అట్టాగా తొలిపాలి అక్కర గడిపి, యియ్యాల్టి దాంకా మా పెద్దోడు ఆరెతో వారు గోసెంతోడైనా, సిన్నోడు సిల్మా బండెనకమాల లగువెత్తేంతోడైనా పిచ్చిముండకి అవిర్తేనా ముక్కుపుడక!

కంటానీ అంతలేదు, మా గుంట ముండకి సదువుమీన బ్రెమేంటోగానీ పలకా బలపంగావాల్నని నిత్తెం గుక్కెట్టి యాడస్తాంటే దాన్ని సవర్దియ్యానే సరిపోలాంటే యింకా దానికి ముక్కుపుడకమీన బ్రెమేంటి కుంటాదీ... సందకాడే సచ్చూంటాది"

తొండలా తలెత్తి చూసేడు వెంకటేశ్వర్లు.

"మా అయ్యగూడా యిదే సింసెట్టుకింద యిట్టాగే సెప్పులు గుట్టేవోడు. జల్మంతా అట్టా వొంగుని సెప్పులు గుట్టిగుట్టీ గూనోడైండేవోగానీ సొంతంగా ఒక్క గుడిసెన్నా గట్టలేదు. పేదోడెవుడు పెళ్ళాం కోర్కెలు తీర్సిండుగానీ. గుడిసెమీన బ్రెమతో అమ్మ సచ్చింది. అమ్మమీన బ్రెమతో అయ్యా సచ్చిండు.

సెప్పాలిగానీకు, అయ్య ఆరె, కంటాని, దారబ్బంతి, టైరూ, యిసువంటియన్నీ దాపెట్టుకొనే కాకి సంచి, కూకునే గోనెపట్టా, యీ సెక్కపీటా, గుంబ్రాయీ... అన్నీ దరమం బ్రెకారం నాయే ఐనా మా అప్ప అడ్డం తిరిగినాది.

సట్టం మారిందంట. కొత్త సట్టం వొచ్చిందంట. ఆ వొచ్చిన కొత్త సట్టం బ్రెకారం ఆరె నాదైతే కంటానీ దాన్దంట. దారబ్బంతి నాదైతే కాకిసంచి దాన్దంట. గోనెపట్టా నాదైతే గుంబ్రాయి దాన్దంట. బ్రస్సూ, పాలీసు డబ్బా నాదైతే ఈ సింసెట్టు నీడ దాన్దంట"

"ఎట్టెట్టా? " అన్నాడు వెంకటేశ్వర్లు కుతూహలంగా.

"ఆ... సెత్తెబ్రెమాణకంగా అట్టాగే అడ్డం తిరిగినాది. అన్నా! ఆ వజాన ఏటి జరిగిందో సెప్పనా! దేవుడిచ్చిన నీళ్ళకాడ్నే రాత్రాలూ, రాత్రాలూ కొట్టుకుంటంటే అయ్యిచ్చిన ఆస్తికాడ మేం మాత్తరం కొట్టుకోవూ. కొట్టుకున్నాం అంతే! పోలీసోళ్ళొచ్చి అప్పనీ, నన్నూ టేశనుకు గుంజకపోనారు. నాకాడ యాభై, అప్పకాడ అరవై నూకి ఇద్దర్నీ దెయ్యాల కోర్టుకు బెట్టారు"

"దయ్యాలకోర్టా? " ఆశ్చర్యంగా అడిగేడు వెంకటేశ్వర్లు.

"ఆ... దెయ్యాలకోర్టే! సీపులో దొరికినాదని గవోర్నమెంటోళ్ళు పాడుబడ్డ బంగళాలో కోర్టు పెట్టారు. ఆడ దెయ్యాలుండాయంట. అందుకే దాన్ని దెయ్యాలకోర్టంటారు.

అన్నా! ఆడ మరి దెయ్యాలే ఉండాయో, బూతాలే ఉండాయో మనకేంటిగ్గానీ యిశారణ జేసి మా కేసులో నికార్సయిన దర్మం జెప్పారు"

"యావనీ...? "

"అప్ప అడిగిన కంటాని, కాకి సంచి, గుంబ్రాయీ అప్పకిస్తే వట్టి ఆరె, దారబ్బంతి, గోనెసంచి, పాలీసుడబ్బాతో పేతుర్నయిన నేను సెప్పులు గుట్టలేననీ, అందుశాతన కొత్త సట్టాన్ని సాటుకుబెట్టి మానవొత్తం బ్రెకారం ఆలోశిత్తే అప్పమాట సెల్లదన్నారు.

ఇంక సింసెట్టు యవ్వారంలోకొచ్చి ఆ సెట్టు నాదీగాదు అప్పదీగాదనీ, అది గవోర్నమెంటుదనీ తేల్చేసినారు. అయినాగానీ ఆ




సెట్టునీడ వొంశపారంపరియంగా మా ఆక్ర మణలో ఉందనీ, అయ్య సచ్చిండు గనుక ఆ అయ్యకు కొడుకున్నైన నా ఆక్రమణే సెల్లుద్ద న్నారు.

అట్టా ఎట్టా సెల్లుద్దో సెబుతూ, మాన వొత్తం ప్రెకారం పోతులూరి యీరబ్రెమ్మం అన్నట్టు కలిసివర్లో ఈరబోగ వసంతరా యుడు జల్మం అయ్యేదాకా వొంశపారంపరి యవే సెల్లుద్దన్నారు. రాజు కొడుకు రాజూ- మంత్రి కొడుకు మంత్రీ, ఎం.పీ. కొడుకు ఎం.పీ., యమ్మెల్లే కొడుకు యమ్మెల్లే, డాక్టేరు కొడుకు డాక్టేరూ, యాక్టరు కొడుకు యాక్టరూ.

అట్టాగా మానవొత్తం ప్రెకారం సింసెట్టు నాదే అన్నారు.

అప్పుడు సూడాలె మా అప్ప ముకం, సెప్పుకింద నలిగిన యిప్పపువ్వే ఐనాది.

నిజానికి యంకటేశర్లన్నా! ఆడ దెయ్యా లుంటేనేం, బూతాలుంటేనేంగానీ, సివరాక రికి దెయ్యాల కోర్టు దర్మంజెప్పే కళ్ళజోడు పెద్దాయన అన్నాడు గదా... సట్టాన్ని సాటుకుబెట్టి మానవొత్తం ప్రెకారం తోడబు ట్టిన ఆడది అప్పేననీ, అప్ప మొగుడు బావనీ సత్తెం జెప్పిండు!

ఆరె, కంటాని దారబ్బొంతి, కాకి సంచి, గుండ్రాయి, గోనెపట్టా, సింసెట్టూ అన్నీ నాయే అయినాయిగాన మానవొత్తం ప్రెకారం అప్పకీ, బావకీ నేను కొత్త సెప్పులు కొనియ్యాలనీ, అయిగూడా బాటా కంపెణీ సెప్పుల్నే గొనాల్ననీ తీరుపుజెప్పిండు.

దర్మప్రెభువా! అయ్య యిచ్చిన సావాన్లన్నీ అమ్మినా అప్పకీ, బావకీ బాటా సెప్పులు రావని సెక్కల బోర్లోంచే అరబోనానుగానీ దర్మంజెప్పే కళ్ళజోడు పెద్దాయన నాకాడికి ముందే అరిసిండు.

తీరుమానం ప్రెకారం, మానవొత్తం ప్రెకారం అప్పకీ, బావకీ ఆర్రోజుల్లోగా సెప్పులు కొనియ్యకపోతే ఏడ్రోజులు జేలు శిచ్చని!

అప్పుడు సూడాలె నా మొకం! అరిగిపోన టైరు సెప్పె ఐనాది. పెండ్లానికి ముక్కుపు డక కొందామని ముంతన దాపెట్టిన సిల్లర, అయ్యా సాలకపోతే దాని కాలిపట్టీలు తాక ట్టెట్టి అయ్యా- మొత్తం గలిపి అప్పకీ, బావకీ సెప్పులు గొని అట్టాగా జేలు శిచ్చ తప్పిచ్చు కున్నాను" అని చెప్పి 'ఉసిక్కాయితం' కిందేసి దాంతో రుద్ది గరుకు చేసిన చెప్పు అడుగులకు సొల్యూషన్ రాసేడు పేతురు.

సొల్యూషన్ రాసిన చెప్పు అడుగులను గాలిలో ఆరబెట్టేడు. అవి కొంచెం ఆరితే అప్పుడు అతికించాలి. ఉంగటాలు బిగిం చాలి.

ఆకాశంలో మరికొంచెం పైకి పాకేడు సూర్యుడు. చింతచెట్టునీడ కొంచెం పక్కకు జరిగింది. అది జరిగిన స్థానాన్ని ఎండ ఆక్ర మించుకుంది. పేతురు లేచి నిల్చున్నాడు. వెంకటేశ్వర్లునూ లేపేడు. కూర్చున్న గోనె పట్టాను నీడలోకి జరిపేడు. వెంకటేశ్వర్లును కూర్చోబెట్టాడు. తనూ కూర్చున్నాడు.

సాయంత్రం దాకా ఇదే తంతు. నీడ అలా చెట్టు చుట్టూ జరుగుతూనే వుంటుంది. దాని వెంట అతనూ జరుగు తూంటాడు. సాయంత్రానికి ఎండ ఓటమి పాలౌతుంది. కనుమరుగౌతుంది. నీడ రాజ్యమేలుతుంది. మరికొంచెం సేపటికి చీకట్లు కమ్ముకుంటాయి. అవి నీడను కూడా మింగి జోగుతూంటాయి. రాత్రి గడి చేక మళ్ళీ ఎండ పీఠం ఎక్కుతుంది. నీడను తోలేస్తుంది. నిత్యం అదే తంతు జరుగు తూంది గానీ చెట్టు మాత్రం స్థిరంగా వుంటుంది... ఎండి కూలేదాకా...ఎవరైనా కోసి కూల్చేదాకా!

చాలా సేపటినుంచీ మౌనంగా కూర్చున్న వెంకటేశ్వర్లు సన్నగా నిట్టూర్చాడు. కూర్చునీ, కూర్చునీ నడుములు నెప్పి పెడుతుంటే వంటి భారాన్నంతా ఒక తొడమీద మోపి

చెట్టు మానుకు ఆనుకుని కూర్చుంటూ "బంగారం కొట్లు తెరిచి వుంటారంటావా? " అని అడిగేడు.

పేతురు గుండెలో మండుతోన్న మంటల మీద పెట్రోలు చల్లినట్లయింది. ఏదో అన బోయిన వాడల్లా తమాయించుకున్నాడు. ప్రక్కనే వున్న పాలీషు పెట్టే బ్రష్షును చేత్తో అందుకొని నిష్కారణంగా కాలి గిలకమీద రుద్దుకుంటూ కూర్చున్నాడు.

"చెప్పవేం, బంగారం కొట్లు తెరిచుంటారం టావా? " మళ్ళీ అడిగేడతను.

"పేతురుకు చిర్రెత్తుకొచ్చింది. అంతగా కసురుకోవటం సభ్యత కాదని కొంత కసిరి నట్టే చెప్పాడు. "ఏవో... నాకేటి తెలుసూ! సెప్పులు బాగుసెయ్యంగానే కొట్లకాడికి లగెత్తి సూడు, తెలుస్తాది"



రోజూ తెల్లవారేసరికల్లా శుచిగా స్నానం చేసి ఇస్త్రీ బట్టలు కట్టుకొని అందంగా ముస్తాబై ఇంట్లోంచి వెళ్ళటం యోహాను దినచర్య. వాడకట్టు అందర్లోకీ కొంచెం అద నంగా చదువుకున్నాడు అతను. కొంచెం ఇంగ్లీషు, కొంచెం హిందీ కూడా మాట్లాట్టం వచ్చు మనిషి కూడా అందగాడే. కండలు తిరిగిన శరీరంతో శిల్పానికిమల్లే ఉంటాడు.

చదువువల్లన, వేషభాషలవలనా ఆ పల్లెలో యోహానుకు సహజంగానే ఓ ప్రత్యేక స్థానం ఏర్పడింది. పల్లెవాళ్ళకు గవ ర్నమెంటు ఆఫీసుల్లో పనులుపడ్డా, రాజ కీయ నాయకుల సిఫార్సులతో అవసరం పడ్డా వాళ్ళంతా యోహాన్ను ఆశ్రయిస్తారు. అడిగిందే తడవుగా అతను అందరికీ సహా యపడుతూంటాడు. ఆ సహాయంవల్ల ఎదు టివారికి కలిగే లబ్ధిని బట్టి డబ్బులు వసూలు చేస్తుంటాడు.

అతడి సంపాదన విషయంలో భాగ్య మ్మకు అమితమైన విశ్వాసం, నమ్మకం ఉన్నాయి కానీ అతడి స్త్రీ వ్యామోహాన్ని మాత్రం సహించలేకపోతోంది. భర్తకు ఎన్ని దురలవాట్లు ఉన్నా కొంతకాలం ప్రతిఘటిం చటం, క్రమంగా సర్దుకొని పోవటం చాలా మందికి పరిపాటేగానీ తన భర్త పరాయి స్త్రీలతో అక్రమసంబంధాలు కలిగి ఉండ టాన్ని మాత్రం ఏ స్త్రీ సహించదు.

భాగ్యమ్మ యోహానుతో ఘర్షణపడి అలిగి పుట్టింటికి వెళ్ళిపోయిన సందర్భాలూ ఉన్నాయి. అయినా యోహాను ఎంత మాత్రం సంకోచించకుండా భార్య వెనకాలే అత్తగారింటికి వెళ్ళేవాడు. బతిమాలి భార్యను తెచ్చుకొనేవాడు.

అలిగి పుట్టింటికి వచ్చిన తన కోసం భర్త వెంటపడి వచ్చాడన్న సంతోషం చాలు ఆమెకు. ఆ విషయాన్ని అన్ని ఇళ్ళకూ తిరిగి చెప్పి అందంగా ముస్తాబై భర్త వెంట బయల్దేరి వచ్చేది భాగ్యమ్మ.

అప్పుడు అతగాడి స్త్రీ వ్యామోహం అన్న బలహీనతపట్ల గల ఆగ్రహంకన్నా భర్త తనకు ఇచ్చిన ప్రాముఖ్యతకే ప్రాధాన్యత ఇచ్చేది భాగ్యమ్మ. ముసిముసిగా నవ్వు కుంటూ వెంట వచ్చేది.

అలాంటి అనుభవాలు వాళ్ళ సంసా రంలో చాలాసార్లు ఎదురైనాయిగానీ అలా ఎన్నిసార్లు ఎదురైనా ఒక్క సందర్భంలో కూడా భార్యను నిర్లక్ష్యపెట్టలేదతను. అందుకు కారణం ఒక్కటే! పురుషుడికి బల హీనతలకు తోడు కోపం కూడా ఉంటే మన శ్శాంతికి దూరం కావాలి. అలా కాకుండా ఆ బలహీనతలతోపాటు కించిత్తు లౌక్యం ఉంటే అంతా సజావుగా సాగిపోతుంది. ఆనందానికి అవరోధమూ ఉండదు- మన శ్శాంతికి కొదవా ఉండదు.

అలాంటి లౌక్యాన్ని జీర్ణించుకున్నాడు కను కనే యోహాను కుటుంబం ఇంకా ఛిద్రం కాలేదు.

పైగా భాగ్యమ్మ అడిగిందే తడవుగా చిన్న చిన్న కోర్కెలను కాదనకుండా తీర్చటం,




ఎప్పుడైనా పెద్ద కోర్కెలు కోరితే లౌక్యంగా వాయిదా వెయ్యడం తప్ప వాదనకు వీలు కల్పించడు.

నాలుగు రోజుల క్రితం హైదరాబాదు వెళ్ళి ఆ తెల్లవారుజామునే వచ్చాడు యోహాను. సూట్ కేసు బల్లమీద పెట్టి కాళ్లు కడుక్కొని తలకింద చెయ్యి పెట్టుకొని మంచంమీద పడుకున్నాడు.

భర్త బస్సుదిగి ఇంటికి వచ్చి తలుపు కొట్టగానే నిద్రలేచింది భాగ్యమ్మ. వెళ్ళి తలుపు తీసింది. "అయిద్రాబాదు ఇకనన్నా రానిచ్చిందా? " అంది వాకిట్లోనే.

ఆమె అలా ఎందుకు అన్నదో ఊహిం చాడు యోహాను. అందుకే హడావుడిగా ఇంట్లోకి వెళ్ళి సూట్ కేసును బల్లమీద పెట్టి కాళ్లు కడుక్కొని వచ్చి కట్టుగుడ్డలతోటే నిద్ర లోకి వెళ్ళిపోయాడు కానీ, వివాదంలోకి వెళ్ళలేదు.

భాగ్యం ముఖం చిటపటలాడిస్తూ చాప మీద అలాగే కూర్చుంది, మధ్య మధ్యలో భర్త ముఖంకేసి చూస్తూ.

కొంచెం సేపటికి తెల్లవారింది. ఇళ్ళ ముందు కళ్ళాపులు చల్లుతోన్న చప్పుళ్లు విని పించాయి. మనుషుల సంచారం తాలూకు ఆనవాళ్లు తెలిశాయి.

భాగ్యమ్మ భర్తవేపు కొరకొరా చూసింది.

అతగాడు ఇంటికి రాగానే కొంచెం సేప యినా తనతో లడాయి వేసుకొంటే ఆ అడ గాల్సిన సాలుగూ అడిగి- కడిగితే ఆమె కోపం తీరేది. మనసు శాంతించేది. ఈ పాటికి చక్కా వెళ్ళి ఇంటిముందు కసువూడ్చి కళ్ళాపి చల్లి ముగ్గులు కూడా పెట్టేది.

అలాంటి భాగ్యమ్మ ఇప్పుడు ఇంటిపనినే మర్చిపోయి, భర్త నిద్రలేస్తే తగువాడాలని ఎదురుచూస్తూ కూర్చుంది.

అతడు ఎంతకూ నిద్రలేస్తేనా!

అసలు నిజంగానే నిద్రపోతోన్నాడా? నటిస్తున్నాడా?

భాగ్యమ్మకు అనుమానం కల్గి లేచింది. కొప్పు ముడివేసి ఒదులుగా ఉన్న చీరకుచ్చి ళ్లను సరిచేసుకొంది. రెండు అంగల్లో మంచం దగ్గరికి వెళ్ళి భర్తవీపుమీద చేత్తో ఛెళ్ళున చరిచింది.

ఉలిక్కిపడి నిద్రలోంచి లేచి కూర్చున్నాడు యోహాను.

"తెల్లారింది లెగు" అంది భాగ్యమ్మ.

"అప్పుడే తెల్లవారిందా? "

"మడుసులకే గాదు కోళ్ళకీ, కుక్కలకీ, పచ్చులకీ, పసరాలగ్గూడా తెల్లారింది. ఇంకా నీకు తెల్లార్లేదంటే ఇక నువ్వు ఏ కోవలో కొత్తావో దేవుడికే ఎరిక!"

"ఎందుకే అంత కోపం... ఏం చేశాననీ"

"ఏటి సేసినావో నీ కెరికెలేదేంటిదీ! ఏదో సంగం పెట్టిచ్చి సర్కారుకాడ లోనిప్పిత్తానని ఆ రంకులాడిముండ ముత్తేలమ్మను వెంటే సుకునిగదూ నువ్వు హైదరాబాదు వెళ్లింది. పగటేళ పనిమీన ఆళ్ళకాడికీ ఈళ్ళకాడికీ దిరిగినా రేత్తిరిళ్లు లాడ్జింగులో ఏటి జేశారో తెలవదా నాకు. ఇంక నీ జల్మంతే! సక్కం గుండవు. సాపీగా సంసారం జెయ్యవు. సత్తేలు జెప్పవు. సత్తరగాయి నంజల్తోనే నీది లోకం. అదే బువ్వ, అదే ఊపిరి! అసు మంటి ఆవారా తిరుగుల్లు తిరిగినావంటే వొంట్లో ఓపికున్నంతకాలం సెల్లుద్దిగానీ రేపు మంచాన బడినావంటే ఎవుతో అంటి చ్చిన మాయదారి జబ్బులకి నే శాకిరి జెయ్యాల నీకు" అంటూ భాగ్యమ్మ అంటిం చిన తారాజువ్వలా ఇంకా ఇంకా పైకి లేస్తోంటే ఇక వినలేకపోయాడు యోహాను.

"ఇదంతా సర్వాబద్ధం" అన్నాడు బోన్లో ముద్దాయిలా.

"అబద్దవా! అబద్దాలాడినోళ్ళకి గత్తర్రా వాలి. నాకేటి అవుసరం అబద్దాలు సెప్పనూ? అది మా వొంశంలోనే లేదు"

అంది భాగ్యమ్మ.

"అయితే నాకు గత్తర రావాలంటావా? "

"అసత్తెంసెప్తే రావాల్నన్నానుగానీ నీకు రావాలన్లేదుగా"

యోహాను కొంచెం తడబాటు పడ్డాడు. ఇబ్బందిగా చూస్తూ కూర్చున్నాడు.

"నువ్వు ముత్తేలమ్మతో గల్సి అయిద్రా బాదు పోలేదూ? "

"వెళ్లాను"

"దానికి లోనిప్పిత్తానన్లేదూ? "

"అన్నాను"

"దాన్నెంటేసుకొని ఆఫీసులకు తిరగ లేదూ? "

"తిరిగాను"

"రేత్తిరిళ్లు దాంతో లాడ్జింగులో తొంగో లేదూ? "

"తొంగున్నాను"

భాగ్యమ్మ గయ్యిన లేచింది. "మడిసన్నాక కూస్తైన్నా గేనం ఉండాల. సేసిందే శబ్బర పనైతే సిగ్గుతో ప్రేణం యిడవాలగానీ ఇంకా సిగ్గిడ్సి సెప్తున్నావంటే ఏఁవనాల నిన్ను. ఇంక నీకు బార్యెందుకూ, సంసారం ఎందుకూ- దానికాడనే తొంగోరాదూ? పూల రంగడోలే తిరిగి తిరిగి బస్సెక్కి రాంగానే ఇల్లు గుర్తొచ్చిందంటే అదేమరి సంసార వంటే! నాకాడి మెతకదనం సూసి ఇంకా నువ్విట్టాగా జేసినావంటే ఈ తూరి పుట్టిం టికెళ్ళినానంటే ఇక జల్మలో రాను"

యోహాను దీర్ఘంగా ఆవులించాడు. అరచే తులతో ముఖం తుడుచుకున్నాడు. మళ్ళీ ఒకసారి ఆవులించి భార్యవేపు అభిమానంగా చూశాడు.

"ఎర్రిమొఖమా... ఎర్రి మొఖమా! హైద రాబాదు వెళ్తే లాడ్జింగుల్లో ఉండక మనకే మైనా అక్కడ ఇల్లుందా ఉండటానికి. ఏదో పనిమీద వెళ్ళాం. అది అయితే మనకూ బోలెడు డబ్బులొస్తాయి. అందుకే ఆమె వెంట వెళ్లింది నిజం. లాడ్జిలో ఉందీ నిజం. కానీ ఆమె మంచం ఆమెదీ, నా మంచం నాది. పైగా దాని మంచం తూర్పువేపు గోడకు ఆనించి వేస్తే నా మంచం పడమటి గోడకు వేశాను. ఇంకా ఎందుకైనా మంచి దని రెండు మంచాల మధ్య టీపాయ్ అడ్డం పెట్టాను. ఇంకెక్కడే మేం కలిసేది!"

"అయితే ఆడ గదిలో మూడు రేత్తిర్లు కల్సివుండా దాన్నంటలేదా? " కొంచెం కోపమూ, స్వరమూ తగ్గించి అడిగింది భాగ్యమ్మ.

"నీ తోడంటే నమ్మూ!..."

భాగ్యమ్మ ఆలోచన్లో పడింది. భర్తను నిష్కారణంగా అనుమానించానా? అన్న సందేహం కూడా ఆమెకు కలిగింది. ఇక ఆ విషయం ప్రస్తావించకుండా "మనకి డబ్బు లొత్తాయన్నావ్, ఏంటిదది? " అని అడి గింది ఆసక్తిగా.

"అదేనే భాగ్యం. ముత్యాలమ్మ చాత పెట్టి స్తున్న కోపరేటివ్ సొసైటీలో నీ పేరు, మీ నాన్న పేరు, మీ అన్నల పేర్లూ రాయిం చాను. ఇంకా చాలా వ్యవహారం ఉంది. ఆ వ్యవహారంలో మళ్ళీ ముత్యాలమ్మా, నేనూ రెండు మూడుసార్లు హైదరాబాదు వెళ్ళాల్సి వస్తుంది. వ్యవహారం అంతా సక్రమంగా జరిగి లోను శాంక్షనైతే నీ పుట్టింటివాళ్ళ పంట పండినట్టే" అంటూ యోహాను భార్య వేపు చూస్తూ కనుబొమలు ఎగురవేశాడు.

భాగ్యమ్మ ముఖం విప్పారింది. ఆమెకు సహజంగా ఉండే పుట్టింటి బలహీనతను ప్రయోజన పెట్టుకున్నాడతను. దాంతో భాగ్యమ్మ ఆలోచన మొగుడి అక్రమ సంబం ధాలమీదనుంచి పుట్టింటి పురోభివృద్ధికేసి మళ్ళింది.

"మా వోళ్ళకి ఏటంటావ్ లాభం? " అని అడిగింది, ఆలోచననించి తేరుకుంటూ.

"లాభం ఏమిటంటావా! ఆ సంఘంలో

ముత్యాలమ్మ ఒకర్తీ, దాని మొగుడూ... కలిసి దాని వాటా రెండు భాగాలు. ఇక మిగిలిందంతా మీ వాళ్ళదే!"

"అంటే? "

"సంఘానికి గవర్నమెంటు లోను ఇస్తుంది. అది పేరుకు మాత్రమే సంఘం కానీ ఆ సంఘం ఏమీ చెయ్యదు. బోర్డు మాత్రం ఉంటుంది. ఋంజూరైన లోను మాయమౌతుంది..."

అతడి భావం భాగ్యమ్మకు అర్థమై ఆనం దంతో తబ్బిబ్బవుతూ మొగుడివేపు మురి పెంగా చూసింది ఒక్కక్షణం.

అంతలోనే ఆమె ముఖం వాడిపోయింది కొంచెం. "ముత్తేలమ్మ యంట అయిద్రా బాదు ఎళ్లు. ఆపీసులకి దిరుగు. నేనేవీ అన్నుగానీ రేత్రిళ్లు లాడ్జింగు గదిలో మాత్తరం నిమ్మలంగుండు. దాని మంచం తూర్పుగోడకీ, నీ మంచం పడవటి గోడకీ ఎయ్యి. మంచాల మద్దెన అదేంటిదీ"

"టీ పాయ్!"

"ఆc... దాన్ని పెట్టటం మర్సేపోబాకు"

అంగీకారంగా తల ఊపేడు యోహాను.

భాగ్యమ్మ లేచి నిల్చుంది. "ఇంక నేఎళ్ళి కసువు లూడుత్తానుగానీ నువ్వు లెగిసి తానం జెయ్యి" చెప్పింది భర్తతో.

యోహాను మళ్ళీ ఆవులించాడు. పెదాల మధ్య చిటిక వేశాడు. "అడగటం మరచాను. పేతురుకు ఎలా వుంది? " అడి గాడు.

"మంచిగుంది. పనిగ్గూడా పోతుండాడు" చెప్పింది భాగ్యమ్మ.

"పాపం... ఆ రాత్రి మార్తమ్మ చాలా కంగారుపడ్డది. సమయానికి నేను ఉండి వాళ్ళ వెంట ఆస్పత్రికెళ్లాను గనుక సరిపో యిందిగాని లేకపోతే చాలా ఇబ్బందిపడేది" యోహాను భార్య కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

భాగ్యమ్మ బైటికి వెళ్ళబోయిందల్లా ఠక్కున ఆగింది. భర్తను సూది కళ్ళతో చూసింది. ఆ చూపుల్లో అనంతకోటి అను మానాలు.

"ఇంతకీ నువ్వారేత్తిరి ఆసుపత్తిరికి ఎళ్ళింది మడిసికి మడిసి సహాయం గుండా లనా? మార్తమ్మ సంతోసిచ్చుద్దనా? " అంది ఎకసెక్కెంగా.

అతడు భార్యకు సమాధానం చెప్పలేదు. మంచమీంచి లేచి వెళ్ళి సూట్‌కేసు తెరి చాడు. ఏదో ఎర్రకాయితం పొట్లాం బైటికి తీసి భార్య దగ్గరికి వెళ్ళి చేతిలో పెడుతూ-

"ఇవేంటో పొట్లాం విప్పకుండా చెప్పుకో చూద్దాం" అన్నాడు.

"మనసిప్పి సత్తెం సెప్తేనే తప్ప మడిసి కడుపులో ఏముందో తెలవకుంటే ఇంక పొట్లం ఇప్పకుండా అందులో ఏటున్నాయో ఎట్టా తెలుసుద్దీ? " అంది చురక అంటిస్తూ.

"ఐతే నేనే చెప్తాన్లే... అవి హైదరాబాదు ముత్యాలు. ఎటూ ముత్యాలమ్మ పనిమీద తిరుగుతున్నానుకదా! ఆమె డబ్బులతో నీకు ముత్యాలు తెచ్చాను. రేపు లోను రాగానే బంగారం కొని ముత్యాల గొలుసు చేయి స్తాను" చెప్పాడు యోహాను.

భాగ్యమ్మ ముఖంలో మతాబులు వెలి గాయి. ఆత్రంగా పొట్లాం విప్పి చూపింది.

పాలు కలిసిన స్వచ్ఛమైన కోనేటి నీటి బుడగల్లా ఉన్న ముత్యాల మెరుపును చూస్తూ అబ్బురపోయింది.

సరిగ్గా అప్పుడు లోపలికి వచ్చింది మార్తమ్మ.

అలాంటి సమయంలో యోహాను ఇంట్లో ఉండడు. పైగా హైదరాబాదు వెళ్ళినవాడు తిరిగి ఇంకా వచ్చాడో, రాలేదో తెలియదు. ఒకవేళ వచ్చినా అంత ప్రొద్దెక్కేదాకా ఇంట్లో ఉండడనుకొని ఏకంగా లోపలికి వెళ్ళింది మార్తమ్మ.

యోహాను కనిపించగానే వెనక్కు తిరిగి



వెళ్ళిపోదామా? ఎటూ వచ్చాను కనుక భాగ్యమ్మను పక్కకు పిలిచి ముక్కుపుడక అడుగుదామా? అన్నది ఏదీ తేల్చుకోలేక సంశయిస్తూ నిల్చుంది.

అది గ్రహించాడు యోహాను.

మార్తమ్మ ఇంట్లోకి రాగానే వెన్నెల వచ్చి నంతగా అతడికి ఆనందం అనిపించింది. ఆమె వెళ్ళిపోతే ఆ ఆనందమూ వెళ్ళిపో తుంది.

'అక్కడే నిలబడ్డావేం, వచ్చి కూర్చో' అని మార్తమ్మను తనే పిలుద్దామని నోటిదాకా వచ్చి కూడా భాగ్యమ్మ భయంతో ఆగాడు.

భాగ్యమ్మ అప్పుడు వెనక్కు తిరిగి చూసింది మార్తమ్మను.

అదే అనువైన సమయం అనుకొని, "ఏమే... భాగ్యం! నీ ముత్యాలు ఎలా ఉన్నాయో మార్తమ్మను అడుగూ..." అన్నాడు యోహాను క్రీగంట మార్తమ్మనే చూపులతో కొరుక్కుతింటూ.

భాగ్యమ్మ క్షణం ఆలస్యం చెయ్యలేదు, "ఆడనే నిల్సున్నావేం, వొచ్చికూకో" అంటూ ఒకచేత్తో ముత్యాల పొట్లాన్నీ మరోచేత్తో మార్తమ్మనూ పట్టుకొని బలవంతంగా గుంజి ఆమెను మంచంమీద కూర్చుండబె ట్టింది. ముత్యాల పొట్లాన్ని మార్తమ్మ వడి లోపెట్టి

"అసుమంటిసుమంటి ముత్తేలుగావు, అయిద్రాబాదు ముత్తేలు. రేత్తిరి వత్తా వత్తా మీ బావ తెచ్చిండు. బాగుండాయా? " అని అడిగింది.

మార్తమ్మకు అక్కడ చాలా అస్తహనంగా ఉంది. పైగా భాగ్యమ్మ ముక్కుపుడక చూపించిన క్షణంనుంచి తను అందుకు నోచుకోలేదన్న బాధతో నలిగిపోతోంటే ఇప్పుడు ముత్యాలా!

సభ్యత కోసం కాయితంలోనే ముత్యాలను అటూ ఇటూ పొర్లించి చూసింది మార్తమ్మ. ఆమెకు ముత్యాల గురించి బొత్తిగా తెలీదు. అయినా ఆ విషయం చెప్పకుండా.

"శానా బాగుండాయి!" అంది తలవంచు కుంటూ.

యోహాను లేచి చెక్క కుర్చీలో కూర్చు న్నాడు. భాగ్యమ్మ గమనించనప్పుడల్లా మార్తమ్మ మీదికి చూపుల బాణాలు విడు స్తున్నాడు.

అతడి చూపులు తాకిన తన శరీరంలోని ప్రతి అణువునూ పైటతో కప్పుకునే ప్రయ త్నంలో ఉంది మార్తమ్మ.

భాగ్యమ్మ ముత్యాల పొట్లాం అందుకొని మార్తమ్మ పక్కనే మంచంమీద కూర్చుంటూ "ఇంకా నువ్వీడనే కూకుంటావేం, ఎళ్ళి తానం జెయ్యరాదూ? " అంది యోహానుతో.

యోహాను కుర్చీలో ఇబ్బందిగా కదిలి "ఇంటిపని విడిచిపెట్టి నువ్వు మాత్రం కూర్చోలేదూ! ఏదో, ఈరోజు ముత్యాల మంచి చెడ్డలు మాట్లాడుతూ కూర్చున్నాం గానీ రోజూ కూర్చుంటామా? " అని భాగ్యమ్మ అతిశయానికి వత్తి అంటించాడు.

"ఇంక నేనెల్తా" అని లేవబోయింది మార్తమ్మ.

భాగ్యమ్మ ఆమెను వెళ్ళనివ్వలేదు. చెయ్యి పట్టుకొని ఆపింది. ముత్యాలను మునివ్రే ళ్ళతో తీస్తూ పొట్లాంలో పోస్తూ అవి సుతా రంగా చప్పుడు చేస్తోంటే కొంచెంసేపలా ఆనందించింది.

"ఇసుమంటి సప్పుడొత్తేనే ముత్తేలు మంచియంటారు. మంచి ముత్తేలంటే మరేటీ లేదు, నీటి సుక్కలేనంట!"

మార్తమ్మ కళ్ళు నీరెండలో నీటిమీద తుళ్ళిపడ్డ చేప్పిల్లల్లా మెరిశాయి. "ఉట్టి నీటి సుక్కలేనా? " అంది ఆశ్చర్యంగా.

"నీటి సుక్కలంటే నీటిసుక్కలు గావు, వాన్నీటి సుక్కలు. అయి ముత్తెపు సిప్పల్లో బడి ముత్తేలవుతాయంట. అయ్యే ముత్తేలు





గానీ అన్ని సోట్లా అమ్మేటియి అసలు ముత్తేలుగావు, నకిలీ ముత్తేలు..." అని భాగ్యమ్మగాలి పీల్చుకుని-

"ఏంటిదోగానీ కాలం తీరు ఎట్టా మర్నా దంటే ఏటి కొనాల్నన్నా భయ్యంగుంది. అసలి వేంటియో, నకిలీ వేంటియో తెలవకొ చ్చింది. ఈ సదువుకున్నోళ్ళంతా గేనాన్ని బెట్టి సేస్తన్నపని ఇదే. గుండుసూది కాడ్నించి గుళ్ళో దేవుళ్ళదాకా అన్నీ నకిలీయే సేత్త న్నారు. నకిలీ ముత్తేలూ, నకిలీ వొజ్రాలూ, నకిలీ పగడాలూ, నకిలీ బంగారం, నకిలీ నోట్లూ, నకిలీ ఓట్లూ. సివరికి నకిలీ మడు సుల్ని గూడా సేత్తన్నారే? నకిలీ మడుసు లంటే ఎవురో గాదు, మడుసుల్లాంటి యంత్రాలే, ఆట్ని యావంటారోగానీ"

"రోబోటు" కల్పించుకొని చెప్పాడు యోహాను.

"ఆ...అయ్యి మడుసుల్లాగే పన్లన్నీ సేత్తా యంట. అది యినంగానే అనిపిచ్చిందికదా, ఇంకా ప్రెయోగాల్సేసి ఆ మరమడుసులకు సంసారం జెయ్యటం గూడా నేర్పితే ఆడోళ్ళ పేనానికి హాయిగుంటుంది. వేలూ లచ్చలూ కట్నాలు బోసి మొగుళ్లని కొనేకాడికీ; మళ్ళా మళ్ళా పీడిచ్చగానే పుట్టింటికెళ్ళి సొమ్ములు తెచ్చి మొగుళ్ళకిచ్చేకాడికీ... ఒక్క తూరి డబ్బెట్టి మరమొగుడ్ని కొనుక్కుంటే సంసారం శానా సక్కంగుంటాది. ఆడు గోసపెట్టడు. మనల్ని మళ్ళా మళ్ళా డబ్బులు గావాల్నని పీడిచ్చడు. ఆడపడ్డుల పీడా ఉండదు. అత్తోరి అధికారం ఉండదు. గబ్బు నూనె సావులుండవు. సిత్రహింసుం డదు. తాగొచ్చి కొట్టడు. తకరాలు బెట్టడు. నకరాలు బోడు. సీట్లాట ఆడడు. సిల్లిగవ్వ నూకడు. సిలకల్ని యాటాడ్డు.

"సంపాయిచ్చలేడన్న మాటేగానీ సెల్లే. ఆ కట్టవేదో ఆడోళ్లేబడి సంసారం జరిపిత్తే ఈ తాగుబోతు, తిరుగుబోతు యదవలతో కాపరం జేసేకన్నా మరమొగుడితో కాపరమే సుకమే సెల్లే" అంది భాగ్యమ్మ.

"స్నానానికి వెళ్తున్నాన్లే" అంటూ యోహాను వెళ్ళిపోయాడు.

యోహాను బైటికి వెళ్ళగానే భాగ్యమ్మను ముక్కుపుడక అడగాలని చిన్నగా దగ్గి గొంతు సరిచేసుకొంది మార్తమ్మ "మరే... భాగ్యమ్మప్పా!" అని పిల్చింది.

"ఏంటిదో చెప్పూ..." అంటూ మార్తమ్మ ముఖంలోకి చూసింది భాగ్యమ్మ.

"మరేటీ లేదు" అని ఒక్కక్షణం తటపటా యించి "పేలతో తల పుచ్చిపోతాంది. తీరు బాటుగుంటే పేలు సూత్తావనీ"

"అదేటి భాగ్గెంగానీ పనంతా ఐనాక మద్దేన్నం సూత్తాలే" అంది భాగ్యమ్మ, ముత్యాలను పొట్లాం కడుతూ.

బయట కందిపుల్లల దడి వెనుకనించి యోహాను నీళ్లు పోసుకుంటోన్న చప్పుడు వినిపిస్తోంది.

"అయితే మద్దేన్నం వత్తాలే" అని లేచి నిల్చుంది మార్తమ్మ.

భాగ్యమ్మ కూడా లేచింది. వాకిటిదాకా వచ్చి వాకిట్లో అడిగింది మార్తమ్మను. "నీ ముక్కుపుడక ఇసయం ఏ కాడికొచ్చింది. కొనే తీర్లోనే ఉండాడా నీ మొగుడు? " అని అడిగింది యధాలాపంగా.

మార్తమ్మ మనసు కలుక్కుమంది. అయినా తన బాధను ఎంత మాత్రమూ వ్యక్తపరచకుండా "కొంటాడంట" అని వేగంగా అక్కడ్నించి కదిలింది.

భాగ్యమ్మ ఇంటికీ, మార్తమ్మ ఇంటికీ మధ్య దూరం పది అడుగులు కూడా ఉందో, లేదో! ఆ కొద్దిదూరమే సుదూరంగా తోస్తోంది మార్తమ్మకు. భారంగా అడుగులు వేస్తూ తలవంచుకొని నడుస్తోంది.

నిజానికి తన తల్లో పేలన్నమాటే లేవు. వెళ్ళింది భాగ్యమ్మను ముక్కుపుడక అడగ టానికి. తీరా సందర్భం కుదిరేసరికి



మాటలు పెగల్లేదు. అది అభిమానమో ఏమోకానీ అంతదాకా వచ్చేసరికి మాట మార్చింది. ఏదో ఒకటి చెప్పాలి కనుక పేల విషయం చెప్పిందంతే.

పేదరికమే ఒక శాపమైతే అభిమానం అదనపు శాపం! ఆ రెండు శాపాలూ ఉన్నాయి కనుకనే మార్తమ్మ ముక్కుపుడక పెట్టుకొని అద్దంలో చూసుకోవాలన్న తన చిన్న కోర్కెను కూడా తీర్చుకోలేకపోయింది.

తల వంచుకొని నడుస్తోన్న మార్తమ్మకు దారిలో రోడ్డుమీద ఓ చిన్న తళుకు కాయితం కనిపించింది. అది తెల్లగా జిగేల్మని మెరుస్తోంది. ఎవ్వరూ చూడకుండా అమాంతం ముందుకు ఒంగింది. తళుకు కాయితాన్ని చేత్తో అందుకుంది. ఐదారడుగులు వేగంగా వేసి ఇంట్లోకి వెళ్ళింది. తళుకు కాయితాన్ని ఓ మూల గోటితో గుండ్రంగా చిన్న ముక్కను చించింది. ఆ ముక్క అచ్చం భాగ్యం ముక్కుపుడకకున్న తెల్లరాయికి మల్లేనే మెరుస్తోంది.

తళుకు కాయితం ముక్కను నాలుకకు అద్దుకుంది మార్తమ్మ. ఉమ్మి జిగురుతో తన ముక్కుకున్న ముక్కుపుడక రంధ్రంమీద అతికించుకుంది. ఆమె రంగుకూ ముక్కున మెరిసే తళుకు ముక్కుపుడక్కూ బాగా నప్పింది, బంగారుపళ్ళెంమీద మల్లెపువ్వు పెట్టినట్టు!

అద్దం పెంకులో తన ముఖాన్నంతా కొంచెంసేపు తనివిదీరా చూసికొని, ఆ తర్వాత తళుకు ముక్కను లాగేసి గూట్లోంచి చీపురుపుల్ల తెచ్చి ముక్కురంధ్రంలో దూర్చింది. లేకుంటే రంధ్రం కూడా పూడిపోతుంది!

★ ★ ★

"ఇట్టాగైతే నువ్వు నీ పెళ్ళానికి ముక్కుపుడక కొన్నట్టే!" అని తలను అడ్డంగా అటూ ఇటూ తిప్పాడు వెంకటేశ్వర్లు. అంతటితో ఆగకుండా "ప్చ..."అంటూ సానుభూతిగా పెదాలతో శబ్దం చేశాడు.

ఊడదీసిన ఉంగటాలను గుండ్రాయిమీద పెట్టి, వాటిమీద కొంచెం నీళ్ళుచల్లి, మేకులు కొట్టే సుత్తెతో ఉంగటాలను బాది వంకర తీస్తున్నాడు పేతురు. వెంకటేశ్వర్లు అన్న మాటలనూ, సానుభూతినీ పట్టించుకోలేదు.

ప్రొద్దుట్నించి అతను ఒక్క చుట్టయినా తాగలేదు. నాలుక పీకుతోంది. చుట్టకోసం మనసు తహతహలాడ్తోంది.

వెంకటేశ్వర్లును ఒక రూపాయి అడిగితే చుట్ట తాగవచ్చు కానీ చెప్పులు రిపేరు చేసి ఇవ్వకముందే అలా డబ్బులడిగితే అతను ఏమనుకుంటాడో!

చుట్టమీది కోర్కెను బలవంతంగా నిగ్రహించుకుంటూ మళ్ళీ ఒకసారి సుత్తెతో ఉంగటాలను బాదేడు.

"మీ పల్లెలో నువ్వు సై అంటే సై అనే వాళ్ళు ఎంతమంది ఉంటారు? " అడిగాడు వెంకటేశ్వర్లు.

"శానా మందుండారు"

"నిజంగా వాళ్ళంతా నీ మాట వింటారా? "

"ఇనేవోళ్ళే ఎక్కువ. అంతా సుట్టాలూ సావాసగాళ్ళూ.."

"అంటే, పల్లెలో నీ పలుకుబడి ముప్పావలా ఉంటుందా? "

"పావలాల లెక్కలో ఆలోచించలేదుగానీ సగం పైనే"

"అయితే ముక్కుపుడక కొనే దారి చూపిస్తాను"

ఉంగటాలను వంచి చెప్పు పైముక్క కంతల్లో దూరుస్తున్న వాడలా ఠక్కున తలెత్తి చూశాడు పేతురు.

"పార్లమెంటు ఎన్నికలొస్తున్నాయి"

"ఆ మద్దెగాల్నేగా జరిగినాది"




"ఇప్పుడొచ్చేవి మధ్యంతర ఎన్నికలు"

"అంటే? "

"ఐదేళ్ళకాలం తీరకముందే గవర్నమెంటుకు కాలం చెల్లితే వచ్చే ఎన్నికలన్నమాట"

"ఎట్టా...? "

"అధికారపక్ష సభ్యులకు సుతి కుదర్లేదు. కలిసుండే మతి కుదర్లేదు. అలా సుతీ, మతీ కుదరకపోతే ప్రభుత్వం పడిపోతుంది. పడిపోయిందంటే ఐదొందల చిల్లర మందికోసం శతకోటి భారతీయులకు ఓట్ల పండగొస్తుంది" చెప్పాడు వెంకటేశ్వర్లు.

పేతురుకు అర్థం కాలేదు. కలవారి పెళ్లి విందుకు కాకులగోలా, ఎన్నికల్లో పేదోళ్ల గోలా ఒకటేనని అతడి నమ్మకం.

అంతా జనంమీదనే ఎన్నికలు నడుస్తాయన్నది కేవలం భ్రమేకానీ జనం ఎన్నికలను పట్టించుకోకపోయినా భూభ్రమణం ఆగిపోదు. విమానాలు మబ్బుల్లోనే నిలిచిపోవు. జడపదార్థాలు శ్వాసించవు. జీవరాసులు శ్వాసించకుండా ఉండవు.

ఎలక్షన్లంటే ఎగిరి గంతేసే జనమే వేరు. వాళ్ళంతా చలువపెట్టెలు బిగించిన బంగళాల్లో వుంటారు. కారుల్లో కుక్కల్ని తిప్పుతుంటారు. విదేశాలకు ఎగుమతి చేసే బెంగుళూరు గులాబి పువ్వుల్లా ఉంటారు. నామినేషన్లు వేసి రంగంలో ఉంటారు. గెలిచినోడు ఢిల్లీకో, హైద్రాబాదుకో చట్టాలు చెయ్యను వెళ్తే ఓడినోడు గెల్చినోడికి పుల్లలు పెడుతూ ఇంటిదగ్గరుంటాడు.

"నడమంతరం ఎలచ్చనుకూ నా పెళ్ళాం ముక్కుపుడక్కూ ఏటి సంబందం? " అడిగేడు పేతురు చెప్పులను అతికించి ఆరబెడుతూ.

పేతురు అమాయకత్వానికి పగలబడి నవ్వేడతను. "అవి నడమంతరపు ఎన్నికలు కావు, మధ్యంతర ఎన్నికలంటారు"

"సదువులేని మూర్ఖుడ్ని. నే ఎట్టాగంటే నేంగానీ యింతకీ ముక్కుపుడక్కీ దానికి ఏటి సంబందవో సెప్పవూ!"

వెంకటేశ్వర్లు తన చెప్పులవేపు చూసుకున్నాడు. అవి బాగైనాయి. ఇక తొడుక్కొని వెళ్ళటమే ఆలస్యం! లేచి నిల్చున్నాడు. ఒకసారి దీర్ఘంగా మూలుగుతూ వళ్ళు విరుచుకుని చెప్పుల మడమలకూ, పట్టెళ్ళకూ మధ్య నుంచి అరికాళ్ళు దూరుస్తూ.

"ఏం సంబంధమో చెప్తాను కానీ చెప్పినట్టు చెయ్యాలి నువ్వు. అట్టా చేశావంటే ముక్కుపుడకేంటి, ముకుతాడు వేసిందానికి నాన్తాడే చేయించొచ్చు! సారా చుక్కా, పంటి కిందికి ముక్క, కావలసినంత డబ్బూ... ఇక నీ యిష్టమే అనుకో"

"ఏటి సెయ్యాల్నేనూ? " అతడు చెప్పింది చేస్తే ఒనగూడే ప్రయోజనాలను, అందే సుఖాన్నీ, తీరే కోర్కెలనూ తలచుకొని చాలా ఆసక్తిగా అడిగేడు పేతురు.

"పల్లెలో నీ మనుషుల ఓట్లన్నీ నువ్వే అమ్మేసెయ్!"

అతడు చెప్పింది పేతురుకు అర్థంకాలేదు. అతడికి అర్థం కాలేదని గ్రహించి.

"చెప్పానుకదా ఎన్నికలొస్తున్నాయి. ఇదే అదను. అదను పోయేదాకా ఆలోచిస్తూ కూర్చుంటే ఆనక చేసేదేం ఉండదు. పైగా అదేమీ కష్టమైన పనేంగాదు. కొండ కట్టెలు కొట్టి తెచ్చేదీ, కోనేటి నీళ్ళు మోసేదీలేదు. చెయ్యాల్సిందల్లా వాడకట్టు ఓటర్లకు సారా తాగించు. పులిహోర పెట్టించు. పోలింగు బూతుపనికి పురమాయించు. అందర్నీ క్యూలో నిలబెట్టు. కడుపులో చుక్కన్నోళ్ళం దరికీ వ్రేలు మీద చుక్కేయించు. ఓటు కాయితాలిప్పించు. నీకు డబ్బులిచ్చే పార్టీ వాడు ఏ గుర్తంటే ఆ గుర్తుమీద ఓటు ముద్రలేయించు. ముద్రేసిన కాయితాలను బూతుపెట్టెల్లో వేయించు, అంతే!" అని, కర్తవ్యం బోధించాడు వెంకటేశ్వర్లు, కాళ్ళను పూర్తిగా చెప్పుల్లోకి దూరుస్తూ.

పేతురు ధ్యాసంతా చుట్టలమీదికి



మళ్ళింది. చెప్పులు బాగై కాళ్ళకు తొడుక్కున్నా యింకా వెంకటేశ్వర్లు జేబులోకి చేతులు దూర్చలేదు. డబ్బులు తీసి యివ్వలేదు. అతడు జేబుల్లో చేతులు దూర్చి డబ్బులు తీసియిస్తే క్షణంలో బీడీ బంకుదగ్గర తేలాలి. చుట్టలు కొనాలి. ఒకదాన్ని మునిపళ్ళతో బిగించి పట్టుకొని అగ్గిపుల్లతో కాల్చాలి. గుప్పుగుప్పున పొగ వదలాలి. మత్తులోకి వెళ్ళిపోవాలి. సాయంత్రందాకా చెప్పులు కుట్టాలి. డబ్బులు దాచాలి. ముంత నిండాలి. ముక్కుపుడక కొనాలి. భార్య మురిపెం తీర్చాలి. తనూ మురిసిపోవాలి.

ముందు చుట్ట కావాలిగా!

"యంకటేశ్వరన్నా! యియ్యే సెప్పులు ఎవర్కైనా బాగుసేత్తే పది రూపాయలన్నా అడిగేవోణ్ణి. ఐనోడివి నువ్వు..." అని మొహమాటం అడ్డం వచ్చి నవ్వూరుకున్నాడు పేతురు.

అతనూ నవ్వేడు. "అంతే... అంతే! వ్యాపారపు దృష్టితో అందర్నీ చూడలేం కదా... అలాంటి పట్టువిడుపులుంటాయి. అవి సహజం. డబ్బు ప్రాధాన్యత మనిషి జీవితంలో ఎంతగా ఉన్నా తనా మనా అన్న ఆలోచన పోదుగా!" అని ఒక్కక్షణం విరామం తర్వాత.

"ఇంతకీ ఎలక్షను విషయం ఏం తేల్చావ్?" అని అడిగేడు వెంకటేశ్వర్లు.

మార్తమ్మకు ముక్కుపుడక కొనాల్నన్నా, అమ్మాయికి పలకా, బలపం యియ్యాలన్నా, మనసు పడినప్పుడు తను చుట్టలు తాగాలన్నా కావాల్సింది డబ్బు! చింతచెట్టుకింద చెప్పులు కుట్టి, ముంతలో డబ్బులు దాచిపెట్టి కోర్కెలు తీర్చుకోవాలంటే కుదిరే పని కాదు. అది తేలిపోయింది. ఇంకా చెప్పాలంటే అది చీమ కాలినడకన భూగోళం చుట్టి వచ్చినట్టే!

ఇకపోతే మిగిలిన మార్గాలు రెండేరెండు. అందులో ఒకటి వెంకటేశ్వర్లు చెప్పింది. రెండవది అంకిరెడ్డిగారి చచ్చిన గొడ్డు!

ఆ గొడ్డును బేరంచేసి బండిమీద తెమ్మని పెద్దబ్బాయి ఏలియాను పొద్దున్నే పురమాయించాడు. మార్తమ్మ ఈ పాటికి ఏలియాను రెడ్డిగారి ఇంటికి పంపించే ఉంటుంది. వాడు చచ్చిన గొడ్డును తేవాలి. ఆరెతో వారు గొయ్యాలి. గొడ్డు తోలును ఉప్పులో ఊరబెట్టాలి. ఎండబెట్టి బాగుచెయ్యాలి. ముడతలు పోయేదాకా దానిమీద బరువు పెట్టాలి. చెప్పులకు అది యోగ్యం కావాలి. ఆర్డర్లు రావాలి. అరికాళ్ళ కొలతలు తీసుకోవాలి. కొలతల ప్రకారం చెప్పులు కుట్టాలి. కొలతలు యిచ్చిన వాళ్ళు కుట్టగానే రావాలి. వాళ్ళ దగ్గర డబ్బుండాలి. ఉన్నా, చెప్పుల అవసరం పీకలమీదికి రావాలి. పీకలమీదికి రావాలంటే వాళ్ళ పాత చెప్పుల్ని కుక్కలు కొరకాలి. వాళ్ళు గుడికైనా వెళ్ళాలి.

అప్పుడుగానీ వాళ్ళు రారు.

వస్తేగానీ డబ్బులు రావు.

అంకిరెడ్డి గొడ్డుమీద వ్యాపారం చకచకా జరిగిందంటే ముక్కుపుడక కొనటం ఎంత భాగ్యం!

అమ్మో... గొడ్డును తెచ్చి బండి బాడుగ యిమ్మంటే ఎలా?

అవునవును! వెంకటేశ్వర్లిప్పుడు డబ్బులిస్తాడు. అందులోంచి తీసి చుట్టలు కొనకూడదు. డబ్బంతా బండివాడికి యివ్వాలి. అంతకన్నా మార్గంలేదు. శవాల బండి మస్తాను మంచివాడే! కొంచెం తగ్గితే బతిమాలి చెప్పొచ్చు కానీ అసలియ్యకపోతే అసహ్యంగా ఉంటుంది.

అది సరే! రెడ్డి గొడ్డుకు ఎంతంటాడో. ఎంతన్నా తప్పేదేం లేదు. దాని తోలు చెప్పులుగా మారి మార్కెట్లో అమ్ముడుపోతే గొడ్డు డబ్బులు రెడ్డికియ్యవచ్చు.

చచ్చినా గొడ్డుకు వ్యాపారపు విలువ ఉంది.




అలాంటి విలువచచ్చిన మనిషికి లేదు.

"పేతురూ! నీ ఆలోచనలు వగతెగి ఒక నిర్ణయానికి వచ్చేట్టు లేవు నువ్వు. నీకా సాహసం, చొరవ, తెగింపూలేవు. అవ్వే ఉంటే ఇలా ఎందుకుంటావ్!" అన్నాడు మందలింపుగానూ, కొంచెం విసుగ్గానూ వెంకటేశ్వర్లు.

అతడు అన్నది కూడా నిజమే. అందులో తప్పేంలేదు.

ఇదే చింతచెట్టు కింద తరతరాలుగా శ్రమచేస్తున్నా తాతల, తండ్రుల దగ్గర్నించి ఎవరు సాధించింది ఏముంది గనుకా! ఈ శ్రమకు వచ్చే ప్రతిఫలం శ్వాసించటానికి మాత్రమే ఓపిక యిచ్చే నాలుగు అన్నం మెతుకులకే సరిపోతోంది. జీవితం... అంటే... శ్వాసించటానికీ శ్వాస ఆగిపోవటా నికీ మధ్య కాలం... కన్నీళ్ళు కార్చటానికి పరిమితమౌతోంధి.

అందుకేగా ముక్కుపుడక కొనలేకపో తోంది!

వెంకటేశ్వర్లు చెప్పినట్టు చేస్తే తప్పేం లేదు. అది తప్పే అయితే అంతమంది ఎందుకు చేస్తున్నట్టూ. అంతమంది తప్పు చేస్తుంటే మనుషులు పెట్టిన గవర్నమెంటు కానీ, మనుషుల్ని పుట్టించిన దేవుడుకానీ ఎందుకు ఊరుకుంటున్నట్టూ. అలా ఊరు కుంటున్నారంటే అది తప్పు కాదు రైటే!

"యంకటేశ్వర్లన్నా! నువ్వే యింక గురువ్వి. నువ్వే యింక దేవుడివి. నువ్వే యింక నాయకుడివి. నడిపిచ్చన్నా. నడి పిచ్చు" అన్నాడు పేతురు దృఢంగా.

వెంకటేశ్వర్లు అతడివేపు అభిమానంగా చూసేడు.

"పేతురూ! ముక్కుపుడక కొనలేదన్న బాధతో నువ్వు నా దారికొచ్చినా జీవితాన్ని నిర్మించుకునే అనుభవం నీకు లేదు. నువ్వు బాగుపడి నాలుగు డబ్బులు సంపాదించా లన్నా, పెళ్ళాం కోర్కెలు తీర్చాలన్నా, కుదు రుగా బతకాలన్నా పాఠాలు నేర్చుకోవాలి. అది కూడా ఓనమాల దగ్గర్నించి. అన్నీ నేర్పుతాను కానీ యివ్వాల్టికి చెప్పులు కుట్టటం కట్టిపెట్టి నా వెంట నడువు"

"యాడికి?" అడిగేడు పేతురు ఆశ్చ ర్యంగా.

"నీకు అనవసరం"

"అదేంటిదీ?"

"అది అంతే! జీవితంలో పైకి రావాలంటే ఎందుకు? ఏమిటి? అన్న పదాలను మర్చి పోవాలి. జీవితంలో కుదురు సాధించిన ఒక గురువును ఎంచుకొని అతడు నిర్దేశించే మార్గంలో కళ్ళు మూసుకొని నడవాలి"

పేతురు ఇంకేం మాట్లాళ్ళేదు. హడావు డిగా సామాన్లను ఖాకీ సంచిలోకి సర్దేడు. గుండ్రాయిని చెట్టు కాండం దగ్గరున్న మొండి చీపురు కింద పెట్టాడు.

"మనకెంత టైం పట్టుది?" ఖాకీ సంచిని చేతపట్టుకొని అతడి వెంట బయల్దేరేందుకు సిద్ధపడుతూ అడిగేడు పేతురు.

"చెప్పలేం" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఈ సంచి యంటబెట్టుకొని యాడికైనా ఎట్టా ఎల్తాం. నువ్వు యాడుంటావో సెప్తే లగువెత్తి పల్లెకి బోతాను. సంచి ఇంటికా డెట్టి లగువెత్తుకొత్తాను"

వెంకటేశ్వర్లు ఆలోచించాడు.

అతనికి యిప్పుడు మందు తాగాలనిపి స్తోంది. ఆ కోర్కె చాలా బలంగా ఉంది. ఒంటరిగా మందు తాగటం అలవాటులేదు. ముక్కూ ముఖం తెలియని అపరిచిత వ్యక్తి అయినా సరే ఆ సమయంలో తోడుండాలి.

అలా తోడు ఉన్నవాడికి ఎంత తాగితే అంత తాగించటం, ఎంత తింటే అంత తిని పించటం అతడి అలవాటు. అలాగని ఎద టివాడు ప్రాణంమీదికి వచ్చి ఒక్కరూపాయి

అడిగినా చస్తే యివ్వడు. వాడు తనతో కలసి తాగినా అంతే, తాక్కపోయినా అంతే!

ఇప్పుడు తాగేందుకు పేతుర్ని బ్రాందీషాపుకు తోడు తీసికొని వెళ్ళటంలో అతడికి రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి తోడు. రెండు, పేతురుకు వాడకట్టుల్లో చాలా బలగం ఉంది. ఆ విషయం అతనికి తెలుసు. రాబోయే ఎన్నికల్లో పేతుర్ని ప్రయోజన పెట్టుకొని నాయకుల దగ్గర ప్రాపకం పెంచుకోవాలి.

అందుకే దూరం ఆలోచించి పేతుర్ని వెంట రమ్మన్నాడతను.

"చెప్పవూ... యాడికి రమ్మంటావ్? " మళ్ళీ అడిగేడు పేతురు ఖాకి సంచిని అటూ యిటూ ఊపుతూ.

"గాంధీచౌక్ ఉంది కదా? "

"ఉండాది"

"చౌక్ దగ్గరికి వెళ్తుంటే ఆర్డీవో ఆఫీసు మొండిగోడలు దాటంగానే ఏముస్తుంది? "

"ధర్మాస్పత్రి"

ధర్మాస్పత్రి దాటంగానే? "

"ఇస్కోలు బడి"

"ఇంకొంచెం ముందుకు పోతే? "

"గాందీ యిగ్రం"

"గాంధీ విగ్రహం పక్కనే ఏముంది? "

"బ్రాందీసాపు"

"దానికి వెళ్లాలి మనం" చెప్పాడు వెంకటేశ్వర్లు.

"బ్రాందీ సాపుకా? ఏంటికీ? "

"మనం మందు తాగాలి"

"మందుకూ ముక్కుపుడక్కీ ఏటి సమ్మందం? "

"అదీ తలతిక్క వ్యవహారం అంటే! ఇంకా ఓనమాలు కూడా నేర్చుకోకుండా గురువునే ప్రశ్నిస్తావా? ఇలాగైతే నువ్వు బాగుపడవు. పెళ్లానికి ముక్కుపుడకే కాదు, మంచాన పడిందంటే మందులు కూడా ఇప్పించలేవు"

దెబ్బ తిన్నట్టు చూశాడు పేతురు.

"తప్పయినాది. ఇక సచ్చినా అదేంటికీ, యిదేంటికీ అని అడగను. దానికీ దీనికీ సమ్మందం ఏంటిదని అడగను. నువ్వేది ఎందులకు సేత్తన్నావో, ఎందుకు సేయిత్తన్నావో అడగను. నాగ్గావాల్సింది పెండ్లానికి సిన్న ముక్కుపుడకంతే!" అన్నాడు పేతురు జన్మించిన చాలా దశాబ్దాలకు తొలిసారిగా 'జ్ఞానం' తెచ్చుకుంటూ.

"యంకటేశర్లన్నా!" పిల్చేడు మళ్ళీ. "అయితే నేనింటికాడికెళ్ళి యంటనే వత్తా" అని, వెళ్ళేందుకు అనుమతి కోసం గురువు వేపు చూసేడు పేతురు.

"నీదే ఆలస్యం"

పేతురు నాలుగు అడుగులు వేసేడో లేదో, చచ్చిన గొడ్డుకోసం అంకిరెడ్డి ఇంటికి వెళ్ళి తిరిగి వచ్చేడు ఏలియా.

కొడుకు తనవేపే రావటం గమనించిన పేతురు ఏలియాను కొంచెందూరంలో చూడగానే ఖాకి సంచిని వాడికి యిచ్చి యింటికి పంపిద్దామన్న ఆలోచన కలిగింది.

వెళ్తోన్న వెంకటేశ్వర్లను కేకవేసి పిల్చేడు.

వెంకటేశ్వర్లు ఆగి, వెనక్కు తిరిగి పేతురు దగ్గరికి వచ్చేలోగా ఏలియా కూడా వచ్చేడు.

"రెడ్డిగోరి కాడికి ఎళ్ళినావంటరా? " కొడుకును అడిగేడు పేతురు.

ఏలియా 'వెళ్ళాను' అన్నట్లు తలాడించాడు.

"గొడ్డును తెచ్చినావా? "

"తేలే..."

"ఏంటికని? బండి దొరకలేదా? "

"గొడ్డు నియ్యనన్నడు రెడ్డిగోరు" చెప్పేడు ఏలియా.

పేతురు నొసలు చిట్లించేడు. "ఆరి కొట్టంలో ఏ గొడ్డు సచ్చినా యిస్తంది మనకేగా. యియ్యాళ ఏం గత్తరొచ్చిందంట? "

"మనసువంటోడే యింకెవుడో అడ్డం తగిలిండు. బేరం పెంచిండు. వందన్నాడు. రెడ్డి వందిత్తే మనకే యిత్తానన్నాడు.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ 'చతుర' నవల **మాయలేడి**

..........................................................

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

అట్టాగే అన్నా. ఆడు ముందుగాల్నే వందిచ్చి గొడ్డును యిత్తకెల్తా అన్నాడు. రెడ్డి ముందుగాల వందిత్తే మనకే యిత్తా నన్నాడు. మన కాడ ముందియ్యను డబ్బు ల్లేవుగా! అయ్యని పంపిత్తానని సెప్పి వొచ్చి నాను. నువ్వెళ్ళి సంగతి తేలిత్తే యిత్తే నీకూ, లేకపోతే వాడికీ... గొడ్డు మాత్తరం మద్దే న్నంకల్లా ఎలిపోవాలన్నాడు. అందుకే నీ కాడికొచ్చా" చెప్పేడు ఏలియా.

ధూత్తేరీ... ముక్కుపుడక కొనే మరో అవ కాశం కూడా చెయ్యిజారిపోయింది. ఇక మిగిలిన అవకాశమల్లా వెంకటేశ్వర్లు చెప్పిందే!

"గొడ్డు యవ్వారం నేసూత్తాలేగానీ యీ సంచి ఇంటికాడ బెట్టు" అని ఖాకి సంచిని ఏలియాకిచ్చి పంపించాడు పేతురు. ఏలియా వెళ్ళిపోగానే వెంకటేశ్వర్లు వెంట నడిచేడు.

"ముందు బంగారం కొట్టుకు వెల్దాం. అక్కడ పని చూసుకొని బ్రాందీ షాపుకు వెల్దాం" అన్నాడు దారిలో వెంకటేశ్వర్లు.

పేతురు మనసంతా కంగాళీగా ఉంది. మనసు చుట్టమీదికి మళ్ళింది. బలవం తంగా నిగ్రహించుకొని గురువు వెంట వెళ్తో న్నాడు.

★ ★ ★

యోహాను స్నానం చేసి వచ్చి చాలా సేపైంది. మీగడ తరకలాంటి తెల్లటి చొక్కా తొడిగి ఆ చొక్కాకు బాగా నప్పే కాఫీపొడి రంగు ప్యాంటు వేసుకున్నాడు. అందంగా తయారై బట్టలమీద సెంటు స్ప్రే చేసికొ న్నాడు. ఐదారుసార్లు క్రాపు దువ్వి దువ్వెన్ను అద్దంముందు పెట్టి ముఖానికి పౌడరు అద్దేడు.

ముస్తాబు పూర్తయింది.

ఒకసారి మళ్ళీ అద్దంలో ముఖం చూసి కొని సంతృప్తిచెంది వెళ్ళి కుర్చీలో కూర్చొని ఏదో పుస్తకం చదువుతోన్నాడు.

భాగ్యమ్మ ఆరోజు చాలా ఆలస్యంగా పని లోకి దిగింది.

హైద్రాబాదు నుంచి యోహాను రావటం, అతడు నిద్రలేచేదాకా ఎదురుచూసి, లేవ గానే కొంచెంసేపు అతడితో వాదనకు దిగటం, వాదన అయ్యాక అతగాడు తెచ్చిన ముత్యాలను చూడటం, అంతలోనే పక్కింటి మార్తమ్మ రావటం.

అందుకే ఆలస్యంగా పనిలోకి దిగింది భాగ్యమ్మ.

గుడిసె ముందూడ్చింది. కళ్ళాపి చల్లింది. ముగ్గులేసింది. అంట్లు తోమింది. స్నానం చేసింది. ఇస్త్రీ చీర, రెవిక కట్టుకొని తనూ ముస్తాబై వచ్చి భర్త ఎదురుగా కూర్చుంది.

యోహాను ఆమెను పట్టించుకోలేదు. చదువుతోన్న పుస్తకంలోంచి తల ఎత్తటం లేదు.

అలా దీక్షగా పుస్తకం చదువుతున్న భర్త వేపు చాలా సేపటినుంచి మౌనంగా చూస్తూ కూర్చొని ఎంతకూ అతను తల ఎత్తి చూడక పోవటంతో విసుక్కుంటూ.

"ఏంటా బొక్కూ...? " అని పెద్దగా అడి గింది భాగ్యమ్మ.

పుస్తకాన్ని ముయ్యకుండానే తల ఎత్తి భార్యవేపు చూస్తూ, "ఇదా! కేంద్రం, రాష్ట్రం మనకోసం తయారుచేసిన స్కీముల పుస్తకం"

"ఏటుంటా యందులో? "

"పథకాలుంటాయి. రకరకాల వ్యాపారా లకు సూచనలుంటాయి. ఏ సొసైటీ ఎలా పెట్టాలో, పెట్టిన సంఘం ఎలాంటి పథకాల కింద ప్రభుత్వం నుంచి డబ్బులు పొందచ్చో ఎంత పొందచ్చో వివరాలుంటాయి"

"బొక్కు సదవంగానే యిత్తారా డబ్బులు? "

"ఇవ్వరు. పుస్తకం చూసి మనకు అను వైన పథకం ఎంచుకోవాలి. సొసైటీ రిజి స్టరు చెయ్యాలి. లోనుకు అప్లికేషను



పెట్టాలి" అని యోహాను వైద్య రహస్యాలు అడిగిన రోగివేపు చూసే ఆయుర్వేద వైద్యాచార్యుడికి మల్లే విసుగ్గా చూసి "అయినా యివ్వన్నీ నీకెందుకూ? " అని మళ్ళీ పుస్తకం లోకి తల దూర్చేడు.

భాగ్యమ్మ అహం దెబ్బతిన్నది.

"నాగ్గాక ఎవురికంట! ఎవురో దార్నబోయే ముత్తేలమ్మకు స్కాములు సెప్పంగా లేన్ది నాకు సెప్తే నెప్పయిందా..." అని దీర్ఘం తీసింది.

యోహాను పుస్తకం మడిచి ప్రక్కనపెట్టాడు.

"అదికాదే భాగ్యం! చెప్పినా నీకు అర్థం కాదు. అందుకేగానీ నీకు చెప్పటానికి నాకేం అభ్యంతరం. స్కీముల్ని పట్టుకొని స్కాములంటావ్. ముత్యాలమ్మనేమో ముత్తేలమ్మంటావ్. నువ్వు సరిగా పిల్చేది ఒక్క మార్తమ్మనే. అవునూ... ఇందాక మార్తమ్మ ఎందుకొచ్చిందీ? " అని అడిగేడు.

"పేలు సూయించుకోటానికి వొచ్చిందిలే గానీ లుంగీ కట్టక లాగూ సొక్కా తొడిగి నావు, యాడికెళ్ళాలి? అయినా యీ వరప్పుడా ఎళ్ళేది. శకశకా వణ్ణం, కూరా వొండుతాగానీ బువ్వదిని తొంగో! అసలికే రేత్తిరంతా బస్సులో కూకొని వొచ్చావ్" అంది భాగ్యమ్మ.

"ఏం కూర చేస్తావూ? "

"సిలకడదుంపలు, బెండకాయలూ ఉండాయి. రొంటిలో నువ్వేదంటే అది. గావాల్నంటే శారుగూడా పెడ్తాను"

యోహాను ముఖం వికారంగా పెట్టాడు. "అవ్వంటేనే నాకు చిరాకు. కడుపునిండా అన్నం తినాలంటే ఇష్టమైన కూర ఒక్కటన్నా ఉండాలిగా!" అన్నాడు.

"అయితే, ఏం కూర గావాల్నంటావ్? " అడిగింది భాగ్యమ్మ.

"చాపల కూర"

"శాప లేదుండాయీ, లెవ్వుగా!"

"లేకపోతే తెచ్చుకోవాలి"

"మార్కెట్టుకు నన్నేడ బొమ్మంటావ్"

"నువ్వు వెళ్ళొద్దులే నేను వెళ్తాను. కానీ చాపల మార్కెట్టు దగ్గరే ముత్యాలమ్మ యిల్లు. అది నన్ను చూసిందంటే ఒక పట్టాన విడిచిపెట్టదు. ఇంట్లోకి రమ్మంటుంది. మొహమాటానికి వెళ్తే సోది కబుర్లు చెబుతూ గంటలు గంటలు కూర్చోబెడుతుంది"

"అయితే నేనే ఎళ్ళొత్తాగానీ ఇల్లు బద్రం" అని చెప్పి వైరుబుట్ట పట్టుకొని గునగునా నడుస్తూ చాపల మార్కెట్టుకు వెళ్ళిపోయింది భాగ్యమ్మ.

యోహాను గుంభనంగా నవ్వుకున్నాడు. అతడి పథకం ఫలించింది. ముత్యాలమ్మ భయంతో చాపల మార్కెట్టుకు అతడ్ని వెళ్ళనివ్వకుండా తానే వెళ్ళింది.

అతను ఆశించింది అదే!

భాగ్యమ్మ అలా బైటికి వెళ్ళిందో, లేదో తను కూడా బైటికి వెళ్ళేడు. తలుపు దగ్గరికి వేసి గబగబా నడుస్తూ మార్తమ్మ గుడిసె దగ్గరికి వెళ్ళి "పేతురూ...!" అని పెద్దగా పిల్చేడు వాకిట్లోంచే.

మార్తమ్మ బైటికి వచ్చింది. "లేడు, సెట్టు కాడికి ఎళ్ళిండు" అని చెప్పింది.

"పిల్లలూ కనిపించరేం? "

"పెద్దోడు ఇప్పుడే సంచిబెట్టి యాడికో బోయిండు. సిన్నోడూ సిన్నదీ ఆటలకు బోయినారు"

"ఇంటిపనంతా అయిందా? "

"అయినాది" అంది మార్తమ్మ.

ఎంతకూ యోహాను అక్కడ్నించి కదలకపోతే యిక మర్యాద కాదనుకొని గుడిసె లోంచి నులకమంచం తెచ్చి వాల్చి "కూకో" అంది మార్తమ్మ.

యోహాను మంచంమీద కూర్చున్నాడు.

"అప్ప ఏం జేస్తంది? " అడిగింది మార్తమ్మ.

"చాపలకోసం వెళ్ళింది. మార్కెట్టు దూరం కదా... అది రావటానికింకా అర గంట పడుతుందిలే!"

"అయితే ఒక సగాయం జెయ్యి"

"ఏంటది? " అడిగేడు యోహాను మెరుపు కళ్ళతో.

"కుక్కల్తో సావొచ్చింది. తలుపు కంత ల్లోంచి దూరెళ్ళి వణ్ణం గిన్నెని బతకనియ్య టంలేదు. నే ఎళ్ళి పిల్లనీ, పిల్లాడ్నీ తెస్తాగానీ యిాడ్నే కూకొని కొంచెం సూత్తుండు" అని చెప్పి అక్కడ్నించి వెళ్ళిపోయింది మార్తమ్మ.

★ ★ ★

పేతుర్ని వెంటపెట్టుకొని వెంకటేశ్వర్లు బంగారం షాపుకు వెళ్ళాడు. అది చాలా పెద్దషాపు.

ఇద్దరూ మెట్లు ఎక్కారు. అద్దాల తలుపు అడ్డం వచ్చింది. తలుపు దగ్గర తుపాకి పట్టుకొని నిల్చున్న యూనీఫాం వ్యక్తి సూది కళ్లతో చూశాడు. తలుపు తెరిచాడు.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

అక్కడ గోడలకు బిగించిన అద్దాల షోకే సులు అరలు అరలుగా ఉన్నాయి.

ఒక్కొక్క అరలో పారదర్శకమైన అద్దాల గుండా వజ్రాలు, కెంపులు, పచ్చలు, పగ డాలు, ముత్యాలూ పొదిగిన బంగారు ఆభరణాలు కనిపించాయి.

ఆ ఆభరణాలకు పక్కనే రాళ్ళు పొదగని సాదా గొలుసులు, గాజులు, వడ్డాణాలూ, ఒంకీలు, చెవికమ్మలు, చంద్రహారాలూ, ఉంగరాలూ ఉన్నాయి.

బంగారు ఆభరణాలకు కొంచెం దూరంగా షోకేసుల్లో ఉన్నాయి వెండి ఆభరణాలు.

వెంకటేశ్వర్లు అక్కడికి దారితీసాడు.

అక్కడ వెండి కంచాలు, పట్టీలు, కుంకుమ భరిణలు, గ్లాసులూ కనిపించాయి.

"పట్టీలు కావాలి" చెప్పాడు వెంకటేశ్వర్లు అక్కడి మనిషితో.

అతను రకరకాల డిజైన్ల పట్టీలను తీసి ముందుపెట్టాడు.

జీవితంలో ఎప్పుడూ పేతురు అలాంటి బంగారం కొట్టుకు యింతవరకూ రాలేదు. అందుకేనేమో ఆ అద్దాల షోకేసులనూ, ఆ షోకేసుల్లో ధగధగా మెరుస్తోన్న ఆభరణా లనూ అబ్బురంగా చూస్తున్నాడు.

అప్పటికే వెంకటేశ్వర్లు నచ్చిన పట్టీలు తీసుకొన్నాడు. బిల్లు చెల్లించాడు.

ఇద్దరూ షాపులోంచి బైటికి వచ్చారు.

బ్రాందీ షాపుకు వెళ్ళారు.

కుర్చీల్లో కూర్చున్నారు.

బేరర్ రాగానే కావలసిన మందుపేరు చెప్పాడు వెంకటేశ్వర్లు. ముందు ఒక హాఫ్ బాటిల్ తెమ్మన్నాడు. దాన్ని మింగేప్పుడు కలిగే చేదుకూ, వికారానికీ విరుగుడుగా మంచింగ్ కోసం ఓ ప్లేటు గ్రీన్‌పీస్, మసాలా ఫ్రై చేసిన రెండు కోడిగుడ్లూ ఆర్డ రిచ్చాడు.

"షోడాలు కావాలా? " అడిగాడు బేరర్.

వెంకటేశ్వర్లు సమాధానం చెప్పకముందే "సోడాలేంటికిలే నీలు కలుపుకుందాం" అన్నాడు పేతురు కొంచెం చొరవగా.

వెంకటేశ్వర్లు అతడి మాటల్ని పట్టించుకో లేదు. చిరాకుగా చూసి "నాలుగు షోడాలు" అన్నాడు బేరర్‌తో.

బేరర్ వెళ్ళిపోయాడు.

"పేతురూ నువ్వొక పాతిక రూపాయలు పెట్టి తోలు కొని చెప్పులు తయారుచేసి అమ్మితే ఎంత డబ్బు వస్తుంది? " అడిగాడ తను.

పేతురు ఒకక్షణం ఆలోచించి "తోలి

సెప్పులైతే వత్తాయి యాభైదాకా. అదే టైరు సెప్పులైతే దరుండదు"

"టైరు చెప్పులకు పెట్టుబడి తక్కువ కదా? "

"ఆ... తక్కువే"

"అదే నువ్వు వెయ్యి రూపాయలకు తోలు కొని చెప్పులు చేస్తే ఎంత లాభం వస్తుంది? "

పేతురు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

అతడి ధ్యాస చుట్టమీదికి మళ్ళింది. భార్య ముక్కుపుడక మీదికీ మళ్ళింది.

కనీసం యిప్పుడు ఒక్క చుట్టయినా కాలిస్తే మెదడుకు చలనం వస్తుంది. చుట్ట కాల్చాలి. గుప్పుగుప్పున పొగ వదలాలి. వొదిలిన ఆ పొగలోకి చూస్తుంటే ఎంత పెద్ద లెఖ్ఖయినా అవలీలగా చెప్పొచ్చు.

బ్యారర్ వచ్చాడు. సరుకు బల్లమీద పెట్టాడు. మందును రెండుగ్లాసుల్లో వొంపాడు. షోడా కలిపి "ఇంకా ఏమైనా కావాలా? " అన్నాడు.

'వంద సుట్టలూ, లక్ష ముక్కుపుడకలూ గావాలె' అందామన్నంతగా ఆవేశం పొంగింది. తమాయించుకున్నాడు. ఉద్దేరగా మందు తాగేందుకు వెంకటేశ్వర్లు వెంటవెళ్ళాడతను. ఆ న్యూనత కడుపులో లేకపోలేదు. అందుకే అలా అన్లేదు.

పేతురు చేతికి మందు గ్లాసు అందించి, ఆ గ్లాసుకు తన గ్లాసును 'టిక్కు'న తగిలించాడు వెంకటేశ్వర్లు.

ఇద్దరూ తాగటం ప్రారంభించారు.

ఆ అనుభవం పేతురుకు చాలా వింతగా ఉంది. అలా ఫ్యాన్లకింద కుర్చీలో దర్జాగా కూర్చొని మహరాజుకు మల్లే ఒక్కో గుక్కా తాగుతోంటే ఇది కలా? నిజమా? అన్న అనుమానం కలక్కపోలేదు అతనికి.

తాగుడు అతనికి అలవాటుగా లేదు. తాగిన సందర్భాలు బహుకొద్ది. పెళ్ళయిన క్రొత్తల్లో భార్య ఎందుకో అలిగి పుట్టింటికి వెళ్తే ఆ కక్షతో తాగేడు. నాలుగైదుసార్లు ఎలక్షన్లకి ఏసోబు బలవంతంమీద తాగి ఓటేసి వచ్చాడు. మరొక సందర్భంలో ఎప్పుడో డజను ఖూనీలూ, అరడజను మానభంగాలు, పాతిక దోపిడీలూ చేసిన 'జ్ఞాని' ఒకడ్ని కొంతమంది 'అజ్ఞానులు' కాల్చి చంపితే వాళ్ల 'తీవ్రవాద' చర్యలకు నిరసనగా జరిగిన బందులో దుకాణాలు ధ్వంసం చేస్తుంటే బ్రాందీ షాపు దగ్గర దొరికిన విస్కీ సీసా తాగేడు.

ఆ అనుభవాల కన్నా ఇప్పుడు తాగుతున్న అనుభవమే బాగుంది.

అప్పుడప్పుడే గోడలు కదుల్తున్నట్టు గమనించగల్గేడు పేతురు. మూడో రౌండది. మరో గుక్క వెయ్యగానే పైకప్పూ అలా... అలా కూర్చున్న కుర్చీలూ, కుర్చీల క్రింద ఉన్న భూమీ గిర్రున తిరుగుతూంటే,

మనిషికి కళ్ళేలు వేసే న్యూనత, అల్పుడినన్న భావన, కోర్కెల గొంతును నిర్దాక్షిణ్యంగా నులిమి చంపే హంతకుడిగా మనిషిని మార్చే మొహమాటం, ఇప్పిస్తున్నది అతనూ, తాగుతోంది తనూ అన్న ఆలోచన, అన్నీ మటుమాయమై-

ఇప్పించేవాడెవడూ ఇప్పించుకునేవాడెవడూ? అనే తాత్త్విక ధోరణి తలెత్తి "నాకు సుట్టలు తెప్పియ్యి" అని అడిగేడు పేతురు.

వెంకటేశ్వర్లు పట్టించుకోలేదు. " ఇందాక అడిగేనే! పాతిక రూపాయలు పెట్టుబడి పెట్టి చెప్పులు తయారుచేసి అమ్మితే ఎంత లాభం వస్తుంది? అదే, వెయ్యి రూపాయలు పెట్టి వ్యాపారం చేస్తే ఎంత లాభం వస్తుంది? " అని మళ్ళీ అడిగేడు.

అప్పుడు నిషాలో కూడా ఠక్కున చెప్పేడు పేతురు.

"అంటే, పెట్టుబడి ఎంత ఎక్కువ పెడితే లాభాలు అంత ఎక్కువగా వస్తాయి, అంతే




కదూ? "

"అంతే!"

బేరర్ని పిలిచి ఇంకో సీసా మందు తెప్పించాడు వెంకటేశ్వర్లు.

"నాకు ముక్కుపుడక కావాలి"

"మనిద్దరం కలిసి బ్రాందీ షాపుకు వచ్చాం. నేను నీకు మందు తాగిస్తున్నాను. తినిపిస్తున్నాను. అంటే నేన్నీకు పెట్టుబడి పెట్టానన్నమాట. అలా పెట్టుబడి పెట్టి నీతో ఏదైనా ఒకపని చేయిస్తే ఎక్కువ లాభం రావాల్సింది పనిచేసిన నీకా? పెట్టుబడి పెట్టి నీచాత పనిచేయించిన నాకా? "

"నాకు సుట్ట కావాలి"

"ధర్మం ప్రకారం నాకే ఎక్కువ లాభం రావాలి. ఆ భాగ్యానికి 'మా కండలు పిండిన నెత్తురూ... మీ పెళ్ళికి చిలికిన అత్తరూ' అని అవాకులూ, చవాకులూ పాట్టం న్యాయమా నువ్వే చెప్పు"

పేతురుకు చాలా అసహనంగా ఉంది. తాగిన మైకం తలకెక్కింది. చుట్టకోసం నాలుక పీకుతోంది. నిస్సహాయతో, కాపట్యమో, మొహమాటమోగానీ ఇందాకటి వరకు గురువు చెప్పిందానికల్లా గంగిరెద్దులా తల ఊపిన తానిప్పుడు గురువునే ఖాతరు చెయ్యకుండా,

"సుట్టలు తెప్పియ్యక పోతే ఛణం కూకోను" అని విసురుగా లేచేడు. కోపంగా వెళ్ళబోయాడు.

అప్పుడు తెరచుకుంది వెంకటేశ్వర్లు జ్ఞాననేత్రం! అతడి పెట్టుబడికితోడు రక్షణగా ఉన్న లౌక్యం సహాయంగా నిద్రలేచింది!

ఆలోచించాడు.

నిజానికి అతను పెట్టుబడి పెట్టి పేతురు చేత త్రాగించింది, తినిపించిందీ కేవలం అతడినుంచి ఎక్కువ ప్రతిఫలం ఆశించేకానీ మరొకటి కాదు. అందులో వ్యాపార సంబంధాలు మాత్రమే ఉన్నాయి కానీ మానవ సంబంధాలు కావు.

పేతురు అలిగి వెళ్ళిపోతే అతగాడి వల్ల ప్రయోజనం పొందేందుకు వెచ్చించిన పెట్టుబడి అంతా వృధాపోతుంది. అలా జరిగితే పేతురు కోల్పోయేదాని విలువ బహు స్వల్పం. తను మాత్రం అమితంగా కోల్పోవాలి.

అందుకే వెంకటేశ్వర్లు అమాంతం లేచి పేతుర్ని చెయ్యి పట్టుకొని ఆపేడు. తాగి, ఉబ్బిన ముఖంనిండా చిర్నవ్వులు పులుంకున్నాడు. కోపాన్ని మనసులో నొక్కిపెడుతూ, " చుట్టలదేం భాగ్యం" అన్నాడు బలవంతంగా పేతుర్ని మళ్ళీ యథాస్థానంలోకి కూర్చోపెడుతూ.

"నాకు సుట్ట కావాలి" కుర్చీలో దర్జాగా వెనక్కు చేరగిలబడి ఒక్కో అక్షరాన్ని ఒత్తి పలికేడు పేతురు.

వెంకటేశ్వర్లు కూడా కుర్చీలో స్థిమితంగా కూర్చున్నాడు.

బేరర్ని పిల్చేడు.

"చుట్టల ప్యాకెట్టు తీసుకొనిరా..." అన్నాడు.

బేరర్ వెళ్ళిపోయాడు.

పేతురు మందుతో తనే గ్లాసు నింపుకొని ఒకే విడతగా గటాగటా తాగి ఖాళీ గ్లాసును మళ్ళీ మందు సీసా దగ్గర పెట్టి-

"నాకు ముక్కుపుడక కావాల్సిందే. మార్గం సెప్తానన్నావ్ సెప్పు!" అని అడిగేడు బ్యారరు కోసం దారి వేపు చూస్తూనే.

"సరే! విషయం ఏంటంటే, చెప్పానుగా ఎన్నికలొస్తున్నాయని! అవి ఎంతో దూరాన లేవు. నామినేషన్లక్కూడా తేదీ నిర్ణయించారు. మన నియోజకవర్గంనుంచి ఎంత మంది పోటీ చేసినా ప్రధానమైన పోటీ అంతా రామిరెడ్డి, సీతయ్యచౌదర్ల మధ్యనే ఉంటుంది..."

పేతురుకు అతను చెప్తోంది వినిపిస్తూనే



ఉందికానీ కొంచెం అయోమయంగా తోస్తోంది. వెంకటేశ్వర్లుకూ, తనకూ మధ్య దూరం ఒక గజం కూడా ఉంటుందో లేదో! అయినా పేతురుకు అతడు చెప్తోన్న మాటలు ఏ పాతాళ లోకంనించో, చంద్ర మండలంనుంచో వినిపిస్తోన్నట్టుగా ఉంది.

క్షణక్షణానికీ మందు ప్రభావం వల్ల శరీరం నీరశించి ఆ నీరసంలోంచి కసి, కోపం, ప్రతీకారేచ్ఛ తొంగిచూడసాగేయి.

ఆ ప్రతీకారం ఎవరిమీదనో అతనికి తెలియదు. శత్రువు ఎవరో తెలీదు. ఆ శత్రువు చేసిన అన్యాయం ఏమిటో తెలీదు. అసలు తనకు జరిగిన అన్యాయం ఏమిటో కూడా స్పష్టంగా అతను చెప్పలేడు.

అయినా గుండెలో నెగడు అంటుకున్నట్టు విపరీతమైన మంట. ఆ మంటమీద ప్రపంచంలోని అన్ని నదులూ, సముద్రాల నీళ్ళన్నీ తోడిపోసినా చల్లారేట్టులేదు.

చంద్రనిప్పుల్లా మండుతోన్న అతడి కనుగుడ్లు ముందుకు పొడుచుకొని వచ్చాయి.

"ముక్కుపుడక కావాలంతే" అన్నాడు ఆరిపోయిన చుట్టను అవతల పారేస్తూ.

"ఆ విషయాలకే వస్తున్నాను" అని క్షణం తర్వాత "మీపల్లెలో నీ జనం చాలామంది ఉన్నా నువ్వు యింతకాలం రాజకీయాలను అసలికి పట్టించుకోలేదు కదూ? " అడిగాడు వెంకటేశ్వర్లు.

"లేదు"

"పల్లెల్లో నీ అంత పలుకుబడి లేకపోయినా ఎన్నికలొస్తే ఏసోబు పెత్తనం చేస్తుంటాడుకదూ? "

"అవును"

"ఏసోబు సీతయ్యచౌదరి మనిషికదూ? "

"అవును"

"నీకు ముక్కుపుడక కొనటానికీ, యితర అవసరాలకూ డబ్బులు కావాలి కదూ? "

"అవును"

"ఐతే, వచ్చే ఎన్నికల్లో పల్లెపెత్తనం నువ్వు తీసుకోవాలి"

"తీసుకుంటే? "

"పల్లెవాళ్ళందరిచేత రామిరెడ్డికి ఓట్లేయించాలి"

"ఏపిస్తే? "

"రామిరెడ్డితో నీకు డబ్బులు యిప్పించే మార్గం చేస్తాను"

విచిత్రంగా చూశాడు పేతురు. "ఓట్లేత్తే సారా యిచ్చి పులేరం బెడతారుగానీ డబ్బులిస్తారా? " అడిగాడు.

అతడి అమాయకత్వానికి ఆశ్చర్యపోయాడతను.

పేతురుకు ఎలా చెప్పాలో తోచక క్షణం మౌనంగా తల గోక్కుని "పెద్ద వ్యాపారాల్లో సరుకు అమ్మాలన్నా, కొనాలన్నా మధ్యలో బ్రోకర్లు కావాలికదూ? " అని అడిగాడు వెంకటేశ్వర్లు.

"ఆఁ.... కావాల మరి!" తల ఊపాడు పేతురు.

"అలాగే ఎలక్షన్లలో ఓట్లు అమ్మాలన్నా, కొనాలన్నా బ్రోకర్లు కావాలి. ఉదాహరణకి మీ పల్లె తరపున నువ్వు రామిరెడ్డి మనిషివనుకో! అట్టా నియోజకవర్గం మొత్తంలో నీలాగా చాలామందిని నిర్ణయిస్తారు. మీలాంటి వాళ్ళందరినీ నియమించేందుకూ, మీలో ఎవరెవరికి ఎంతెంత డబ్బు యివ్వాలో చూసి రామిరెడ్డి దగ్గర్నుంచి డబ్బు తెచ్చి యిచ్చేందుకూ ఒక పెద్ద బ్రోకరుంటాడు. అతడు చెప్పినట్టు చేసి ఓట్లేయిస్తే నీ వాటా డబ్బు నీకు అందుతుంది. దాంతో నువ్వు ముక్కుపుడకే కొంటావో, పెళ్ళాం మురిపాలే తీరుస్తావో యిక నీ యిష్టం" అని చెప్పాడు వెంకటేశ్వర్లు.

పేతురు కొంచెంసేపు ఆలోచించాడు.

"నువ్వన్న ఆ పెద్దబోకరు ఎవరూ? " అడిగాడు.

"బెంజిమెన్"




పేతురు అతని పేరు విని ఉలిక్కిపడ్డాడు.

"బెంజిమెనా! వాడుట్టి మాయలోడు" అన్నాడు కోపంగా.

"ఐతే నీకేం? నీ పని నీది. వాడి పని వాడిది"

"ఆడ్ని నమ్మి ఏ పనీ సెయ్యగూడదు"

"ఎందుకని? " అడిగాడు వెంకటేశ్వర్లు.

"ఆడుట్టి నీతిమాల్నోడు" అన్నాడు పేతురు వెంటనే.

"ఎలా చెప్పగలవు? "

"ఆడు గాలివానలో ఇళ్ళు ములిగినోళ్ళ పేర్తో వసూలు చేసిన బియ్యం అమ్మిండు. డబ్బులు దాచుకుండు. ఒకేపు యిళ్ళు ములిగి తిండానికి వణ్ణం కూడా లేకుండా అక్కడోళ్ళు సత్తా ఉంటే ఆళ్ళ నోటికాడి బువ్వ లాగినోడు నీతిమాలినోడు గాకుండా ఏమగుతాడు? యియ్యాళ ఆళ్ళనోళ్ళు గొట్టిండు. రేపు మన్నోళ్ళా గొట్టడన్న నమ్మకంలేదు. అసుమంటోళ్ళు పీనిగెలమీది కొత్త బట్టలు కూడా నూక్కపోయేవోళ్ళేగానీ నీతిగలోళ్ళు కాదు" అని అనర్గళంగా ఉపన్యాస ధోఁరణిలో మాట్లాడుతోన్న వాడల్లా ఠక్కున ఆగిపోయాడు పేతురు.

ఆ కుంభకోణంలో వెంకటేశ్వర్లుకూ పాత్ర ఉందనీ అతను బెంజిమెన్ వెంటవెళ్ళి తుపాను బాధితుల బియ్యం అమ్ముతూ పట్టుపడ్డాడనీ, ఆ కేసులో తను దొరక్కుండా తప్పించుకొని బెంజిమెన్ బయటపడి వెంకటేశ్వర్లును బెయిలుమీద బైటికి తెచ్చాడనీ, అతనికి కొంత డబ్బుకూడా యిచ్చాడనీ, ఆ డబ్బుతోటే అతను భార్యకు కాళ్ళ పట్టీలు కొన్నాడనీ పేతురుకు జ్ఞాపకం వచ్చింది.

గ్లాసునిండా మందు వంపుకున్నాడు పేతురు. ఈసారి షోడాగానీ, నీళ్ళుగానీ కలపకుండానే పూర్తిగా తాగి గ్లాసు బల్లమీద పెట్టాడు.

పేతురుకు అప్పుడు అనుమానం వచ్చింది. అతను తనకు తాగిస్తున్నది ఆ డబ్బులతోనేనా?

బల్లమీద పెట్టిన ఖాళీగ్లాసులో తానే మందు వొంపబోయాడు వెంకటేశ్వర్లు.

చేత్తో అతని చెయ్యిపట్టుకుని ఆపాడు పేతురు. మరో చేత్తో తన గ్లాసునూ, మందు సీసానూ ముందుకు జరుపుకుని గ్లాసు అంచుల దాకా మందు వొంపుకుని, గటగటా తాగి ఆప్యాయంగా చుట్ట వెలిగించుకున్నాడు.

"చుట్ట బాగుందా? " అసందర్భంగా అడిగాడు వెంకటేశ్వర్లు.

"బాగుంది"

"మందో? " "అదీ బాగుంది"

"నువ్వు తాగిన మందు, కాల్చేచుట్టా ఎవరివో తెలుసా? "

"ఎవరివి? "

"బెంజిమెన్‌వి! అతనిచ్చిన డబ్బులతోనే యిప్పుడు మనం ఖర్చుపెడుతున్నాం"

"ఐతే"

"బెంజిమెన్‌ది అక్రమ సంపాదనే కావచ్చు నాదికూడా అంతే! కానీ మా డబ్బులు మార్కెట్‌లో చలామణి కాకుండా పోతున్నాయా నువ్వే చెప్పు. అక్రమంగా సంపాదించిన డబ్బుతో తాగిన మందు, కాల్చిన చుట్టా అన్నీ బాగానే ఉన్నాయన్నావ్. అలాంటప్పుడు అనుభవించటంలో తప్పేమిటి? " అడిగాడు వెంకటేశ్వర్లు.

"ఇయ్యన్నీ బెంజమేను డబ్బులని అనుమానం వొచ్చినాకనే మందులో సోడా కలపకుండా పచ్చిమందే తాగినాను. ఏంటికో తెలుసా? ఆడంటే నాకంత కచ్చగుంది"

"ఎందుకని? "

"బియ్యం కేసులో యిరికిచ్చబోయిండు నన్ను, అందుకని"



"యిరికిస్తే మాత్రం ఏమిటట. బెయిలు మీద తెచ్చేవాడు. డబ్బులూ యిచ్చేవాడు"

"కూలికోసరం యిసం దాగటం నావల్ల గాదు. అసుమంటి శబ్బరపన్లు నేను సెయ్య లేను" కరాకండిగా చెప్పాడు పేతురు.

"సరే! అది చెడ్డపనే అనుకుందాం. కానీ ఎలక్షన్లలో కష్టపడి ఓట్లేయించి అందుకు ప్రతిఫలం ఆశించడం తప్పేంకాదుగా" అడిగాడు వెంకటేశ్వర్లు.

"అద్దైతే ఆలోశిత్తాగానీ అది కూడా బెంజిమేన్ను నమ్మికాదు, ముక్కుపుడక కోసరం" అన్నాడు పేతురు.

వెంకటేశ్వర్లు మౌనంగా నవ్వుకున్నాడు.

జాలిగా పేతురువేపు చూశాడు.

పేతురుకు అంకిరెడ్డి చచ్చిన గొడ్డు జ్ఞాపకం వచ్చింది.

ఏలియా చెప్పినదానిప్రకారం గొడ్డు దగ్గర కూడా ఎవరో పోటీ తగిలారు. ధర పెంచారు. దాంతో అంకిరెడ్డి గొడ్డును ఎవరికి యివ్వాలా? అన్న ఆలోచనలో పడ్డాడు.

పేతురుకు చాలా కోపం వచ్చింది.

చుట్ట కొసను మునిపళ్ళతో కసిక్కున కొరికి తుపుక్కున ఉమ్మేడు. కుర్చీలోంచి లేచాడు. "గొడ్డుకోసరం అంకిరెడ్డి కాడికెళ్ళాలి. ఆ యిసయమే మందులోబడి మర్సేపోనాను. నేనింక యల్తా" అని నాలుగు అడుగులు వేశాడు.

ఠక్కున ఆగి, వెనక్కి తిరిగి మళ్ళీ నాలుగు అడుగులువేసి వెంకటేశ్వర్లు దగ్గరికి వెళ్ళి "గొడ్డును తెస్తే బండోడికి డబ్బులియ్యాల. నాకాడ డబ్బుల్లేవు. నీకాడుంటే పది రూపాయిలియ్యి" అని అడిగాడు నిస్సంకోచంగా.

వెంకటేశ్వర్లు అదోలా నవ్వుతూ, జేబులోంచి పదిరూపాయల కాయితం బైటికి తీసి గాలిలో ఊపుతూ, "పేతురూ నేనేం చేసినా లాభంకోసమే చేస్తాను. నీలాగా తీరని కోర్కెలతో సతమతం కాను. నా అభిమతం నెరవేర్చుకొనేందుకు ఎంతైనా ఖర్చుపెడతాను గానీ నేను పెట్టిన ఖర్చుకు వందరెట్లు ఆశిస్తాను. ఈ పది రూపాయలు అడగ్గానే ఎందుకు నీకు యిస్తున్నానో తెలుసా? రేపైనా నువ్వు మనసు మార్చుకొని నా దారిలోకి వస్తావనే" అంటూ పదిరూపాయల కాయితాన్ని పేతురు చేతిలో పెట్టాడు.

అతడి మాటలను పేతురు పట్టించుకోలేదు. ఏదో అర్థంకాని కోపం, కసి, ఆవేశం ముప్పిరిగొని పాములా బుసపెడుతూ వెంకటేశ్వర్లు యిచ్చిన కాయితాన్ని జేబులో కుక్కుకొని, వడివడిగా నడుస్తూ తూలుతూ అంకిరెడ్డి ఇంటికి బయల్దేరాడు.

పది రూపాయల అవసరం అతడ్ని నాలుగు అడుగులు వెనక్కు వేయించినట్టే, అతడి మనసులో బలంగా నాటుకున్న ముక్కుపుడక కోర్కె ఏ రోజైనా పేతుర్ని తన దగ్గరికి రప్పిస్తుందని భావిస్తూ తనలో తను గుంభనంగా నవ్వుకున్నాడు వెంకటేశ్వర్లు.

చేపలకోసం మార్కెట్టుకు వెళ్ళిన భాగ్యమ్మ ఇంకా తిరిగిరాలేదు.

భార్య కోసం అప్పుడప్పుడూ తలెత్తి చూస్తూ మార్తమ్మ అందాలను మనసులో ఊహించుకొంటూ కూర్చున్నాడు యోహాను.

నిజంగా, అందం అంటే మార్తమ్మదే.

మంచి వాసన సబ్బుతో స్నానం చేయించి పిక్కలదాకా చీరకట్టి అందుకు నప్పే బిగుతు జాకెట్టు తొడిగిస్తే మార్తమ్మ అచ్చం అప్సరసలా ఉంటుంది.

ఆమె నడుంకింది ఒంపులు, ఆ ఒంపుల కింది పిక్కలూ, ఆ పిక్కలకింది అందమైన పాదాలూ బంగారం కరిగించి పోత పోసినట్టే కనిపిస్తాయి.

ఆమె సన్నని నడుం పైభాగంలో కరిగించకుండా ముద్దల్లానే ఉంచిన ఆ బంగారపు

జబ్బలూ, ఎదమీది ఎత్తుపల్లాలూ ప్రవరుడినైనా ప్రకోపంలోకి నెట్టి ప్రేమజ్వరం తెప్పిస్తాయి.

వరూధిని మార్తమ్మంత అందగత్తె కాదేమో! లేకుంటే అలా ప్రవరుడు ఎందుకు ఆమెను తప్పించుకొని పారిపోతాడు.

తడక తలుపు దగ్గర చప్పుడైంది.

ఉలిక్కిపడి అటువేపు చూశాడు యోహాను.

ఆ చప్పుడు మార్తమ్మ చేసింది కాదు.

లేచి ముట్టెతో తడక తలుపును నెడుతున్న ఊరకుక్కను అదిలించి అది దూరంగా పారిపోగానే తలను మార్తమ్మ వెళ్ళిన దిక్కుకు తిప్పి కళ్లు చికిలించి చూశాడు.

మార్తమ్మ జాడే లేదు.

తలతిప్పి వీధికేసి చూశాడు.

భాగ్యమ్మ రావటంలేదు.

మళ్ళీ నులకమంచంమీద కూర్చోబోయిన వాడల్లా ఆగాడు. ఆలోచించాడు.

భాగ్యమ్మ వచ్చి 'ఇల్లు వదలిపెట్టి వచ్చి ఇక్కడ కూర్చున్నావేం?' అని అడిగితే ఏం సమాధానం చెప్పాలి?

అసలే భాగ్యమ్మకు తనమీద అనుమానం. భర్తలకు పరస్త్రీలను తార్చిన పురాణకాలపు పతివ్రత కాదామె. ఆమె భాగ్యమ్మ అంతే!

యోహాను క్షణం కూడా అక్కడ నిల్చో లేదు. తన ఇంటికి వెళ్ళాడు. ఇంటిముందున్న మట్టి అరుగుమీద కూర్చున్నాడు. కుక్కలు రాకుండా భాగ్యమ్మకు అనుమానం కలక్కుండా అక్కడ్నించే మార్తమ్మ ఇంటి మీద కన్నేశాడు.

నిజంగా అందం అంటే మార్తమ్మదే!

ముగ్గురు పిల్లలు పుట్టినా, పేదరికంవల్ల అనువైన తిండి, బట్ట, మనశ్శాంతి లేకపోయినా ఇంకా మార్తమ్మ అంత అందంగా ఎలా ఉందబ్బా!

ఆమె కళ్లలో ఏదో కైపుంది. కనుగుడ్లు తిప్పుతోంటే అందంగా ఉబ్బీ ఉబ్బని బుగ్గలూ, ముద్దొచ్చే గడ్డం...

ఛీ... ఛీ...! పిల్లలు పుట్టకపోయినా భాగ్యమ్మ ఎంత వికారంగా కనిపిస్తుందో! ఒక్కో జన్మతీరు అంతేమరి! పోషణ ఉంటే మాత్రం ఏం ప్రయోజనం!

దూరంనుంచి కనిపించింది గునగునా నడిచివస్తూ భాగ్యమ్మ. అదే సమయంలో ఇంటికి తిరిగివస్తూ మరోవైపు కనిపించింది మార్తమ్మ.

సుఖమూ- దుఃఖమూ; రాత్రీ-పగలూ; ఎండా-వెన్నెలా; మురుగుకంపూ- పూల సుగంధం వస్తున్నట్టే చెరో దిక్కునుంచి వస్తున్నారు భాగ్యమ్మ, మార్తమ్మ.

యోహాను దీర్ఘంగా నిట్టూర్చాడు.

పొరుగువాడి భార్యకన్నా తన భార్యే అందంగా ఉందనుకునే అదృష్టవంతులు అరుదుగా ఉంటారు. అతడికి ఆ అదృష్టం లేదు.

ఇద్దరూ దగ్గరికి వచ్చారు.

భయంతోటి భాగ్యమ్మవేపూ, ఆర్తితోటి మార్తమ్మవేపూ మార్చి మార్చి చూస్తూ భాగ్యమ్మ అలా చేపలబుట్ట పట్టుకొని వీధిలోనే శిలైపోతే ఎంత బాగుంటుందీ! అని మనసులోనే అనుకొని మార్తమ్మవైపు చూశాడు.

వయ్యారంగా నడుస్తూ ఊడిపడ్డ విద్యుత్తీగలా చప్పున తడక తలుపు తెరిచి ఇంట్లోకి వెళ్ళింది- మబ్బుల్లో దూరిన చందమామ మల్లే.

"మార్కెట్టంతా తిరిగినా బొమ్మిడాయిలేవు. వాలుగలుంటే తెచ్చినాను కిలో" అంది భాగ్యమ్మ లోపలికి వస్తూ.

యోహాను కూడా అరుగుమీంచి లేచి

భార్య వెంటే ఇంట్లోకి వెళ్ళాడు.

భాగ్యమ్మ బుట్టలోంచి చాపలను బైటకి తీసి పళ్ళెంలో పెట్టింది. బుట్టను తిరిగి యధాస్థానంలో భద్రం చేసింది. వొండేందుకు చాపలను సిద్ధం చేసేందుకు అంట్లు కడిగే చోటుకు చేపల పళ్ళెంతో వెడుతూ-

"నీ ఆలోశన కరట్టే నయ్యోవ్... మార్కెట్టు కాడ ముత్తేలమ్మ కనిపించింది" అంది.

"కనిపించిందా, ముత్యాలమ్మ?" అడిగాడు యోహాను మెరుపు కళ్ళతో.

అతడి మెరుపు కళ్ళను భాగ్యమ్మ గమనించలేదు.

"ఆc... ఎత్తుమడాల సెప్పులు దొడిగింది. కనకాంబరం రంగు గళ్ళకోక గట్టింది. ముందు మూరా, యనక జానా ఉండ రెయిక దొడిగింది. యీపూ, బొడ్డూ, గుండే కనిపిత్తా, ఎంత ఏబ్రేకంగా ఉందో మాయదారినంజ! దాన్ని సూత్తే సిగ్గుతో నా పేనం బోయిందిగానీ దానికి సిగ్గనిపిచ్చ లేదు..."

"దానికి సిగ్గనిపిస్తే అట్లాంటి వేషం ఎందుకు వేస్తుంది" అన్నాడు యోహాను.

"అద్గదీ శబ్బాసుమాట!" అంది భాగ్యమ్మ మెచ్చుకోలుగా భర్తవేపు చూస్తూ.

యోహానుకు ముత్యాలమ్మ రూపం కళ్ళ ముందు కదలాడింది.

భార్య వర్ణించి చెప్పిన ఆమె రూపాన్ని ఊహించుకొంటూ.

"ఐతే అది చీర బొడ్డుకిందికి కట్టిందా?" అని అడిగాడు.

"మరేటనుకుంటన్నావ్ అదంటే, అదుట్ట కంతిరీముండ. అది అసుమంటిముండ కాబట్టే దాంతో అయిద్రాబాదు ఎళ్తే నిమ్మ లంగుండు అని నెత్తీ నోరూ బాదుకుంటూ సెప్తుంది" అంది భాగ్యమ్మ చేపలను కడుగుతూ.

యోహాను కొంచెంసేపు మాట్లాడకండా ఆమె చేపలను కడిగే తీరును గమనిస్తూ మౌనంగా కూర్చున్నాడు.

భాగ్యమే మళ్ళీ అంది- "మంచి దినాలు కావియ్యి. ఏటి జేస్తాం. అంతా గాచారం. అసుమంటి మాయనంజలంతా సుకంగు న్నారు. మందిని సెంగున గట్టుకొని జల గల్లా ఆళ్ళ రగతం పీలుత్తాంటే సుకం గుండక ఏటి రోగంలే! మంచికి తానంలేదు. బువ్వలేదు. ఆదర్వులేదు. అదే గనక ఉంటే పాపం... మార్తమ్మ ఏంటి కట్టాగా అవస్తలు పడుద్దీ"

"ఏమైందే మార్తమ్మకు?" అడిగాడు యోహాను.

"పాపం... దానికి ముక్కుపుడక మీన ఉండబ్రెంవ ఈ జల్మలో తీరేట్టుగా లేదు..."

"ముక్కుపుడకా?" ఆశ్చర్యంగా చూశాడు.

"ఆc... దాని పెళ్ళయిన కాడ్నించి ఆ బ్రెంవ తీర్లేదు యియ్యాల్టికి. కొందాంcవని తడవకూ డబ్బులు దాపెట్టటం, ఏదో తీర్న అయి కర్సుగావటం... అంతేగానీ అసలు పని సానుకూలం గాటంలేదు. అందుకే అన్నా... మంచికియి రోజులుగావని" అంది భాగ్యమ్మ.

చాపలు కడగటం పూర్తయింది. కడిగిన చాపలను పళ్ళెంలో పెట్టుకొని లేచి ఇంట్లోకి వెళ్ళింది.

యోహాను కూడా లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకున్నాడు. లుంగీ కట్టుకొని మంచం మీద వాలేడు.

భాగ్యమ్మ వంట పనిలో నిమగ్నమైంది.

పైకప్పుకేసి చూస్తూ చాలాసేపు ఆలోచించాడు యోహాను.

ఆరోజు ఆస్పత్రిలో ఆమెకు తను ఇచ్చిన డబ్బులు ఇంటికి రాగానే తిరిగి ఇచ్చేసిందంటే అవి భాగ్యమ్మ అన్నట్టు ముక్కుపుడకకోసం దాచుకున్న డబ్బులే అయిఉం

టాయి. లేకపోతే అంతా చిల్లర ఇవ్వదు.

అంత చిల్లర ఇచ్చిందంటే అవి ముంతలో దాచిన డబ్బులే!

ఆస్పత్రిలో తను ఆ డబ్బులు ప్రొద్దున్నే కావాలని అనకుండా ఉండవలసింది. అలా తను అన్నది డబ్బులకోసం ఎంత మాత్రం కాదు. నిస్సహాయతలో పెడితే ఆమె ప్రాధే యపడుతుందని మాత్రమే!

కానీ మార్తమ్మ అలా ప్రాధేయపళ్ళేదు. ఇంటికి వెళ్ళగానే ఇస్తానని చెప్పింది. అలాగే ఇచ్చింది.

"పాపం మార్తమ్మ నాకు ఇచ్చింది ముక్కు పుడక కోసం దాచిన డబ్బులేనా? " మంచం మీద లేచి కూర్చుంటూ అడిగాడు యోహాను.

"అయ్యేనంట, మార్తమ్మే సెప్పింది" అన్నది భాగ్యమ్మ.

యోహాను మనసులోనే నొచ్చుకున్నాడు.

మార్తమ్మకు చేరువ అయ్యేందుకు అతడి మనసులో పథకం ఏదో రూపుదిద్దుకో సాగింది.



బ్రాందీషాపునుంచి బైటికొచ్చాడు పేతురు. అంతా అయోమయంగా ఉంది. కడుపులో ఏదో తెములుతున్నట్టూ, శరీరం దూదిపింజలా గాలిలో తేలిపోతోన్నట్టూ ఉంది.

వీధిలో కనిపిస్తున్న దృశ్యాలన్నీ బూజ రగా ఉన్నాయి. కళ్ళు చికిలించి చూస్తూ, అడ్డదిడ్డంగా నడుస్తూ అంకిరెడ్డి ఇంటివేపుకు సాగిపోతోంటే అడుగు ముందుకు వేస్తోన్న కొద్దీ రోడ్డు తన కడుపులోకి దూరిపోతో న్నట్టే అనిపిస్తోంది.

జాగ్రత్తగా నడుస్తూ ఓ అరగంట నడక తర్వాత అంకిరెడ్డి ఇంటికి చేరుకున్నాడు.

గేటు తెరుచుకొని లోపలికి వెళ్ళాడు.

వరండాలో వాలుకుర్చీలో పడుకొని దినప త్రిక చదువుతోన్న అంకిరెడ్డి గేటు చప్పుడు కాగానే తలెత్తి చూశాడు.

అప్పటికే లోపలికి వచ్చాడు పేతురు. వరండా మెట్ల దగ్గరే నిలబడి "దండాలు దొరా...!" అన్నాడు వినయంగా.

"ఇప్పటికి తీరిందంటరా నీకు? " అంటూ అంకిరెడ్డి పేపర్ని కిందపెట్టి తీక్షణంగా చూస్తూ "చచ్చిన గొడ్డును కొట్టంలోనే పెట్టు కొని నీ కోసం మేము ఎదురుచూడాలం టరా!" అన్నాడు.

"లేద్దొరా! దార్లో యంకటేశ్వర్లు కనిపిత్తే ఆడితో మాట్లాడతా ఆలీశమైంది" చెప్పాడు పేతురు.

"ఏలియాగాడు అంతా చెప్పాడా? ఏం నిర్ణయించుకొని వచ్చావ్? " అడిగాడు అంకి రెడ్డి.

"తంవరికి తెలవందేటీ... తంవరి గొడ్డు ఏది సచ్చినా ఇచ్చేది నాకే తంవరు. ఇంక డబ్బుల యవ్వారం అంటారా... అది తంవరి దయ"

"దయలూ, ధర్మాలూ ఎందుగ్గానీ మీవాడే... దేవసహాయం వచ్చి గొడ్డును వంద రూపాయలకు అడిగిండు. ఆ వంద నువ్వే ఇచ్చి గొడ్డును తొందరగా ఎత్త

కపో..." చెప్పాడు అంకిరెడ్డి.

పేతురు మెట్లమీద కూర్చున్నాడు. అంకిరెడ్డివేపు జాలిగా చూశాడు. "దొరా...! యియ్యాళ దేవసహాయంగాడొచ్చి యాబై ఎక్కువిత్తా అనంగానే తఁవరు నాకాడ గూడా వంద అడిగినారంటే దర్మంగాదు. బీదోణ్ణి. తఁవరి కాలిసెప్పులు గుట్టేవోణ్ణి. అసువంటోడి కాడ్నా దొరా... తఁవరు బేరం జేసేది! ఎట్టాగో కట్టపడి యాబై యిత్తాగానీ గొడ్డును నాకియ్యండి. కనికారం సూయిచ్చండి" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

అంకిరెడ్డి ముక్కుపుటాలు అదిరేయి! పేతురు మాట్లాడుతుంటే బ్రాందీ వాసన గుప్పున కొట్టింది.

సూదికళ్ళతో చూస్తూ, "తాగొచ్చావా?" అడిగాడు.

"యంకటేశర్లు తాపిత్తే..."

"వాడు తాగిస్తే తాగటమేనా... తాగుబోతు వెధవ! కష్టపడి చెప్పులు కుట్టటం, పది రూపాయలు రాగానే సారా తాగటం... అంతే మీ పని! బీదోళ్ళం అంటారు. బువ్వకి లేదంటారు. కాళ్ళా వేళ్ళా పడతారు. కనికరించమంటారు. పోన్లే పాపం అని జాలితలచి సహాయం చేస్తే చాటుకు వెళ్ళి తాగొస్తారు. ఇక మీ జన్మలింతేరా... మీరింక బాగుపడరు"

"తప్పయినాది దొరా... ఇంక తాగేది లేదు"

"తాగుబోతులందరూ అనేమాటే అది!"

"సత్తె్రెపెమాణకంగా ఇంక తాగను. తాగనంటే తాగను. గొడ్డు నిప్పిత్తే యల్తాను దొరా!" అని అడిగాడు పేతురు.

సరిగ్గా అప్పుడే దేవసహాయం వచ్చాడు. పేతుర్ని కొరకొరా చూసి అతడి పక్క నుంచే వెళ్ళి అంకిరెడ్డి వాలుకుర్చీకి ఎదురుగా బండలమీద కూర్చున్నాడు.

"దేవసహాయం కూడా వచ్చాడు. నీ వ్యవహారం తేలిస్తే ఒక పనైపోతుంది" అన్నాడు అంకిరెడ్డి పేతురుతో.

"సెప్తిగదా... దొరా! యాబైయిత్తాను" అన్నాడు పేతురు జాలికళ్ళతో చూస్తూ.

"అదేం కుదరదు. వంద ఇచ్చేవాడ్ని, కళ్ల ముందే పెట్టుకొని యాభైకి నీకియ్యటం అంటే నేను పిచ్చివాడినైనా కావాలి, వ్యాపారం అంటే తెలియని వెర్రివాడినైనా కావాలి. నేను ఆ రెండూ కాదు. నాక్కూడా వ్యాపారం తెలుసు" అన్నాడు అంకిరెడ్డి క్రీగంట చూస్తూ.

పేతురు అమాంతం నాలుగు మెట్లు జరిగి అంకిరెడ్డి కూర్చున్న కుర్చీ దగ్గర గువ్వలా కూర్చున్నాడు. రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టాడు.

"దొరా! తమరసుమంటి దర్మప్రభువులే యాపారం అంటా కనికరిచ్చకపోతే నా అసువంటోళ్ళింక బతికేదెట్టాగా! తమర్నన్ను తాగుబోతన్నారు. శాకిరిజేసి వొచ్చిన కాడికి తాగే యదవనన్నారు.

"ఇదంతా ఏంటికి సెప్తున్నానంటే జల్మలో యీవర్దాకా తాగుంటే నేను మహాఅయితే పదిసార్లు తాగుంటాను. అది గూడా నా డబ్బుల్తోనే గాదు; తాగేంత డబ్బు యాడుంటుంది నాకాడ!

"ఇయ్యాళ గూడా ఏంటికి తాగినానంటే అదొక పెద్ద కత! నా పెండ్లాం జల్మలో 'నాకిది గావాలి' అన్లేదు. అందర్లాగా మంచి బట్టా, బువ్వా గావాల్నని కోర్లేదు. ఓ...ప్పుడు మా లగ్గమైన దినం మాత్తరం ఒక్క ముక్కుపుడక అడిగిందంతే!

"దొరా! అది నాకూ నా బిడ్డలకీ శాకిరి శాస్తంది. పొద్దుగాల తొలికోడితో లెగిసిందంటే సీకటిబడి సెంద్రుడు నడినెత్తిమీనకి వొస్తేగానీ నిదరబోదు.

"ఒక్క సెప్పుంగటం గుడిసేనే ఆ శాకిరికి





నేను రూపాయి గుంజుతానే. అసువంటిది అది సేస్తన్న శాకిరికి ఎంతిత్తే రునం తీరుద్దో తఁవరే సెప్పండి.

"అస్మంటిదానికి ముక్కుపుడక కొందాఁ వంటే నావల్ల గాకొచ్చింది. దాని మెళ్ళోన పుస్తెగట్టి, లగ్గవాడి దానికి నేజేసిన అన్నేలం తల్చుకుంటేనే గుండె సెరువగుతాంది.

"అట్టాగా నేను దాని మెళ్ళో పుస్తెగట్టక పోనా అది సుకం గుండేదేమో! సక్కంగా బదికేదేమో. దానికి పుస్తెగట్టి పెండ్లాంగా సేసుకున్నానుగానీ దాని కోర్కె ఒక్కటే ఒక్కటి దొరా... ముక్కుపుడక. అదీ తీర్చ లేదు నేను.

"నా దరిద్దరం ఇంకా ఏంటిదంటే, అది తగువాడదు. అలిగి కూకోదు. మొగుడ్నీ, పిల్లల్నీ ఎగనూకి పుట్టింటికి బోదు. ముక్కు పుడక తేకున్నాగానీ నా మొగుడు యదవనీ, శాతగానోడనీ పక్కింటికి జెప్పదు.

"దొరా...! అసువంటి దానికింక ఎట్టా గైనా ముక్కుపుడక కొందాఁవని తీరుమా నించుకుండాను. తఁవరి సచ్చిన గొడ్డు దరంతకైనా నన్ను గొనుక్కునే వోడుంటే నన్ను నేను అమ్ముకోని ఆ డబ్బుల్తో దానికి కొనేవోణ్ణే ముక్కుపుడక!

"కానీ ఎవుడు కొంటాడు నన్ను.

"నేను సచ్చిన గొడ్డుకన్నా హీనం!

"యంకటేశర్లు కనిపిచ్చిండు. ఒకే మోపున తాగిచ్చిండు. ముక్కుపుడక కొంటా నికి మార్గం సెప్తానన్నాడు. మంచిదని ఎళ్లాను. మందు తాగాను. తీరా సూత్తే ఒక శబ్బరోడితో గలిసి యవ్వారం జేస్తే డబ్బు లొత్తాయన్నాడు.

"దొరా...! శబ్బరోళ్ళతోన గలిసి శబ్బరప నులు సేసేవోణ్ణే అయితే ముక్కుపుడక కొన్లేనా... ఏనాడో కొనేవోణ్ణి!

"అందుకే ఆడ్ని యిడ్సిపెట్టి తఁవరి కాడి కొచ్చినాను. తవరు కనికరిచ్చి గొడ్డునిత్తే దానివారు గోస్తాను. ఊరేస్తాను. సెప్పులు గుడతాను. తఁవరి బాకీ యిత్తాను. ముక్కు పుడకా కొంటాను. కనికరిచ్చండి దొరా... ఇంక అంతా తఁవరి దయ" అన్నాడు పేతురు.

"నా బాకీ ఏమిటి? యాభైకి గొడ్డును నీకే ఇచ్చినా అవి కూడా ఇప్పుడు ఇవ్వనం టావా" అడిగాడు అంకిరెడ్డి.

"లెవ్వుదొరా! సరుకు అమ్మంగానే యిత్తాను"

కుర్చీలో అసహనంగా కదిలేడు అంకిరెడ్డి. దేవసహాయంవేపు చూసి "చూఁడ్రా యీడి యవ్వారం! పోన్లే ఏడుస్తున్నాడని యాభైకే ఇస్తానన్నా ఆ డబ్బులు కూడా యిప్పుడు లెవ్వంట!" అంటూ పకపకా నవ్వేడు.

ఆ మాటలకు దేవసహాయం కూడా పెద్దగా నవ్వుతూ లేచి నిలబడి జేబులోంచి వంద రూపాయల కాయితం తీసి అంకిరె డ్డికి యిస్తూ, "ఆడి యవ్వారం తేల్దులే దొరా...! బండికూడా తెచ్చినాను. ఇంక గొడ్డునెత్తకెల్తాను" అన్నాడు.

అంకిరెడ్డి దేవసహాయం యిచ్చిన వంద రూపాయల కాయితాన్ని మడతపెట్టి జేబులో తోసేడు. వాలుకుర్చీలోంచి లేచి ఇంట్లోకి వెళ్ళబోయాడు.

పేతురుకు ఏం చెయ్యాలో ఒక్క క్షణం తోచలేదు. విసురుగా లేచి అంకిరెడ్డి దారికి అడ్డంగా నిలబడ్డాడు. "ఇది అన్నేలం దొరా... తమరికి దర్మంగాదు" అన్నాడు సాధ్యమైనంతవరకు కోపాన్ని, దుఃఖాన్నీ నిగ్రహించుకుంటూ.

అంకిరెడ్డికి చిర్రెత్తుకొచ్చింది.

పేతురు అలా తన దారికి అడ్డుగా నిల బడి మాట్లాడుతోన్నాడంటే యింకా నిషా దిగలేదన్నమాట. అలాంటప్పుడు అతడ్ని మందలించటం కూడా అనవసరం అనుకు న్నాడు. అతడి బుర్ర చురుకుగా పనిచే సింది.

దేవసహాయానికీ, పేతురుకూ ఇద్దరికీ మనసు నొప్పించకుండా, తన ధర్మం చెడకుండా "అయితే మీరిద్దరూ కలిసి ఆలోచించుకోండి. నా వరకు నాకు బేరం తెగి డబ్బు ముట్టింది. గొడ్డును మీ ఇద్దర్లో ఎవరు ఎత్తకపోయినా నాకేమీ సంబంధంలేదు. మీరూ మీరూ ఒకటే గనుక ఏం చెయ్యాలో మీరే ఆలోచించుకోండి" అన్నాడు.

"దర్మం సెయ్యాల్సింది తవురే. నేయం సెయ్యాల్సిందీ తవరే" అన్నాడు పేతురు రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెడుతూ.

"చెప్పానుకదా... బేరం తెగినట్టే! ఇప్పుడు గొడ్డు నాదికాదు. దేవసహాయంది. వాడ్ని డిగి వాడిస్తే నువ్వే ఎత్తకపో! ఇంక నాదేం లేదు" అంటూ పేతుర్ని తప్పించుకొని ఇంట్లోకి వెళ్ళాడు అంకిరెడ్డి.

దేవసహాయం పేతుర్ని అసలు ఖాతరే చెయ్యలేదు. అక్కడ్నించి కదిలి రెడ్డిగారి పశువుల కొట్టానికి వెళ్లాడు. చచ్చిన గొడ్డుకు మోకులు కట్టి, మనుషుల సహాయంతో బండిమీదికి ఎక్కించాడు.

బండికదిలి మెయిన్ గేటు దగ్గరికి రాగానే పేతురు వేగంగా వెళ్ళి బండిని నిలవేశాడు. బండి వెంటే వస్తోన్న దేవసహాయం రెండు చేతులూ పట్టుకొని "అన్నా... సాటోడివి నువ్వన్నా కనికారం సూయిచ్చు ఈ గొడ్డు నాకియ్యి. దీంతో లచ్చలూ కోట్లూ సంపాయిచ్చాలని గాదు, నా పెండ్లానికి ముక్కుపుడక కొనాలి" అని ప్రాధేయపడ్డాడు.

తాగిన మైకంలో పేతురు అలా బండిని నిలవెయ్యటంతో దేవసహాయానికి కోపం నషాళానికి అంటింది.

"బహుగొంటావ్ లేరా పెండ్లానికి ముక్కుపుడక! తాగే ప్రెతి యదవా యిసుమంటి మాటలే సెప్తాడు. దార్లో లెగు" అంటూ పేతుర్ని చేతులతో బలంగా పక్కకు తోశాడు.

ఆ విసురుకు పేతురు దూరంగా క్రింద పడిపోయాడు.

బండి గేటుదాటింది.

రోడ్డు ఎక్కి ముందుకు సాగిపోతోంది.

దాని చక్రాలకిందపడి నలుగుతూ చిన్న చిన్న రాళ్ళు చేస్తోన్న శబ్దాలు మాయలతో సూక్ష్మరూపం ధరించిన దెయ్యప్పిల్లలు చెవుల్లో దూరి లోపల గొడవ పెడుతోన్నట్టే అనిపించింది పేతురుకు.

అసలే కసి-కోపం, నిస్సహాయత!

ఆ పైన ముక్కుపుడకమీది వ్యామోహం!

ఆపైన తాగిన మైకం!

బండి అలా వెళ్ళిపోతోంటే తన శరీరం లోంచి జీవాన్ని యమపాశంతో పట్టిలాగి వెళ్తోన్నట్టే "అరే... దేవసహాయంగా" అంటూ గావుకేక పెట్టి ఉరుకుతూ బండి దగ్గరికి వెళ్ళి జల్లకదలకుండా బిగించిన నాటుకట్టెను అమాంతంలాగి, పక్కనే నిలబడి ఉన్న దేవసహాయం తలమీద బలంగా కొట్టాడు.

తల ఫాట్‌మని పగిలింది.

రక్తం పిచికారి చిమ్మింది.

కళ్లముందు నక్షత్రాలు పగిలేయి.

భూగోళం గిర్రున తిరుగుతోంది.

గావుకేక పెట్టి నేలమీద కూలిపోయాడు దేవసహాయం.

ఆ రక్తం, రక్తపు మడుగుమధ్య అచేతనంగా పడిఉన్న దేవసహాయం... ఆ దృశ్యాన్ని చూడగానే పేతురు కోపం, తాగిన మైకం ఉన్మాదంగా మారింది.

"సెప్తే యిన్నారంటరా సిత్తకార్తి యదవల్లార! రగతాలు బార్నా నాకేటీ బయ్యం లేదు. కూనీలు జరిగినా నాకేటీ బయ్యం లేదు. ప్రెపంచకం మొత్తం నామీన తిరగబడినా నాకేటీ బయ్యంలేదు. నాగ్గావాల్సింది నా పెండ్లానికొక్క ముక్కుపుడక!" అంటూ





నాటుకట్టె చేతబట్టి బండి ఎదరగా వెళ్ళి నిల్చున్నాడు.

అతడి సాహసం, తెగింపు, ఉన్మాదంలా మారిన కసి గమనించారు. దేవసహాయం వెంట వచ్చినవాళ్లు.

అతడితో తలపడటం అసాధ్యంగా తోచింది వాళ్ళకు.

"పోలీసులను పిలవండి" అన్నారెవరో.

కొంతమంది మనుషులు ఉరుకుతూ వెళ్తోన్న అడుగుల శబ్దాలు వినిపిస్తోన్నాయి.

"తాగుబోతు వెధవ ఇంతకు తెగించాడా! పోలీసుల్ని రానీ..." అంటున్న అంకిరెడ్డి మాటలు వినిపిస్తున్నాయి.

పేతురు అక్కడ్నించి కదల్లేదు.



భాగ్యమ్మ చాపలకూర వండింది. అన్నం తయారుచేసింది. సన్నగా చక్రాల్లా ఉల్లిగడ్డలు తరిగి ప్లేట్లో పెట్టింది. నిమ్మకాయను నాలుగు బద్దలుగా కోసి గింజలు ఏరేసింది.

మాంసాహారం తింటున్నప్పుడు నిమ్మకాయ రసం పిండుకొని ఉల్లిగడ్డ నంజుకుంటూ అన్నం తినటం యోహాను అలవాటు.

అతడి అభిరుచులకు అనుగుణంగా అన్నీ సిద్ధంచేసి "ఇంక లెగువ్, బువ్వ తిందువుగాని" అని కేకవేసింది.

మంచంమీద పడుకున్న యోహాను కదల్లేదు.

దగ్గరికి వెళ్ళి చేత్తో తట్టి లేపింది.

మార్తమ్మను గురించి ఆలోచిస్తూ పడుకున్న యోహాను భాగ్యమ్మ అలా తట్టి లేపటంతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

సుందరస్వప్నం చెదరిపోయినట్టే భార్య వేపు విసుగ్గా చూసేడు.

"లెగు...లెగు" అంది భాగ్యమ్మ.

"వంటైందా? " అడిగాడు.

"అందుకే లెగవమంది. కాళ్ళేతులు కడుక్కొత్తే బువ్వతిందాం" అంది భాగ్యమ్మ.

యోహాను మంచంమీంచి కిందికి దిగేడు. బైటికి వెళ్ళి నీళ్ళగాబు దగ్గర కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కున్నాడు.

భాగ్యమ్మ రెండు కంచాలు పెట్టి ఇద్దరికీ భోజనం వడ్డించింది. చాపల కూరవేసి ఉల్లిగడ్డల పళ్ళేన్ని ముందుకు జరిపింది.

ఇద్దరూ భోజనానికి ఉపక్రమించారు.

"నువ్వు బువ్వదిని తొంగుంటావా? యాడికైనా యళ్ళాలా? " అడిగింది భాగ్యమ్మ.

"ఎందుకూ? "

"మరేటీ లేదు. మార్తమ్మకి పేలు సూడాల. నా తల్లోగూడా ఎద్దుల్లాంటి పేన్లుండాయి. దాని శాత సూయిచ్చుకోవాల"

"నీదార్న నువ్వు పేలు చూపించుకో... మార్తమ్మకూ చూడు. మీ పేలకీ నాకూ ఏమిటి సంబంధం? " అడిగేడు యోహాను.

"నువ్వు ఇంటికాడుంటే మార్తమ్మ రాదు. వొచ్చినా కూకోదు. దానికంత బిడియం. అందుకే అడిగాను నువ్వుంటావా? యాడికైనా యల్తావా? అని. నువ్వెల్తే మార్తమ్మని యీడకి పిలుత్తాను. యళ్ళనంటే దాని కాడికే బోతాను!" అని చెప్పింది భాగ్యమ్మ.

యోహాను అన్నంతింటూనే ఆలోచించాడు.

"మార్తమ్మకు వీలు కుదుర్తుందో లేదో వెళ్ళి కనుక్కో. వస్తానంటే సరే! నాక్కూడా బజారుకు వెళ్ళాల్సిన పనుంది" అన్నాడు అన్నంతినటం ముగించి చెయ్యి కడుక్కుంటూ.

భాగ్యమ్మ కూడా భోజనం ముగించింది. ఎంగిలి పళ్ళేలు ఎత్తి పక్కన పెట్టింది. చేతులు కడుక్కుంది.

"నే ఎళ్ళి మార్తమ్మ వత్తానంటదో, నన్ను రమ్మంటదో అడిగొత్తాను" అని చెప్పి బైటికి

వెళ్ళిపోయింది.

యోహాను మంచమీద వాలేడు. భాగ్యమ్మ రాకకోసం ఎదురుచూస్తూ పడుకున్నాడు.

ఐదు నిముషాల్లోనే ఆమె తిరిగివచ్చింది.

"వస్తానందా? " వాకిట్లో ఉండగానే అడిగేడు యోహాను.

"రానంది" చెప్పింది. భాగ్యమ్మ.

"ఎందుకంట? "

"తల నెప్పిగుందంట. రేపొత్తానంది"

యోహాను మాటలను పొడిగించలేదు.

మంచంమీంచి లేచి బట్టలు కట్టుకొని ఎక్కడికో వెళ్ళేందుకు బైల్దేరేడు.

"యాడికీ? " అడిగింది భాగ్యమ్మ.

"చెప్పానుగా... పనుంది!"

"ఎప్పుడొత్తావ్? "

"పని కాంగానే" అంటూ చెప్పులు తొడుక్కొని వెళ్ళిపోయాడతను.

భాగ్యమ్మ తల గోక్కుంటూ కూర్చుంది.

★ ★ ★

పోలీసుజీపు రివ్వున వచ్చి ఆగింది.

నలుగురు కానిస్టేబుళ్ళు జీపులోంచి దిగి పేతుర్ను చుట్టుముట్టేరు. అతడి చేతిలో ఉన్న నాటు కట్టెను స్వాధీనం చేసుకొని పేతుర్ను చంకలకింద చేతులు మెలిపెట్టి పట్టుకొని జీపు ఎక్కించారు.

రక్తపు మడుగులో స్పృహలేకుండా పడిఉన్న దేవసహాయాన్ని జీపులోకి పట్టేరు.

జీపు ముందుగా గవర్నమెంటు ఆస్పత్రి దగ్గరికి వెళ్ళి ఆగింది.

పోలీసులు దేవసహాయాన్ని ఎమర్జన్సీ వార్డులోకి చేర్చేరు.

డాక్టర్లు వచ్చేరు. దేవసహాయాన్ని పరీక్షించి ఏవో యింజక్షన్లు చేసి తలకు బ్యాండేజి వేశారు. సెలైన్ అమర్చారు.

పోలీసుజీపు అటు తర్వాత పోలీసు స్టేషనుకు చేరుకుంది.

పేతుర్ను జీపులోంచి దింపి లాకప్ రూమ్‌లోకి తోశారు.

జరిగింది ఏమిటో పేతురు మెదడు అప్పుడు మననం చేసికొంది.

అంతా ఓ కలలా జరిగింది!

ఒకదానివెంట ఒకటి సినిమాలా కనిపించిందతని మనసు తెరమీద.

పేతురుకు అప్పుడు భయం వేసింది. దుఃఖం పొంగుకొచ్చింది.

భోరుమని ఏడుస్తూ లాకప్పు గదిలో ఒక మూలన కూలబడి పోయాడు 'మార్తమ్మా! నీకు ముక్కుపుడక కొందాంవన్న కోరికతో ఏంటో సేత్తే యిట్టాగైందేంటే నా బతుకు' అని ఆక్రోశిస్తూ.

పోలీసులు తనను పట్టుకున్న విషయం మార్తమ్మకు తెలిసేమార్గం ఏమిటా అని ఆలోచించాడు పేతురు ఆ దుఃఖపు పొంగు తగ్గగానే.

మార్తమ్మకు తెలిస్తే పల్లెవాళ్ళకు చెప్పి తనను విడిపించేందుకు ఏదో ఒక ప్రయత్నం చేస్తుంది. త్వరగా ఈ నరకం నించి బైటపడి యధావిధిగా చింతచెట్టు కింద చెప్పులు కుట్టుకోవాలి. అలాకాకుండా మరికొద్దిరోజులు ఇలాగే లాకప్పు గదిలో ఉంటే ఇల్లు గడవటం కూడా జరిగే పని కాదు.

ముక్కుపుడక మాట అటుంచి మార్తమ్మ, పిల్లలూ పస్తులు పడుకుంటారు!

పేతురు లేచేడు. కటకటాల దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు. నిలువుగా, అడ్డంగా ఉన్న యినుప కడ్డీలమధ్య సందుల్లోంచి బైటికి తొంగిచూసేడు.

ఎవరో ఒక కానిస్టేబులు ఖాళీ ఫ్లాస్కు పట్టుకొని స్టేషను బైటికి వెళుతూ వరండాలో కనిపించేడు.




అతను ఎవరో పేతురుకు తెలియదు. తెలిసిన కానిస్టేబుళ్ళు కనిపించలేదు.

తెలిసిన కానిస్టేబుళ్ళలో ఏ ఒక్కరు కనిపించినా తన పని సానుకూలమౌతుందిగానీ తెలిసినవాళ్ళెవరూ ఆ దాపులోనే లేరు.

పేతురు దగ్గర చెప్పులకు ఉంగటాలు కుట్టించుకునేవాళ్ళూ, ఉద్దేరగా బూట్ పాలిష్ చేయించుకునే వాళ్ళూ చాలామంది ఉన్నా సమయానికి ఒక్కళ్ళూ కనిపించక పోవటంతో యిక తప్పదన్నట్టు ఆ కానిస్టేబుల్ని కేకవేసి పిల్చేడు పేతురు.

ఆ కేకకు కానిస్టేబులు ఆగి 'ఏమిటి?' అన్నట్టు చూసేడు.

పేతురు రెండో మూడో యినుప కమ్మీలను వాటేసుకొని, రెండు చేతులూ బైటికి దూర్చేడు, హస్తాలను అతికించి కానిస్టేబులుకు దణ్ణంపెడుతూ "సారూ... ఒకమాట!" అని దీనంగా పిల్చేడు.

కానిస్టేబులు ఏ ఖయాల్లో ఉన్నాడోగానీ కొంచెం విసుక్కున్నా మరుక్షణమే కటకటాల దగ్గరికి వచ్చి

"ఏంకావాలి?" అన్నాడు.

పేతురు కళ్ళలో నీళ్ళూరేయి. కుడి కంటిని కుడి భుజానికీ, ఎడం కంటిని యడమ భుజానికీ తుడుచుకొని ఎగబీల్చుకుని.

"సారూ... తవరే దయసూడాల నన్ను" అన్నాడు జాలిగా.

పేతురు అతడికి యిచ్చిన అగ్రస్థానం అతడి అహాన్ని తడిమి లేపింది! "ఛత్... నా కొడక! కష్టపడి పనిచేసుకుంటూ సుఖంగా బతక్క తాగి హత్య చెయ్యబోతా వంటరా! ఒంట్లో చెంచా కండ లేదుగానీ నువ్వొక రౌడీవా?" అంటూ చేతిలోని ఫ్లాస్కును భుజానికి తగిలించుకొని నడుముకున్న వెడల్పాటి పోలీసు బెల్టును సర్రున లాగేడు.

గాలిలో గిర్రున తిప్పి, దణ్ణం పెడుతున్న పేతురు చేతులమీద బలంగా కొట్టాడు.

పేతురు గావుకేకపెట్టి కటకటాల బైట ఉన్న చేతులను అమాంతం వెనక్కు తీసుకున్నాడు.

ఆ చేతులమీద యినప కర్రు కాల్చి వాతపెట్టినట్టు భగభగా మండుతూ బెల్టు తాకిన మేరకు బుసబుసా పొంగింది.

పేతురు పెట్టిన గావుకేకకు రైటరు రామ్మూర్తి హడావుడిగా కటకటాల దగ్గరికి వచ్చాడు. "ఏమైంది?" అని కానిస్టేబుల్ని అడిగేడు.

"ఆ నా కొడుక్కి దయ చూపించాలంట!" అన్నాడు హేళనగా.

రైటరు రామ్మూర్తి మరికొంచెం కటకటాల దగ్గరికి జరిగేడు. జంతువులు నవ్వవన్న సత్యాన్ని అసత్యం అని రుజువు చేస్తూ కళ్ళ ముందు కుప్పిగంతులు వేస్తోన్న లేడికూనను చూస్తూ పులి పళ్ళికిలించినట్టే యికిలించి.

"ఎస్సై దొరగారింకా రాలేదు. రాంగానే చూపిస్తార్లేరా... దయ! ఎందుకంత తొందర పడతావ్?" అన్నాడు నర్మగర్భంగా.

రైటరు రామ్మూర్తి మాటలకు కానిస్టేబులు కూడా నవ్వేడు.

కానిస్టేబుళ్ళు కూడా నవ్వటాన్ని బేల కళ్ళతో విభ్రమంగా చూసేడు పేతురు. తెరలు తెరలుగా పొంగి వస్తోన్న ఏడుపును దిగమింగుకొంటూ తన శరీర భాగాలేవీ వాళ్ళ బెల్టులకు అందకుండా యినప చువ్వల తలుపును బిగించిన రాతిగోడ అంచు వెనుక నిలబడి.

"తమరంతా సదూకున్నోళ్ళు. తవరంతా గేనం దెల్సినోళ్ళు. తవరంతా సత్తేన్నీ, దర్మాన్నీ కాపాడు వోళ్ళు. ఎవుర్నయినా గుంజకొచ్చి కొట్లోబెట్టే అధికారం గలోళ్ళు.

పోలీసోళ్ళు!

"సాములూ! కోళ్ళని కప్పెట్టే గంపసువం టిది, మడుసుల్ని కప్పెట్టి కాపాడేటి మీ టోపీ! సత్తేనికీ, దర్మానికీ సావొచ్చినప్పుడు అదర్మాన్నీ, అసత్తేన్నీ శిచ్చిచ్చేది మీ లాటీ! బెజవాడ కనకదుర్గమ్మ రాచ్చసుడ్ని కాళ్ళతో తొక్కి సంపినట్టే మడుసుల్లో దాగుండ రాచ్చసుడ్ని తొక్కి సంపేది మీ బూటు! బొజ్జలు ముందుకు జారి ఏబ్రేకంగా కనిపి చ్చినట్టే అతికారం గిరి దాటి అస్సయ్యంగా కనిపిచ్చకుండా బిగిచ్చిపట్టేదే మీ బెల్టు!

"పోలీసు దొరలూ! నా అసువంటి సదువు లేనోడూ, గేనం అంటే తెలవనోడూ, ఎండల్లో వానల్లో సింసెట్టు కింద కూకొని సెప్పుల గుట్టేవోడూ, ఇంత పెద్ద బూప్రెపం చకంలో ఉండ వందల కోట్ల మందిలో మడిసిగా బుట్టినా వానపావసుమంటి బతుకు బతికేవోడూ... పేతురిట్టాగా అంటం ఏంటిదా? అని ముక్కుమీన ఏలే సుకోగాకండి!

"పసరాలు గూడా మడుసుల అక్కరకి సచ్చి శర్మాన్నిత్తన్నాయి. ఆ శర్మంతో జేసిన బూటులతో తేళ్ళనీ, యిసప్పావుల్నీ, మండ్ర గబ్బల్నీ తొక్కి సంపండిగానీ వాన పావుల్ని సంపమాకండి. తవరి బెల్టుల్తో మంది బువ్వని బలీమిన లాక్కుండే శబ్బరోళ్ళని గొట్టండిగానీ నోటి కాడి బువ్వపోతాందని గుబులు పడే నా అసువంటోళ్ళని కొట్టమా కండి" అంటూ ఈసారి చేతులను యినప కమ్మీల్లోంచి బైట పెట్టకుండానే దణ్ణం పెట్టాడు కటకటాల్లోంచి పేతురు.

నిండు సభలో ద్రౌపదిని వివస్త్రను చేస్తోంటే వికర్ణుడు ఆ దారుణాన్ని సహించ లేక 'ఇదేమి ధర్మం?' అని నిగ్గదీసి అడి గినా నోరుమెదపని ధృతరాష్ట్రుడికన్నా రైటరు రామ్మూర్తే నయమనిపించాడు!

"ఏందిరా నీ గోల?" అని అడిగేడు.

శాంతంగా ఉందా? ఆవేశంగా ఉందా? అని కలుగులోంచే కాపువేసిన పిల్లి కళ్ళలోకి చూస్తూ భావాలను చదివే ఎలకల్లే పేతురు కటకటాల్లోంచే రామ్మూర్తి కళ్ళలోకి చూసేడు.

అతడి కళ్ళలో అంత క్రౌర్యం కనిపించ లేదు!

"దొరా...! సెప్పులు గుట్టే పేతురు ఇల్లేడ? అంటే మాదిగ పల్లెలో ఎవ్వరైనా సూపిత్తారు. నేను కొట్లోబడిన యిసయం నా పెండ్లాం మార్తమ్మకి సెప్పాల. ఎవురో ఒకళ్ళా పున్నెం గట్టుకుంటే మా మార్తమ్మ వస్తాది. నన్నిడిపిస్తాది" అని ప్రాధేయపూ ర్వకంగా రైటరు రామ్మూర్తి కళ్ళలోకి చూసేడు మళ్ళీ పేతురు.

అదే సమయంలో రామ్మూర్తి వెనుకగా అక్కడికే వస్తోన్న మరో కానిస్టేబులు హను మంతు రామ్మూర్తి భుజాలమీది నుంచి కని పించేడు పేతురుకు.

అతడి కళ్ళు తళతళా మెరిసేయి!

తనకు హనుమంతుతో పరిచయం యీనాటిదికాదు! ఐదు సంవత్సరాల క్రితం అతను బదిలీమీద వచ్చిన రోజునుంచే పరి చయం.

కానిస్టేబులు హనుమంతు పేతురుతో చాలా చనువుగా ఉంటాడు!

పిల్లల సంచులు తెగినా, అతడి చెప్పులు తెగినా పేతురు దగ్గరే కుట్టిస్తుంటాడు. అందుకు ఒక్కరూపాయి ప్రతిఫలం కూడా అతడ్నించి ఎప్పుడూ పేతురు ఆశించి ఎరు గడు. పైగా ఉచితంగా అతడి చెప్పులకూ, బూట్లకూ పాలీషు కూడా పెట్టి పంపించే వాడు.

హనుమంతును చూడగానే పేతురుకు ధైర్యం చిక్కింది.

కరి ఆర్తనాదం విని వచ్చిన విష్ణుమూ ర్తల్లే కనిపించేడు. "అన్నా!" అని పెద్దగా అరిచేడు పేతురు.

హనుమంతు దగ్గరికి వచ్చాడు.

"ఏందిరా నువ్విట్టా? " అని అడిగేడు.

పేతురుకు మళ్ళీ ఏడుపొచ్చింది.

నీటిచుక్కలు కనుగొలుకుల్లో ఉండగానే అవి క్రిందికి జారకుండా ఎడంచేతి చూపు డువ్రేలు గోటితో గిల్లి పారవేస్తూ "అంతా నా గాచారం. యియ్యాళ లేచినేళ అస్మంటిది. అసలేటి జరిగినాదంటే" అని అంతా పూస గుచ్చినట్టే చెప్పేడు.

"యస్సైగారొచ్చే యాళైంది. నువ్వెళ్ళి ఫ్లాస్కులో టీ తీసుకరా! యీడి ఇషయం నా కొదిలెయ్యి" అన్నాడు హనుమంతు పక్కనున్న కానిస్టేబుల్తో.

అతడు విప్పిన బెల్టును మళ్ళీ పొట్టకు బిగించుకున్నాడు.

భుజానికి తగిలించుకున్న ఫ్లాస్కును తీసి, దాని బెల్టును చేతి మడమకు మెలివేసి ఊపుతూ బైటికి వెళ్ళిపోయాడు.

"ఆ... ఇంక జెప్పరా, పేతురూ...! మాది గపల్లెకి ఎళ్ళి నీ ఇల్లు యాడుందో కనుక్కొని నువ్వు జేసిన గనకార్యం ఇంట్లో చెప్పాలంటావ్" అని అడిగేడు కానిస్టేబులు హనుమంతు.

"తవరి దయ!"

"ఎళ్ళి చెప్పటానికి నాకు బాధేం లేదుగానీ వెళ్ళటమే ఎట్టాగా? అని ఆలోచిస్తున్నాను. నా సైకిలుకు పంచరైంది. పోనీ... నడిచి వెళ్దామంటే మాదిగపల్లె యాడుందా. శానా దూరం!" అన్నాడతను.

"ఏటి జేస్తారో... అంతా తవరిదయ"

హనుమంతు ఒక్కక్షణం ఆలోచించాడు. ఠక్కున తలెత్తి చూసి "నీకాడ డబ్బు లెంతున్నాయ్? " అని అడిగేడు.

"డబ్బులా? ఏంటికీ? " అన్నాడు పేతురు.

"చెప్పానుగా... సైకిలు పంచరైందని. నీకాడ డబ్బులుంటే ఇయ్యి, రిక్షాలో యల్తాను"

పేతురుకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది. వెంకటేశ్వర్లుతో కలిసి మందు తాగిన తర్వాత తను అంకిరెడ్డి ఇంటికి వెడుతూ చచ్చిన గొడ్డుకు బండి బాడుగకోసం పదిరూపాయలు తీసుకున్న విషయం.

"ఆ... ఆc... నా కాడ పది రూపాయలుండాయి" అంటూ పేతురు జేబులో చెయ్యిపెట్టి పదిరూపాయల కాయితం తీసి రిక్షా బాడుగకోసం కానిస్టేబులు హనుమంతుకిచ్చాడు.

అతను దాన్ని ఖాకీచొక్కా జేబులో కుక్కుకున్నాడు.

"ఇప్పుడే వస్తాను సారూ!" అని రైటరు రామ్మూర్తికి చెప్పి గబగబా మెట్లు దిగి సైకిలు స్టాండు దగ్గరికి వెళ్ళాడు. అక్కడ స్టాండేసిన తన సైకిల్ను తీసికొని మాదిగ పల్లెవేపుకు వెళ్ళిపోయాడు.

అలా వెళ్తోన్న కానిస్టేబులు హనుమంతు వేపే అసూయగా కొంచెంసేపు చూశాడు రైటరు రామ్మూర్తి.

అతడు కనుమరుగు కాగానే ఠక్కున తల తిప్పి, కటకటాల సందుల్లోంచి పేతుర్ని మింగేట్టే చూసేడు.

"థూ... నీ యమ్మ! నాలాంటి మంచోళ్ళకి రోజులు కావురా యివ్వి. ఇందాకటిదాకా దయ చూపిచ్చమని దణ్ణంపెట్టావ్ కానీ జేబులో చెయ్యేమైనా పెట్టావా! అదే హనుమంతు అడగంగానే పదిరూపాయలు తీసిచ్చావ్. ఎస్సైగారు రానీ... నా కొడక! యివ్వాళ నీకుందిరా... సీను" అంటూ గిర్రున వెనక్కు తిరిగి, కోపంగా వెళ్ళాడు.

పేతురుకు ఏంచెయ్యాలో తోచలేదు. జీవితం అనూహ్యంగా మలుపు తిరిగి చివరికి కటకటాలపాలు కూడా కావటంతో గుండె ద్రవించుకుపోతోంది.

తన స్వాధీనం తప్పుతూ మరింతగా కష్టాల్లో కూరుకొని పోతోన్న తన జీవితాన్ని

గురించి ఆలోచిస్తూ, భవిష్యత్తును భయానకంగా ఊహించుకొంటూ 'చిత్రహింసల గది' లో కూలబడిపోయాడు పేతురు.

★ ★ ★

ఇంటినుంచి బజారుకు వెళ్ళిన యోహాను సరాసరి 'ఎ టు జడ్ లేడీస్ కార్నరు'కు వెళ్ళాడు. పేల మందు అడిగేడు.

షాపు అతను యోహాను అడిగిన ప్యాకెట్టు యిచ్చేడు. దానిని వాడే విధానం, ధర అడిగి తెలుసుకొన్నాడు యోహాను. ధర చెల్లించి ప్యాకెట్టును జేబులో పెట్టుకొని ఇంటిదారి పట్టేడు.

భాగ్యమ్మ అలవాటు యోహానుకు తెలుసు! ఆమె పనేంలేకపోతే మధ్యాహ్నం భోజనం చెయ్యగానే ఒక గంటన్నా కునుకు తీస్తుంది.

అతడు ఆశించినట్టూ, ఊహించినట్టూ భాగ్యమ్మ నిద్రపోతే మార్తమ్మ ఇంటికి వెళ్ళి పేలమందు బహూకరించాలని అనుకొంటూ, మార్తమ్మను మాటలలో ఎలా పెట్టాలో ఆలోచించుకొంటూ పల్లెకు చేరుకున్నాడు.

ఇంటికి వెళ్ళాడు.

నిశ్శబ్దంగా తలుపును కొంచెం నెట్టుకొని ఇంట్లోకి తొంగిచూసేడు యోహాను.

అతడు ఆశించినట్టే భాగ్యమ్మ మంచం మీద పడుకొని నిద్రపోతూ కనిపించింది.

నిశ్శబ్దంగా మళ్ళీ తలుపు దగ్గరికి వేశాడు.

అడుగులో అడుగు వేసుకొని నడుస్తూ నెమ్మదిగా మార్తమ్మ గుడిసె దగ్గరికి వెళ్ళాడు. తడక తలుపు దగ్గర నిలబడి "మార్తమ్మా!..." అని కేకవేసి పిల్చేడు.

చిరిగిపోయిన ఏలియా చొక్కా కుట్టేందుకు వడిలో పెట్టుకొని సూదిలోకి దారం ఎక్కిస్తోన్న మార్తమ్మకు యోహాను పిలుపు వినిపించింది.

వడిలో ఉన్న చొక్కాను కింద పెట్టి బైటికి వచ్చింది.

"పేతురు లేడా? " అలాంటి సమయంలో అందరూ అడిగే ప్రశ్నే అడిగాడు.

"లేడు!" చెప్పింది మార్తమ్మ.

"పిల్లలు లేరా... కనిపించరేం? " మొదటి ప్రశ్నకు కొనసాగింపుగా అడిగేడు.

"లేరు" అంది మార్తమ్మ.

"నీ తల్లో పేలున్నాయని భాగ్యమ్మ చెప్పింది. అప్పటికప్పుడు బజారుకు వెళ్ళి పేలమందు తెచ్చాను నీకోసం" అంటూ జేబులోంచి పేలమందు ప్యాకెట్టు తీసి యివ్వబోయాడు.

మార్తమ్మ రెండు అడుగులు వెనక్కు వేస్తూ "నాకేంటికీ...వొద్దు"అంది కంగారుగా.

"ఎందుకంత భయపడ్తావ్! ఏదో యిరుగూపొరుగూ వాళ్ళం మనం. కావాల్సిన వాళ్ళంకూడా! అందుకేగా అర్ధరాత్రి పేతురు కోసం నేనూ మీ వెంట ఆస్పత్రికొచ్చింది. లేకుంటే రానుకదా! ఏంటోగానీ నువ్వంటే నాకు చాలా అభిమానం. కడుపులో దాచుకోకుండా నీతోనే చెప్తున్నాను. ఎలా నన్ను అర్థంచేసుకుంటావో యింక నీ యిష్టం" అన్నాడు మరో అడుగు ముందుకు వేస్తూ.

మార్తమ్మకు ఏమనాలో ఏంచెయ్యాలో తోచలేదు ఒక్కక్షణం.

ఏంచెయ్యాలో తోచిన వెంటనే "భాగ్గెమ్మప్పోవ్!" అంటూ పెద్దగా కేకవేసింది అక్కడ్నించే.

యోహాను మార్తమ్మ అలా పిలవగానే ఉలిక్కిపడ్డాడు.

చేతిలో ఉన్న పేలమందు ప్యాకెట్టును మంచంమీదికి విసిరేసి,

"ఇంక నేను యల్తాగానీ ఆ మందు తలకు రుద్దుకో. అరగంట ఆగి తలమీద స్నానంచెయ్యి. పేలన్నీ చచ్చి రాలిపోతాయి. భాగ్యమ్మ చాత చూపించుకున్నా




దానికి కనపడీ కనపడకా ఒకటి రెండు పేలు తీసినా ప్రయోజనం ఉండదు. అది ఆలోచించే నీకోసం మందు తెచ్చాను" అని చెప్పి హడావుడిగా ఇంటికి వెళ్ళిపోయాడు.

భాగ్యమ్మవేపు చూసేడు.

ఆమె సన్నగా గురకపెడుతూ నిద్రపోతోంది.

అతనూ మంచంమీదికి చేరేడు. బట్టలు మార్చుకోకుండానే వెల్లికిలా పడుకొని, తల మీద చెయ్యిపెట్టుకుని ఆలోచిస్తూన్నాడు.

అతడికీ నెమ్మదిగా కునుకు పట్టింది.

నిద్రలేచి యోహాను, భాగ్యమ్మ టీ తాగుతూ కూర్చున్నారు.

కొంచెం సేపటికి మార్తమ్మ ఇంట్లోంచి పెద్దగా ఏడుపు వినిపించింది.

"ఎవరా ఏడ్చేది? " భాగ్యమ్మను అడిగేడు యోహాను.

భాగ్యమ్మ ఆలకించి విన్నది "మార్తమ్మే!" అన్నది టీ గ్లాసు కిందపెట్టి లేస్తూ.

యోహాను కూడా కుర్చీలోంచి లేచాడు.

ఇద్దరూ హడావుడిగా మార్తమ్మ యింటికి వెళ్ళారు.

"ఇంక నీ యిష్టం మార్తమ్మా...! పేతురు చేసిన నేరం చిన్నది కాదు. ఎటెంప్ట్ టు మర్డర్! అంటే, హత్యా ప్రయత్నం అన్న మాట. ఇండియన్ పీనల్ కోడ్ త్రీ నాట్ సెవెన్ క్రింద కేసు పెట్టారంటే కింది కోర్టులో బెయిలు కూడా రాదు. సెషన్సు కోర్టుకు వెళ్ళాలి. శిక్ష పడిందంటే ఆరు సంవత్సరాల జైలు శిక్ష పడినా పడొచ్చు" అంటున్నాడు కానిస్టేబులు హనుమంతు భాగ్యమ్మ, యోహాను అక్కడికి వెళ్ళేసరికి.

హనుమంతును అడిగేడు యోహాను. "ఏం జరిగింది? " అని.

హనుమంతు జరిగిందంతా చెప్పాడు.

"త్రీనాట్ సెవెన్ కాకుండా పెట్టీకేసు పెట్టే వీల్లేదా? " అని అతడ్ని అడిగేడు యోహాను.

"అలా వీలుండకపోవచ్చు"

"ఎందుకని? "

"మా ఎస్సైగారు చాలా స్ట్రిక్టు!"

"చాలా అంటే ఎంత? "

"అది ఆయనతోనే మాట్లాడుకోవాలి. మాదేముందీ... మామూలు కానిస్టేబుళ్ళం" అన్నాడు హనుమంతు.

"ఇంతకీ మా పేతుర్ని బైట ఉంచారా? లోపల వేశారా? " క్రీగంట మార్తమ్మను గమనించి చూస్తూ అడిగేడు యోహాను హనుమంతును.

"లాకప్పు గదిలో వేశారు. పెద్దకేసు కదా!"

"కొట్టటంలేదు కదా? "

"ఇంకాలేదు, ఎస్సైగారు రావాలి" చెప్పేడు హనుమంతు.

మార్తమ్మ ఏడుపు లంకించుకుంది మళ్ళీ.

"హనుమంతుగారూ! సరే... మీరు మామూలు కానిస్టేబుళ్ళు. కాదనేది ఏముందీ, మీ మామూళ్ళు మీవి. అలాగే ఎస్సైగార్తో కూడా మాట్లాడ్తాం. పెట్టీకేసుతో సరిపెట్టే మార్గం చూద్దాం. అందుకు మీ అందరి సహకారం కావాలి" అన్నాడు యోహాను.

"చెప్పానుగా... ఎస్సైగారు చాలా స్ట్రిక్టు. అందుకు మీరు సరే అంటే ఏదో ఒక మార్గం చెయ్యవచ్చు" అని కానిస్టేబులు హనుమంతు తిరిగి స్టేషనుకు వెళ్ళేందుకు బయల్దేరి "మార్తమ్మా! మీ ఆయన నిన్ను వెంటనే రమ్మన్నాడు." అని మళ్ళీ గుర్తుచేసి సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

మార్తమ్మ పైటచెంగు ముఖానికి అడ్డం పెట్టుకొని ఏడుస్తూ కూర్చుంది.

భాగ్యమ్మ మార్తమ్మ పక్కనే కూర్చుంది.

ఆమెను ఊరడిస్తూ- "ఊర్కోయే మార్తీ! గాచారం అట్టా కాల్నాక ఎవురు మాత్తరం



ఏం జేస్తారంట. ఈ మగసచ్చినోళ్ళంతా అంతే! ఆళ్ళకి ఎప్పుడేం గత్తరొస్తుందో తెలవదు. సక్కగా సెప్పులు కుట్టుకుంటూ యాళకి యింటికొస్తా కలో గంజో తాగుతా నిమ్మలంగుండే నీ మొగుడు తాగిండంటే ఏఁవనాల. తాగిండే అనుకో! తగువుకి బోయి దేవసహాయంగాడ్ని సంపబోటం యిసిత్తరంగదూ?

"అదే అంటారు గాచారం అంటే! ఇసువంటోళ్లు మనకి పెనివిట్లు గావటమే యనక జల్మలో మనంజేసిన పాపం! ఇంకా నా మొగుడన్నా గాలోడంటే నమ్మొచ్చుగానీ నీ మొగుడిట్టాగా సేసిండంటే ఎట్టా నమ్మేది?

"గాచారం అట్టా కాల్నాక ఏడ్సిమాత్తరం ఏంజేస్తాం! లెగు... లెగు. ముకం తుడ్చుకొని పోలీసుటేశను కాడికి ఎళ్లి మొగుడ్ని సూసిరా!" అంది భాగ్యమ్మ.

మార్తమ్మ దుఃఖం ఎల్లలు దాటింది.

మార్తమ్మ అలా ఏడుస్తోంటే కొంచెం బాధ అనిపించినా లోలోపల మాత్రం సంతోషంగానే ఉంది యోహానుకు!

ఇనుము కాల్తేనే వొంగుతుంది...

మార్తమ్మ కష్టాల్లో ఉంటేనే లొంగుతుంది!

కాకుంటే, కాలిన ఇనుముకు సమ్మెట దెబ్బలు ఎలా అవసరమో మార్తమ్మకు అలా తన సహకారం అవసరం. అందుకే-

"మార్తమ్మా! నువ్వేమీ దిగులు పడొద్దు. ఎవ్వరూ లేరని అనుకోవద్దు. అన్నింటికీ నేనున్నాను" అంటూ ఎందుకో అనుమానం వచ్చి భార్య వేపు చూస్తూ "భాగ్యమ్మా వుంది" అని ధైర్యం చెప్పాడు యోహాను.

మార్తమ్మ ఇంకా సన్నగా ఏడుస్తూనే వుంది.

"నువ్వలా ఏడుస్తూ కూర్చుంటే సమస్య పరిష్కారం కాదు. మనం పోలీసు స్టేషన్‌కు వెళ్దాం. ఎస్సైగారితో మాట్లాడి ఏంచెయ్యాలో అది చేద్దాం. భాగ్యమ్మ చెప్పినట్లు నువ్వు లేచి కొంచెం ముఖం కడుక్కోనిరా..." అన్నాడు యోహాను.

మార్తమ్మ క్షణం ఆలస్యం చెయ్యకుండా కళ్ళు తుడుచుకుంది. లేచి నీళ్ళగాబు దగ్గరికి వెళ్ళి ముఖం కడుక్కుంది. పగిలిన అద్దం పెంకు ముందు నిలబడి నొసటికి బొట్టుబిళ్ళ అంటించుకుంది.

ఇల్లు జాగ్రత్తగా చూసుకోమని భాగ్యమ్మకు చెప్పి యోహాను, మార్తమ్మ కలిసి పోలీసు స్టేషనుకు బయల్దేరారు.

"రిక్షాలో వెళ్దామా?" ఇల్లుదాటి కొంచెం దూరం వెళ్ళగానే అడిగాడు యోహాను.

"వొద్దు, నడిసేపోదాం" అన్నది మార్తమ్మ.

ఇద్దరూ అలా నడుస్తూ మరికొంచెం దూరం వెళ్ళాక "మార్తమ్మా! నీ మొగుడి విషయంలో నువ్వు చాలా కంగారుపడుతున్నావు కదూ?" అడిగాడు.

మార్తమ్మ సమాధానం చెప్పకుండా మౌనంగా నడుస్తోంది.

"అదంతా నాకొదిలేయి. నువ్వు హాయిగా ఉండు. నవ్వుతూ నువ్వు కనిపిస్తుంటే చాలు నాకు ఏదైనా సాధిస్తాను. నువ్వంటే అంత అభిమానం నాకు" అని ఎంతకూ మార్తమ్మ పెదవి విప్పి మాట్లాడకపోతోంటే చివరకు-

"పేలమందు తలకు రాసుకున్నావా?" అని అడిగాడు.

ఆమెకు సమాధానం చెప్పక తప్పలేదు. "ఇంకా లేదు" అంది.

"నిన్ను పేను కుడుతుందంటేనే సహించలేక పేలమందు తెచ్చానంటే అది చాలు- నువ్వంటే నాకు ఎంత ప్రేమో అర్థం చేసుకోటానికి! నువ్వేమో అంటీ ముట్టనట్టుంటావ్! అట్టా నువ్వంటున్న కొద్దీ అభిమానం పెరుగుతుంది నాకు" అన్నాడు




యోహాను.

ఆమె మౌనంగా నడుస్తోంది.

"నీకు నావంతు సహాయం నేను చేసినా ఒక్క పేతురు సంపాదనమీదనే కుటుంబం గడవాలంటే చాలా కష్టం. పైగా వాడు తాగుతున్నాడు..."

మార్తమ్మ చివాలున తలెత్తింది. "ఇయ్యాళ ఏంటికి తాగినాడోగానీ ఆయనకి అలవోటు లేదు" అంది దృఢంగా.

"అయితే మంచిదే! ఇంతకీ ఏం చెప్పొచ్చానంటే, ఒక్క పేతురుమీదనే సంసారం జరగాలంటే చాలా కష్టం. నువ్వు కూడా కాస్తో కూస్తో సంపాయించావే అనుకో! సంసారం హాయిగా గడుస్తుంది. పెద్ద పెద్దోళ్లు గూడా పెళ్లాల చాత ఉద్యోగాలు చేయిస్తున్నారు. వ్యాపారాలు పెట్టిస్తున్నారు. రెండు సంపాదనలతో సుఖంగా బతుకుతున్నారు. బంగళాల్లో ఉంటూ. కార్లలో తిరుగుతున్నారు. అలాంటప్పుడు నువ్వొ ఏదో ఒకటి చేస్తే తప్పేంటి? " అన్నాడు యోహాను.

"అంటే? "

"వాళ్ళ లెవెల్ని బట్టి వాళ్ళ సుఖాలుంటాయి. మన లెవెల్ని బట్టి మన సుఖాలుంటాయి. మీకు బువ్వకింత లోటు లేకుండా జరిగితే చాలు. కష్టపట్టంలో తప్పేముంది? "

"ఏం సెయ్యాలో తరసటంలేదు" అంది మార్తమ్మ.

"నేను పెట్టిచ్చిన కుట్టుపని కేంద్రం ఉంది. అందులో చేర్పిస్తాను. కుట్టుపని నేర్చుకో. మిషనూ యిప్పిస్తాను. పల్లెవాళ్ల లంగాలు, జాకెట్లూ కుట్టుకుంటూ కూర్చున్నా నీ సంపాదన నీకుంటుంది" చెప్పాడు యోహాను.

"కుట్టుపని ఎవురు నేర్పిత్తారూ? ". అడిగింది మార్తమ్మ.

"ముత్యాలమ్మ!"

మార్తమ్మ మౌనంగా తల పంకించింది.

ఇద్దరూ పోలీసుస్టేషను దాపులోకి చేరుకున్నారు.

"మార్తమ్మా! నీ ముక్కుకు ముక్కుపుడకుంటే భలే అందంగా ఉంటావు నువ్వు" అన్నాడు యోహాను మురిపెంగా చూస్తూ.

మూపుమీద కూర్చున్న కాకి ముక్కుతో పుండును పొడిస్తే గేదె వొళ్ళు జలదరించినట్టే జల్దరించింది మార్తమ్మ.



ఎస్సై లోకనాథం అప్పుడే పోలీసుస్టేషన్ ముందు ఆగిన జీపులోంచి హుందాగా కిందికి దిగాడు. పరిసరాలను డేగ కళ్లతో పరిశీలనగా చూస్తూ స్టేషను మెయిన్‌గేటు దగ్గరికి వెళ్ళాడు.

అప్పటివరకూ తుపాకిని నేలమీద ఆన్చిపెట్టి విశ్రాంతిగా నిల్చున్న సెంట్రీ ఏడుకొండలు ఎస్సై దగ్గరికి రాగానే ఎలర్టయ్యాడు.

తుపాకిని ఎత్తి భుజంమీద పెట్టుకుని సావధాన్ పొజిషన్లోకి వస్తూ అరచేత్తో తుపాకిమీద చరిచి సెల్యూట్ చేశాడు.

సెంట్రీ క్రమశిక్షణలో ఎంతమాత్రం లోపంఉన్నా వెంటనే అతడ్ని కొరత వేద్దా

మన్నంత తీక్షణంగా చూసి, అలాంటి అవకాశం లేదని గ్రహించి ఎస్సై లోకనాథం ఠీవిగా నడుస్తూ వరండా మెట్లు ఎక్కాడు.

చివరి మెట్టు దాటి కుడివేపుకు తిరిగాడు.

వరండాగుండా పది అడుగులు వేసి తన చెక్కల గదిలోకి వెళ్ళి బిగుతుగా పొట్టకు వొరుచుకొని బాధ పెడుతున్న బెల్టు హుక్కులు తీసి, దాంతోపాటు ప్యాంటు, గుండీనీ, హుక్కునూ విప్పి విశ్రాంతిగా గాలి పీల్చుకొని కూర్చున్నాడు.

అతని కోసమే ఎదురు చూస్తున్న రైటరు రామ్మూర్తి ఎస్సై గదిలోకి వెళ్ళాడు. సెల్యూట్ చేసి వినయంగా నిల్చున్నాడు.

"హెడ్డు ఎక్కడ? " అడిగాడు ఎస్సై లోకనాథం.

"చెప్పి వెళ్ళాడు, రైల్వేస్టేషన్‌కి"

"ఎందుకూ? "

"ఓ... ప్పుడు మనం పట్టుకున్న గంజాయి కేసులో ముద్దాయిల్ని ఎంఎల్లేగారు విడిపించుకొనిపోయారుకదా! వాళ్ళమీద కేసు పెట్టొద్దన్నారట. మన దగ్గర పట్టుకున్న గంజాయి ఉందికానీ ముద్దాయిల్లేరు..."

"అయితే? "

"గంజాయి పట్టుకున్నట్టు పత్రికల్లో వచ్చింది. కేసు కట్టమని ఎస్.పి. దొరగారు ఒకటే గొడవట..."

"నాదాకా రాలేదే ఈ విషయం"

"డి.ఎస్.పి. దొరగారు ప్రొద్దున్నే ఫోన్ చేశారు. ఎలాగైనా కేసు కట్టమన్నారు"

"హెడ్డు స్టేషనుకు ఎందుకు వెళ్ళినట్టు? "

"ముద్దాయిల కోసం"

"ముద్దాయిలను ఎం.ఎల్లేగారే విడిపించుకొనిపోయారుగా!"

"అందుకే హెడ్డు రైల్వేస్టేషనుకు వెళ్ళాడు. ఎవరైనా గంజాయి తాగే యిద్దరు సాధువుల్ని తెచ్చి వాళ్ళను ముద్దాయిలుగా కోర్టుకు పెడితే ఎం.ఎల్.ఎ.గారి మాటా చెల్లుతుంది మన లా అండ్ ఆర్డరూ బాగుంటుంది!"

"అయితే స్టేషన్‌నించి సాధువుల్ని తీసుకురాగానే ఛార్జిషీటు, ఎఫ్.ఐ.ఆరూ... ఇంకా కావాల్సిన రికార్డంతా తయారుచెయ్యండి. నేరస్తులను రేపే కోర్టుకు పెడదాం. ఆలస్యం అయితే డి.ఎస్.పి.గారి దగ్గర మనకు మాటొస్తుంది. వారికి ఎస్.పి.గారి దగ్గర, ఎస్.పి.గారికి డి.జి.పి.గారి దగ్గరా, వారికి హోంమంత్రిగారి దగ్గరా, వారికి ముఖ్యమంత్రిగారి దగ్గరా, వారికి ప్రపంచ బ్యాంకు దగ్గరా మాటొస్తుంది..."

"అంత యవ్వారముందా దాన్లో? " అడిగాడు రైటరు రామ్మూర్తి.

"మరి! మత్తుపదార్థాలు యదేచ్ఛగా స్మగులయ్యే దేశాలకి ప్రపంచబ్యాంకు అప్పులివ్వదు" చెప్పాడు ఎస్సై లోకనాథం.

రామ్మూర్తి తల పంకించాడు.

లోకనాథం కుర్చీలోంచి లేచాడు. బలంగా ప్యాంటు జిప్పులాగి హుక్కు పెట్టాడు. హుక్కు పక్కన ఉన్న గుండీ పెట్టాడు. "ఊఫ్" అంటూ కడుపులోని గాలినంతా గుండెల్లోకి తెచ్చుకొని బెల్టు బిగించాడు. బల్లమీంచి లాఠీ అందుకొని-

"లాకప్పులో ఎవరున్నారు? " అని అడిగాడు.

"అదే సార్... ఎటెంప్ట్ టు మర్డర్ కేసు! మనవాళ్ళు ముద్దాయిని తెచ్చి లోపల వేశారు"

"ఏం పేరు వాడిది? "

"పేతురు అంటారు. చర్చి దగ్గర చెప్పులు కుడుతుంటాడు"

"రికమెండేషన్లేమీ లేవుగా? " అడిగాడు ఎస్సై.

"చెప్పులు కుట్టేవాడు, వాడికెవరు సార్ దిక్కు"




"దళిత సంఘాల వాళ్ళొస్తే కొంపలంటు కుంటాయ్"

"వాడు చంపబోయిందీ దళితుడ్నే"

"అయితే మనకేం పేచీ లేదంటావ్! సరే... పద" అని ఎస్సై లోకనాథం చెక్కల గదిలోంచి బైటికి నడిచాడు. భారీకాయాన్ని మోసుకుంటూ ఒక్కో అడుగే వేస్తుంటే వరండా అంతా ప్రతిధ్వనిస్తోంది, ఇనపనా డాల బూట్లశబ్దం.

అతను లాకప్పుగది దగ్గరికి వెళ్ళాడు. యినప కమ్మీల్లోంచి లోపలికి చూశాడు.

పేతురు ఎస్సైని గమనించలేదు.

మూత్రభాండంలో లఘుశంక తీర్చుకుం దుకు కుండమీద బోర్లించిన మూకుడు తీసి "వాక్..." అని ఉమ్మేస్తూ మూకుడును యధాస్థానంలో పెట్టి- ముక్కుతో గాలి విడుస్తూ నిల్చున్నాడు.

లాకప్పు గదిలో అంతకుముందు ఎంత మంది శాపగ్రస్తులు విడిది చేసేరోగానీ, వాళ్ళ మలమూత్రాలతో నిండిఉంది ఆ కుండ!

లేబొరేటరీల్లో వచ్చే అమ్మోనియా ఘాటు వాసన వంటి ఆ గవులు కంపుకు కడుపులో తెమిలి ఇంకా కోలుకోలేదు పేతురు.

ఎస్సై లోకనాథం అంతా గమనించాడు.

తన స్టేషన్లోని లాకప్పు రూమ్‌లో ఒక భాగమైన మూత్రభాండాన్ని పేతురు అవ మానించినట్టే భావించి "తలుపు తెరవండి!" అని గర్జించాడు లోకనాథం.

ఎవరో కానిస్టేబులు తాళం తీశాడు. యినపకమ్మీల తలుపు తెరిచాడు.

ఎస్సై లేడిపిల్లమీదికి పులి దూకినట్టే గది లోకి దూకి లాఠీతో పేతురు వీపుమీద బెయ్యి బెయ్యిన బాత్తూ, "అంత అస హ్యంగా ఉందిరా... మా కుండ? ఖూనీలు చేసే నా కొడక!" అంటూ కోపం చల్లారక మళ్ళీ నాలుగు అంటించి-

"కుండని నెత్తిమీద పెట్టుకో" అని ఆజ్ఞా పించాడు.

పేతురు ఏడుపు లంకించుకున్నాడు. గావుకేకలు పెట్టాడు. లాఠీదెబ్బలు తగిలిన ప్రతిచోటా చేతులతో రుద్దుకుంటూ భయంతో ఒక మూలకు వెళ్ళి వొదిగి నిల్చు న్నాడు.

శాసన ధిక్కారాన్ని అసలు క్షమించని స్ట్రిక్టు ఎస్సై లోకనాథం తన శాసనాన్ని పాటించకుండా మూలకు వెళ్ళి నిల్చున్న పేతుర్ను దగ్గరికి పిల్చి "చెప్పింది వినిపించ లేదురా? " అని అడిగాడు క్రూరంగా చూస్తూ.

"నేను కూనీలు జేసేవోడ్నిగాను పోలీసు దొరా... సెప్పులు గుట్టే పేతుర్ని సెర్చికాడ సింసెట్టుందే..."

"అవ్వన్నీ తరువాత తేలుస్తాగానీ ముందా కుండని నెత్తిమీద పెట్టుకో!" చెప్పాడు లోకనాథం.

పేతురుకు అతను చెప్తోంది అప్పటికి అర్థమైంది. భయం భయంగా లోకనాథం చేతిలో ఉన్న లాఠీ వేపు చూస్తూ వెళ్ళి అమాంతం ఆ మూత్రభాండాన్ని ఎత్తి నెత్తి మీద పెట్టుకున్నాడు.

"అరేయ్! ఇద్దరు వీడి వెంట వెళ్ళండి. దూరంగా తీసుకువెళ్ళి కుండ ఖాళీ చేయించి వాడి చాతనే కడిగించి తీసుకొని రాండి" అని కానిస్టేబుళ్ళను పురమాయించాడు ఎస్సై లోకనాథం.

పోలీసులు కుండనెత్తిన పెట్టుకుని నిల్చున్న పేతుర్ను బైటికి నడిపించారు. దూరంగా తీసికొని వెళ్ళారు. డ్రైనేజీ కాల వలో కుండను ఖాళీ చేయించి బోరు దగ్గర శుభ్రంగా కడిగించారు. మళ్ళీ స్టేషనుకు తెచ్చారు.

"అంతా రెడీ సార్!" చెప్పాడు రైటర్ రామ్మూర్తి ఎస్సైతో.

"కుండ లోపల పెట్టించారా? "



"పెట్టించాం సార్!"

"వాణ్ణి 'రికార్డింగు రూమ్'లోకి తెచ్చారా?" అడిగాడు ఎస్సై.

'రికార్డింగు రూమ్' అంటే వాళ్ళ భాషలో అరుపులు, కేకలు, విలాపాలు, ఆర్తనాదాలూ, మృత్యుఘోష... ఏవీ బైటికి వినిపించని గది అని అర్థం!

అన్ని పోలీసు స్టేషన్లకు మల్లేనే ఆ స్టేషన్లో కూడా అలాంటిగది ఒకటి ఉంది. ఆ గదిలో ఉన్నాడిప్పుడు పేతురు గువ్వలా ఒణికిపోతూ.

'చిత్రహింసల గది' అని కూడా అంటారా గదిని.

★ ★ ★

పోలీసు స్టేషను పదిగజాల దూరం ఉందనగా యోహాను అలా నడుస్తున్నవాడల్లా ఏదో గుర్తొచ్చినట్టే ఆగాడు.

అప్పుడే తన కడుపున పుట్టిన దూడను గంపలో వేసికొని వెళ్తోన్న మనిషి వెనకాలే వెళ్ళే గేదెకుమల్లే అతడి వెనకాలే నడుస్తోన్న మార్తమ్మ కూడా ఆగింది.

"మనిద్దరం అలా కాఫీ హోటలుకు వెళ్ళి ఏమైనా తిని కాఫీ తాగి అప్పుడు వెళ్దాం పోలీసుస్టేషన్ లోపలికి. ఏమంటావ్?" మార్తమ్మను అడిగాడు యోహాను.

ఆమె తల అడ్డంగా తిప్పింది. "ఒటేలుకు రావాల్నంటే నాకు శానా బిడియం" అంది తలవంచుకొని.

"బిడియం ఎందుకూ? పైగా మనం అందర్లో కూర్చోం. ఫ్యామిలీ రూములుంటాయి, అందులో కూర్చుంటాం"

"యాడ కూకున్నా ఒటేలన్నాక అది ఒటేలే! నేన్రాను" అంది.

"నాకు ఆకలిగా ఉంది. పైగా కాఫీ అయినా తాగకుండా మనం స్టేషన్లోకి వెళ్ళామంటే ఎప్పుడు తిరిగి బైటికి వస్తామో చెప్పలేము. అప్పుడు శిక్ష పేతురుకు కాదు, మనకు పడుతుంది" అన్నాడు యోహాను తనకూ హాస్యరసం పండించే నేర్పు ఉన్నట్టు.

మార్తమ్మ నవ్వలేదు.

"ఐతే నువ్వెళ్ళిరా! వొచ్చేదాకా యీడనే కూకుంటాను" అంది మూసి ఉన్న ఓ దుకాణం ముందు అరుగును చూపిస్తూ.

ఆమెకు ఎలా నచ్చచెప్పి హోటలుకు దారి తీయించాలో అతడికి కొంచెంసేపు అర్థం కాలేదు.

"పేతురుకి పోలీసోళ్లు తిండి పెట్టారో లేదో! సామాన్యంగా వాళ్ళు అప్రూవర్లకూ, స్టార్ విట్నెసులకూ తప్ప వాళ్ళ పనిమీద వెళ్ళినా ప్రాసిక్యూటర్లక్కూడా పెట్టించరు. ఆకలికి ఎంతగా అల్లాడుతున్నాడో పాపం!" అన్నాడు చివరికి యోహాను.

అతడు విసిరిన బాణం ధ్యేయానికే తగిలింది.

"నువ్వు ఒటేలుకు యల్తావుగా... ఆయనకి యాఁవైనా పొట్లం యత్తకరా! నువ్వన్నట్టు ఆయనకి తినటానికి పెట్టినారో, లేదో. మడిసి ఆకలి కాగలేడు. బువ్వకి చణం ఆలీశ్యమైతే సిందులేసేవోడు" అన్నది మార్తమ్మ జాలిచూపులు చూస్తూ.

యోహాను మార్తమ్మవేపు అదోలా చూశాడు.

"మార్తమ్మా...! ముందే చెప్పాను. నేను మీ కుటుంబానికి ఏ సహాయం చేసినా అది కేవలం నీమీది అభిమానంతోటే. నీకోసం తెమ్మంటే సద్దాం హుస్సేన్ దగ్గరికెళ్ళి స్కడ్లు కావాలంటే తెచ్చిస్తాను. క్లింటన్ దగ్గరికెళ్ళి స్టార్‌వార్సు అడిగొస్తాను. నవాజ్ షరీఫునడిగి ఇండియాలో పాక్ గూఢచారుల లిస్టు తెచ్చిస్తాను. నీ మొగుడికోసం హోటలుకు వెళ్ళి పార్శిలు తేను. అది నా ప్రిస్టేజి..."

మార్తమ్మకు అతడు చెప్తోంది అర్థంకాక




తేరిపార చూస్తోంది.

"...అందుచాత మార్తమ్మా...! నువ్వా నా వెంట హోటలుకు రా! పెసరట్టో, మినపట్టో వాడికి పట్టుకెళ్ళి తినిపించు. నువ్వు నాతో తిను. అంతేగానీ తనకు మాలిన ధర్మాలూ, తలకు మాసిన పన్లూ చెప్పవాకు" అంటూ ఆమె కదిలి తన వెంట వస్తుందా? రాదా? అన్నట్టు చూశాడు యోహాను.

మార్తమ్మ ఇప్పుడు రానంటూ మొండికి పళ్ళేదు.

మంత్రవశాన మాయల పకీరు వెంట బాలనాగమ్మల్లే అతడి వెంట హోటలుకు వెళ్లింది.

అద్దాల రాజమహల్లా ఉందా హోటలు.

అబ్బురంగా చూస్తూ, అద్దాల్లో తనను తాను చూసుకుంటూ హాల్లో వరుసగా కుర్చీల్లో కూర్చున్న జనాన్ని దాటి అతడి వెంట మరికొంచెం ముందుకు వెళ్ళింది మార్తమ్మ.

ఇద్దరూ ఫ్యామిలీ రూమ్‌లోకి వెళ్ళి కుషన్ కుర్చీల్లో కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

బల్లమీద ఐస్‌వాటర్ గ్లాసులు పెట్టించి "ఏం కావాలి సార్? " అని అడిగాడు.

"నువ్వేం తింటావ్? " మార్తమ్మను అడిగాడు యోహాను.

"నాకేం వొద్దు!"

"అలా అంటే కుదరదు. ఏదో ఒకటి తినాలంతే" అని యోహాను బ్యారర్‌కేసి తిరిగి-

"ఉల్లిపాయలు, అల్లం-మిర్చి వేసి మొత్తం మూడు పెసరట్లు కాల్పించు. ఆయిల్ ఎక్కువుండాలి. రోస్టుగా కాల్చాలి. ఒక అట్టు పార్శిల్. రెండట్లు మాకు" అని చెప్పాడు.

బ్యారర్ వెళ్ళిపోయాడు.

యోహాను మార్తమ్మ వేపు చూశాడు.

మార్తమ్మ ఎక్కడో ఆలోచిస్తూ, మధ్య మధ్యలో నిట్టూరుస్తూ శూన్యంలోకి చూపులు గుచ్చి కూర్చొని ఉంది.

"మార్తమ్మా...!" పిల్చేడు యోహాను.

తలెత్తి చూసింది.

"ఏంటి అలా ఉన్నావ్! పేతుర్ని గురించి నీ కొచ్చిన భయమేంలేదు. కొండంత అండగా నీ పక్కన నేనుండగా ఇంకా నువ్వు ఆ విషయంలో బాధపడితే నన్ను అవమానించినట్టే..."

"ఆయన్ని ఇయ్యాళ వొదుల్తారా? " అడిగింది మార్తమ్మ.

"చూద్దాం ఏం జరుగుతుందో! మనం కొంచెం త్వరగా యిక్కడ పనిముగించుకొని స్టేషనుకు వెళ్ళాలి. ఎస్సైని కలవాలి. అతనేమంటాడో దాన్నిబట్టి ఆలోచిద్దాం"

"ఎట్టాగైనా యియ్యాళ ఆయన్ని బైటికి దేవాల"

"తేవాలంటే అంత కష్టమేం కాదుగానీ అందుకు చాలా కష్టపడాలి"

"ఏంజెయ్యాలి? " అడిగింది మార్తమ్మ.

"ముందుగా ఎస్సైని ఒప్పించాలి. తర్వాత దేవసహాయాన్ని కలిసి కేసు గురించి పట్టుపట్టకుండా వాడ్నీ ఒప్పించాలి. కేసు వద్దన్నందుకు వాడికీ కేసు కట్టనందుకు ఎస్సైకీ, కేసు కట్టినా కట్టకపోయినా ఇదే స్టేషన్లో ఉద్యోగాలు చేస్తున్నారు గనుక కానిస్టేబుళ్ళకీ మామూళ్లియ్యాలి"

"మాకాడ సిల్లిగవ్వలేదు" చెప్పింది మార్తమ్మ.

బేరర్ వచ్చాడు.

సెగలు కక్కుతున్న పెసరట్లను రెండు ప్లేట్లలో పెట్టుకొని విడిగా కప్పుల్లో రెండు రకాల పచ్చళ్లు వేసి తెచ్చి బల్లమీద పెట్టాడు.

"వెళ్ళేప్పుడు కౌంటర్ దగ్గర ఇస్తాను

సార్, మీ పార్శిలు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు నిన్ను డబ్బులెవరు అడిగారంటావ్? అదంతా నేను చూసుకుంటాను. ఎంతైనా సరే! కానీ ఇప్పటిది బాకీ అనీ, ఆ బాకీని ఎలా తీర్చాలా అనీ ఆలోచించి నువ్వు మనసు పాడు చేసుకోవాకు. ఇంతకుముందు జరిగిందానికే బాధపడుతున్నాను"

మార్తమ్మ ప్రశ్నార్థకంగా చూసింది.

"భాగ్యమ్మ అంతా చెప్పిందిలే, నువ్వా రోజు నాకు తిరిగి ఇచ్చింది ముక్కుపుడక్కోసం ముంతలోదాచిన డబ్బుకదూ? " అన్నాడు.

మార్తమ్మ తలదించుకుంది.

ఇద్దరూ టిఫిన్ తినటం పూర్తిచేశారు.

బ్యారర్‌తో చెప్పి కాఫీలు రాగానే తాగేరు.

బిల్లు తెచ్చేందుకు బ్యారర్ బైటికి వెళ్ళి రెండు నిముషాల్లో తిరిగివచ్చాడు. సాసర్లో బిల్లుపెట్టి, బిల్లుమీద సోపుగింజలుచల్లి యోహాను ఎదురుగా బల్లమీద ఉంచాడు.

యోహాను చాలా నిర్లక్ష్యంగా వంద రూపాయల కాయితాన్ని సాసర్లో పెట్టాడు క్రీగంట మార్తమ్మను చూస్తూ.

బేరర్ సాసర్ తీసుకొని వెళ్ళాడు. కొన్ని నోట్లు, కొంత చిల్లర తెచ్చాడు. వస్తూ వస్తూ పార్శిల్ కూడా తనే తెచ్చి ఇచ్చి వినయంగా నిల్చున్నాడు.

చిల్లరంతా సాసర్లోనే విడిచిపెట్టి నోట్లవరకు తీసి జేబులో పెట్టుకుని, "ఇక వెల్దాం పద" అన్నాడు మార్తమ్మతో, అట్టు పార్శిలు తనే పట్టుకొని లేచి నిల్చొంటూ.

"పొట్లం యిటియ్యి" అంది మార్తమ్మ.

యోహాను అదోలా నవ్వేడు. "నువ్వు నాతో కలిసి హోటలుకు రావాలని ఇందాక అలా అన్నాను కానీ పార్శిలు మొయ్యటం అవమానం అని కాదు. నీ కోసం ఈ పార్శిలేం భాగ్యం పర్వతాన్నయినా మోస్తాను" అన్నాడు గదిలోంచి బైటికి వెళుతూ.

మార్తమ్మ కూడా బైటికి నడిచింది.

ఇద్దరూ పోలీసు స్టేషన్లోకి ప్రవేశించారు.

★ ★ ★

'చిత్రహింసగది' లోకి వెళ్ళాడు ఎస్సై లోకనాథం.

అతడ్ని చూడగానే లేచి నిలబడి "పోలీస్ దొరా...నన్నేంజెయ్యకు" అంటూ అమాంతం కాళ్లమీద పడ్డాడు పేతురు.

లోకనాథం లాఠీని రెండు చేతుల మధ్యా అటూ ఇటూ విసరి పట్టుకొంటూ కొంతసేపు కళ్ళార్పకుండా పేతురునే చూస్తూ నిల్చున్నాడు.

అతడి కళ్ళలో ఏదో అన్వేషణ తాలూకు ఆసక్తి తప్ప కోపం లేదు. ద్వేషం లేదు. అహంలేదు. విసుగు, కసి లేదు.

"నిన్నేం చెయ్యనుగానీ లేచి కూర్చోరా!" అన్నాడు చాలా ప్రశాంతంగా.

అది తుపాను ముందు ప్రశాంతత అని తెలియని పేతురు లేచి బండలమీద కూర్చున్నాడు. జాలిగా చూస్తున్నాడు.

"నీ పేరేందిరా? " మళ్ళీ అడిగాడు ఎస్సై లోకనాథం.

"శానాసార్లు సెప్తినిగద దొరా... పేతుర్ని"

"నీలాంటి నేరస్తులు రకరకాల పేర్లతో నేరాలు చేస్తుంటారు. అసలు పేరు బైట పెట్టించటానికే అన్నిసార్లు అడుగుతాం. ఏందిరా నీ పేరు? " అని మళ్ళీ అడిగాడు లోకనాథం.

"పేతురంటారు దొరా..."

"ఏం చేస్తుంటావ్? "

"చెప్పులు కుడుతుంటాను"

"ఎక్కడ్రా..."

"చర్చికాడ"

"రోజూ నీ కోసం ఎవరెవరు వస్తుంటారు? "

"ఉంగటాలు దెగినోళ్లూ, పోలీసోళ్లు"

ఎస్సై లోకనాథం లాఠీని పేతురు గడ్డం కింద పెట్టి అతడి తలను పైకి లేపాడు. కళ్ళలోకి సూటిగా చూస్తూ,

"నా దగ్గర ఏమీ తెలియనట్టు నటించొద్దు. నేను అడిగింది నీ దగ్గరికి నేరస్తులు ఎవరెవరు వస్తుంటారూ అని" అన్నాడు.

పేతురు అయోమయంగా చూశాడు.

"నువ్వేకాదు. నీ తల్లో జేజెమ్మ చేతకూడా నిజం చెప్పిస్తాను. లాఠీకి పనిపెట్టకుండా నువ్వే నిజంచెప్పు. స్టూవర్టుపురం వాళ్ళొస్తారు కదూ? " అడిగాడు ఎస్సై లోకనాథం.

"ఆళ్ళెవురో గూడా నాకు తెలవదు. సత్తె ప్రెమాణకంగా"

"నక్సలైట్లో? "

"స్వామి తోడు నాకు తెలవదు"

ఒక్క క్షణంలోనే లోకనాథం యింటరాగేషన్ స్ట్రాటజీని మనసులో రూపొందించుకొని అప్పుడు మళ్ళీ అడిగాడు.

"దేవసహాయం తలమీద ఎన్ని దెబ్బలు కొట్టావ్? "

"ఒక్కటేదెబ్బ"

"ఒక్క దెబ్బకే తల పగలగొట్టావంటే తాళాలు కూడా నువ్వు పగలగొట్టే ఉంటావ్. నా ఏరియాలో నాలుగు హౌస్ బ్రేకింగు కేసులు జరిగాయి. చెప్పరా... డి.ఎస్.పి. గారింటి తాళం పగలగొట్టి రికవరీ బంగారం దొంగిలించింది నువ్వు కదూ? "

"ప్రెభువు సాచ్చిగా నాకు తెలవదు"

"సి.ఐ.గారు క్యాంపుకెళ్తే ఇంటితాళం పగలగొట్టి ఇంట్లోదూరి నీ నాటుతుపాకి అక్కడపెట్టి వారి సర్వీసు రివాల్వరు ఎత్తకపోయావా? లేదా? "

"నా పిల్లల సాచ్చి సామీ, నాకు తెలవదు. ఐనాగానీ అసుమంటి తుపాకుల్తో నాకేటి పని? అది కూడా గొడ్డు తోలుమీన యాపారం జేసి పెండ్లానికి ముక్కుపుడక కొందావని సూత్తే అంమకూ దేవసాయం గాడు అడ్డం తగిలిండని కోపంతో తాగిన తిక్కలో కొట్టానుగానీ అంతకిమించి నేనేం నేరం సెయ్యలేదు. తమరికాడ అసత్తెం చెప్తానా దొరా...! సత్తే చెప్పను" అన్నాడు పేతురు కరాకండిగా.

"అది సర్లేగానీ సి.ఐ.గారి రివాల్వరు ఎవరికిచ్చావూ? " చాలా అనునయంగా మళ్ళీ అడిగాడు ఎస్సై లోకనాథం.

అంత నిస్సహాయతలో పేతురుకు సహనం చచ్చేపోయింది. పర్యవసానాలను కూడా ఖాతరు చెయ్యనంతగా తెగింపుకు వచ్చి ఉన్మాదిలా పెద్దగా అరిచాడు. "పోలీసు దొరా! నిజ్జంగా తమరన్నట్టు తుపాకి నాకాడుంటే దేవసాయంగాడ్ని నాటుకట్టెతో ఏంటి గ్గొడతానూ...కాల్సి సంపేవోణ్ణి. ఆడినే గాదు దొరా. డబ్బుల కాడ లోబిచ్చి ఆడికీ, నాకూ తకరారు బెట్టిన అంకిరెడ్డి గోర్ని కూడా కాల్సి సంపేవాణ్ణి"

లోకనాథానికి కావలసింది కూడా అతడలా మాట్లాడ్డమే. లాఠీకి లొంగకపోతే అలా విసిగించి విషయం రాబట్టటంలో అతడికి అతడేసాటి.

"దొరికిపోయావురా నా కొడక. పోలీసు స్టేషన్లోనే నువ్విట్టా మాట్లాడేవంటే సామాన్య నేరస్థుడివి కాదు. గుండెలు తీసిన బంటువి" అంటూనే అమాంతం లాఠీ ఎత్తి వరుసగా ఐదారు దెబ్బలు వేసాడు పేతురు వంటిమీద.

అతడు పెద్దగా ఏడుస్తుంటే రికార్డింగు రూమ్‌లోంచి పేతురు కేకలూ, ఏడుపూ బైటికి వినిపించక పోయినా జాగ్రత్తకోసం

టీ.వీ. పెట్టి ఉన్నంతశబ్దం పెంచాడు రైటరు రామ్మూర్తి.

టీవీ శబ్దానికి పోలీసు స్టేషనంతా హోరెత్తి పోతోంది.

సరిగ్గా అప్పుడే లోపలికి వచ్చిన యోహాన్నూ, మార్తమ్మా రైటర్ రామ్మూర్తి దగ్గరికి వచ్చారు.

పరిచయం చేసుకున్నారు.

"ఎస్. ఐ. గారు ఉన్నారా?" అడిగాడు యోహాను.

"వస్తార్లేగానీ ఏంటిపని?" అన్నాడు రామ్మూర్తి.

"ఏదో, తాగిన మైకంలో పేతురు అలా చేశాడు గానీ చాలా మంచివాడతను. అందుకే ఎస్సైగారితో మాట్లాడి ఏదో ఒక దారి చేద్దామని వచ్చాం" చెప్పాడు యోహాను.

అప్పటిదాకా మౌనంగా నిల్చున్న మార్తమ్మ నెమ్మదిగా గొంతువిప్పి రైటరు రామ్మూర్తిని అడిగింది-

"సారూ. మా ఆయనకి బువ్వపెట్టారా?" అని.

రామ్మూర్తి విచిత్రంగా చూస్తూ, "ఆ... ఆ... ఒక్కబువ్వేనా. 'పండ్లరసం' కూడా తాగుతున్నాడు" అని ఫక్కున నవ్వాడు.

బేలగా చూసింది మార్తమ్మ.

"నువ్వు పేతురు భార్యవన్నమాట" మార్తమ్మను అడిగాడు.

"అవును సారూ" అంది మార్తమ్మ.

"మీ ఆయనమీద కేసు తేలిగ్గా రాస్తాం గానీ నువ్వెళ్ళి ఐదు దస్తాల తెల్లకాయితాలూ, బాల్ పెన్నుల ప్యాకెట్టూ పట్టకరా" అని చెప్పాడు రామ్మూర్తి.

మార్తమ్మ యోహానువేపు చూసింది.

ఆమెను మాట్లాడవద్దు అని సైగ చేశాడు యోహాను. రైటరు రామ్మూర్తి నుద్దేశించి,

"ఐదు దస్తాల కాయితాలు సరిపోతాయా? ఆలోచించి చెప్పండి. ఇంకా ఏమైనా కావాలన్నా చెబితే ఒకేసారి అన్నీ తెస్తుంది" అని అతడి సమాధానం కోసం చూశాడు.

రామ్మూర్తి కళ్లలో ఏదో కాంతి చోటు చేసుకుంది. "ఇంకా ఏం కావాలంటే... అదే! ఒకేసారి అన్నీ గుర్తొచ్చి చావవు" అంటూ బల్లమీదున్న పై ఫైల్ను కిందా, కింది ఫైలును పైనా పెట్టాడు. ఫైళ్ల దొంతర పక్కనే ఉన్న పేపరు వెయిట్‌ను చేత్తో గిర గిరా తిప్పుతూ,

"పేతురు కేసుకు ఏమేం కావాలో అన్నీ నేనే తెప్పిస్తాగానీ నాకో వంద రూపాయలివ్వండి. మా లేడీ కానిస్టేబుల్‌తో తెప్పిస్తాను. పాపం... ఆడమనిషి మార్తమ్మను బజారుకు తిప్పటం భావ్యంకాదు" అన్నాడు నొచ్చుకుంటూ.

యోహాను జేబులోంచి వంద రూపాయల కాయితాల బొత్తిని బైటికి తీశాడు. రైటరుకు కనిపించేట్టు ఆ బొత్తిలోంచి రెండు కాయితాలు లాగి రైటరు చేతిలో పెడుతూ,

"ఎందుకైనా మంచిది యీ రెండొందలూ ఉంచండి" అన్నాడు నవ్వుతూ.

రామ్మూర్తి కళ్లు తళతళా మెరిసాయి.

డబ్బు అందుకొని జేబులో పెట్టుకుంటూ "నిలబడే ఉన్నారేం. కూర్చోండి" అని రైటరు బల్లకు ఎదురుగా ఉన్న కుర్చీలు చూపించాడు.

యోహాను డబ్బుల కట్టను జేబులో పెట్టుకొని రైటరు చూపించిన కుర్చీలో కూర్చున్నాడు. పక్కనే ఉన్న మరో కుర్చీలో కూర్చోమని మార్తమ్మకు సైగ చేశాడు.

మార్తమ్మ కూర్చోలేదు. అలా నిలబడే ఎంతో దీనంగా యోహాను దగ్గరున్న పార్శిలువేపు చూసింది.

ఆమె ఉద్దేశాన్ని గ్రహించాడు యోహాను.




"పేతురు ఎక్కడున్నాడు? " అని రైటర్ను అడిగాడు.

"లోపలున్నాడు. ఎస్సైగార్తో మాట్లాడుత్తున్నాడు" చెప్పాడు రైటరు.

యోహాను పేతురుకోసం తెచ్చిన పార్శిల్ను రైటరుకు చూపిస్తూ "ఇది పేతురుకోసం తెచ్చాం. దయచేసి అతనికివ్వండి" అన్నాడు.

"ఏమిటది? "

"మూడుముక్కల పెసరట్టు"

రామ్మూర్తి పార్శిలువేపు అనుమానంగా చూశాడు. "సెల్ లో ఉన్న నేరస్తులకు యిలాంటివి యివ్వకూడదు. ఐనా మీరు అడిగారు కాబట్టి ఒప్పుకుంటున్నాను" అని యోహాను చేతిలోంచి పార్శిలు అందుకున్నాడు. చేత్తో తడిమి, ముక్కుదగ్గర పెట్టుకుని వాసన పీల్చాడు.

పార్శిలింకా వేడిగా ఉంది.

అట్టు వాసన ఘుమఘుమలాడింది.

సరిగ్గా అప్పుడే కానిస్టేబులు హనుమంతు లోపలికి వచ్చాడు.

పేతుర్ను పోలీసులు పట్టుకున్న విషయం ఇంటికి వచ్చి చెప్పింది అతనే! ఆ పరిచయంతో అతడ్ని చూడగానే దిగులుగా నవ్వింది మార్తమ్మ.

రైటరు రామ్మూర్తి హనుమంతును దగ్గరికి పిల్చాడు.

అతను వచ్చి పక్కనే నిలబడగానే అట్టు పార్శిలు యిస్తూ, "ఇది పేతురు తింటాడని తెచ్చారు. ఎస్సైగారి గదిలో పెట్టు. వారు రాగానే అనుమతి పొంది అప్పుడు యివ్వు పేతురుకు" అంటూ నర్మగర్భంగా నవ్వాడు.

హనుమంతు పార్శిల్ను పట్టుకొని ఎస్సైగారి చెక్కలగదిలోకి వెళ్ళాడు. రెండు నిమిషాల్లోనే తిరిగి వచ్చాడు.

"అట్టు జాగ్రత్తగా పెట్టావా? " అడిగాడురైటరు.

"హాట్ బాక్స్‌లో పెట్టాను సార్" చెప్పాడు హనుమంతు.

"సరే... యింక నువ్వు బంగారం కొట్టు బంగారయ్యగారింటికి వెళ్లు. వాళ్ళమ్మాయి సంవర్తయిందట. ఫంక్షనుకు వి.ఐ.పి.లు చాలామంది వస్తారట. డి.ఎస్.పి. దొరగారు ఫోన్లో మరీమరీ చెప్పారు. టూ ట్వంటీ ఫోరూ, ఫైవ్‌నాట్ ఎయిటూ, నువ్వూ అక్కడికి బందోబస్తు డ్యూటీకి వెళ్ళండి". అంటూ రైటరు రామ్మూర్తి యోహాను కళ్లలోకి సూటిగా చూస్తూ...

"ఒక వంద వాళ్ళకియ్యండి. బందోబస్తుకువెళ్తున్నారు పాపం. వాళ్ళకీ ఖర్చులుంటాయిగా." అన్నాడు నవ్వుతూ.

యోహాను సంకోచించలేదు. అడిగిన వెంటనే వంద రూపాయల కాయితం తీసి హనుమంతుకిచ్చాడు.

బందోబస్తు పార్టీ వెళ్ళిపోయింది బంగారం కొట్టు బంగారయ్యగారింటికి.

రైటరు రామ్మూర్తి యోహాను వేపు అభిమానంగా చూశాడు. చేత్తో ఫైళ్లను పక్కకు సర్ది తాపీగా కుర్చీలో వెనక్కు వాలేడు. చేతులు పైకెత్తి వొళ్ళు విరుచుకున్నాడు. "మార్తమ్మా నువ్వు నిలబడే ఉన్నావేం? " అని అడిగాడు.

ఆ మాటలకు మార్తమ్మ 'టచ్ మీ నాట్' లా ముడుచుకుని పోయింది. కుర్చీలో కూర్చోకుండానే ఎటో చూస్తూ నిల్చుంది.

ఆమె కళ్ళముందు పేతురు కదలాడసాగాడు.

తనూ యోహానూ పోలీసు స్టేషనుకు వచ్చి చాలా సేపయినా యింతవరకూ పేతురు కనిపించలేదు. ఎస్సైతో మాట్లాడి కేసును యోహాను ఒక దారికి తెచ్చి విడిపించే ప్రయత్నం చేస్తానని హామీ ఇచ్చినా యింకా ఎస్సై కూడా అక్కడికి రాలేదు.

మార్తమ్మకు అంతా అయోమయంగా

ఉంది.

అనుకున్నది అనుకున్నట్టు సవ్యంగా జరిగి పేతురు బైటికి వస్తే అంతేచాలని మనసులోనే నమ్మిన దేవుళ్లకు మొక్కు కుంటూ కదలకుండా నిల్చుంది.

"ఛీ... ఛీ... పోలీసు ఉద్యోగం అంటేనే పరమచిరాకు నాకు. ఏం చేస్తాం. ఆ రోజుల్లో ఉద్యోగం వస్తే అంతేచాలని తొం దరపడి అనాలోచితంగా చేరానీ డిపార్టు మెంట్లో. గౌరవం లేదు. మర్యాదలేదు. గుర్తింపులేదు. అదనంగా ఒక్కపైసా ఆదాయం లేదు" అంటూ రైటరు రామ్మూర్తి తన గోడు వెళ్ళబోసుకోవటం ప్రారంభిం చాడు.

యోహాను కిసుక్కున నవ్వాడు.

రైటరు రామ్మూర్తి చెప్పిందాంట్లో మిగతా విషయాల నిజానిజాలు ఎలా ఉన్నా 'అద నంగా ఒక్కపైసా ఆదాయంలేదు' అన్నది మాత్రం అచ్చమైన అబద్ధం!

'ఇంతకుముందే నా దగ్గర రెండొందలు నొక్కి నన్నే మాటలతో బురిడీ కొట్టించాలని చూస్తావా?' అన్నట్టు రామ్మూర్తి ముఖం లోకి చూసి నవ్వాడు మళ్ళీ యోహాను.

రామ్మూర్తి అదేమీ పట్టించుకోలేదు.

"మా హెడ్డు కొంచెం తోలుమందం మనిషి. ఎక్కడికి వెళ్తే అక్కడే స్వర్గం అని కుదురుకుపోతాడు. ఈ బందోబస్తు డ్యూటీలు వెయ్యడం, కాయితాలూ, బాల్ పె న్నులూ తెప్పించడం, ఎస్సైగారికి ఫ్లాస్కుల్లో టీ, రెండుగంటలకొకసారి టిఫెనూ తెప్పిం చాలంటే నా తలప్రాణం తోక్కొస్తుంది.

యోహానుగారే కదూ మీ పేరు! చూడండి యోహానుగారూ... యీ మిస్సిలే నియస్సంతా కలిసి నెలనెలా తడిసి మోపె డవుతోంది. అప్పుడప్పుడూ అర్థం చేసుకునే మీలాంటివాళ్లు స్టేషనుకు వచ్చి పదో పరకో యిస్తుంటారు గనుక సరిపోతోంది గానీ, లేకపోతే ఎంత కష్టం" అని "సరే నా బాధ లన్నీ చెప్పి మిమ్మల్ని విసిగించడం దేనికి కానీ పేతుర్ని కేసునుంచి బైటెయ్యాలని కదూ, మీరొచ్చింది?" అని అడిగాడు రామ్మూర్తి.

"ఉద్దేశం అదేగానీ చెయ్యాల్సిందంతా మీరూ మీ ఎస్సైగారూ.... అంతే... మీరంతా ఎలా చెబితే అలా చేసేవాళ్ళం మాత్రమే మేము. ఇక మీ యిష్టం" అన్నాడు యోహాను.

మార్తమ్మ చెవులు రిక్కించి వింటోంది.

"యోహానుగారూ! మా ఎస్సైగారసలే స్ట్రిక్టు మనిషి" అని రైటరు యింకా ఏదో చెప్పబోతోంటే మధ్యలో అడ్డుతగిలి "ఆ విషయం కానిస్టేబులు హనుమంతుగారు చెప్పారుకూడా" అన్నాడు యోహాను.

"ఇంకా ఏమైనా చెప్పాడా?"

"లేదు. ఎస్సైగార్తోనే మాట్లాడుకోమ న్నాడు"

వరండాలోంచి ఎవరో వస్తోన్న అలికి డైంది. సాధువుల కోసం రైల్వేస్టేషనుకు వెళ్లిన హెడ్ కానిస్టేబులు జీవరత్నం ముఖం వేలాడేసుకొని నీరసంగా లోపలికి వచ్చాడు.

టోపీ తీశాడు. చొక్కా బొత్తాలను రెంటిని ఊడదీసి "ఉస్సో" మంటూ ఆపశో పాలు పడుతూ టోపీని రైటరు బల్లకు ఎదు రుగా ఉన్న మరో బల్లమీదికి విసిరి, ఫ్యాన్ కింద నిల్చున్నాడు.

"పోయినపని అయిందా?" హెడ్డును అడిగాడు రామ్మూర్తి.

అతను రామ్మూర్తికి సమాధానం చెప్ప కుండా సూదికళ్ళతో యోహాన్నూ, మార్త మ్మనూ చూస్తూ "ఎవరు వీళ్ళంతా?" అని అడిగాడు.

"పేతురుకోసం వచ్చారు. గట్టిపార్టీనే" అన్నాడు రామ్మూర్తి కొంచెం గొంతు తగ్గిస్తూ.




"ఐతే మాత్రం ఎవరు బడితే వాళ్లు లోపలికి రావటానికిదేం చేపల మార్కెట్టా... పోలీసుస్టేషనా? " అంటూ హెడ్డు బల్లమీదున్న లాఠీని చేత్తో తీసుకొని గట్టిగా బల్ల మీదే చరిచి "బైటికి పోండి. వాడ్ని రేపు కోర్టుకు పెడతాం. వ్యవహారం అక్కడ చూసుకోండి" అని అరిచాడు పెద్దగా.

మార్తమ్మ వజవజా వొణికిపోయింది.

యోహాను నొసలు చిట్లించి చూస్తున్నాడు.

రైటరు రామ్మూర్తి అమాంతం కుర్చీలోంచి లేచి, తనతో రమ్మని యోహానుకు సైగ చేశాడు.

యోహాను లేచాడు. అతని వెంట వెళ్ళాడు.

ఇద్దరూ ఎస్సైగారి చెక్కలగది పక్కన నిల్చున్నారు.

"హెడ్డుగారలా ఎందుకని చిర్రుబుర్రులాడ్తున్నారు? " కొంచెం కోపంగానే అడిగాడు యోహాను.

"సరే... అతన్దేముందిలే వట్టి ఎర్రిబాగులోడు. మాటతీరు అంతేగానీ మనిషి చాలా మంచోడు..."

"అయితే మాత్రం అలాగా మాట్లాడేది? "

"అతని మాటలను పట్టించుకోవద్దన్నానుగా...! కుడుమిస్తే పండగా, యియ్యకపోతే ఎండగా అనేరకం. ఏం చేస్తాం. పని మనది. వాడి ముఖాన ఓ రెండొందలు కొట్టావంటే తెల్లగంజేరు వాసన చూసిన పాములానే తల దించుతాడు. ఇయ్యలేదనుకో. ఎస్సైగారికి ఏదో చెప్పి పని చెడగొడ్తాడు. మనిషి మంచోడేగానీ యిలా డబ్బుల దగ్గరే బంక! యధవ పనులు చేస్తుంటాడు. మేమందరం అతడ్ని గురించి బాధపడేది అదే! కానీ, తప్పేదేముందీ" అన్నాడు రైటరు రామ్మూర్తి.

యోహాను చర్చనిక పొడిగించలేదు.

జేబులోంచి డబ్బు తీసి యివ్వబోయాడు.

"నాకు వద్దు. హెడ్డును పిల్చి పరిచయం చేస్తాగానీ నువ్వే యివ్వు" అని యోహానుకు చెప్పి అక్కడ్నించే హెడ్డును కేకవేసి పిల్చాడు.

వచ్చాడు హెడ్డు.

"ఈన యోహానుగారని చాలా పెద్దమనిషి. మంచివాడు. చాలా సహృదయుడు. రెండొందలు యిస్తారట. ఎస్సైగారికి ఎలాగో నచ్చచెప్పి పేతుర్ని మీరే గట్టెక్కించాలి" అన్నాడు.

యోహాను వేపు సౌమ్యంగా చూస్తూ డబ్బు అందుకున్నాడు హెడ్డు.

వాటిని జేబులోకి తోస్తూ, "నాకూ తెలుసండీ. పేతురు చాలా మంచివాడు" అని బూట్లు టకటకలాడించుకుంటూ తిరిగి లోపలికి వెళ్ళాడు.

అప్పటిదాకా చిత్రహింసల గదిలో పేతుర్ని యింటరాగేట్ చేసి తన పోలీసు స్టేషను ఏరియాలో జరిగిన నేరాలకూ, తీవ్రవాద కార్యకలాపాలకూ కీలకం ఎక్కడో తెలుసుకుందుకు ఎంతో శ్రమపడ్డ ఎస్సై లోకనాథం ఒక కప్పు టీ తాగేందుకు చెక్కలగదికి వచ్చాడు.

హెడ్డు హడావుడిగా లోపలికి వెళ్ళాడు. రైటర్ రామ్మూర్తికూడా ఎస్సైగారి చెక్కల గదిలోకి హెడ్డు వెంటే వెళ్ళాడు.

"సాధువుల్ని తెచ్చావా? " హెడ్డును అడిగాడు ఎస్సై.

అతను సమాధానం చెప్పకముందే ఎస్సై ముందొకగ్లాసు మంచినీళ్ళూ, పింగాణీ ప్లేటూ పెట్టి "మీరసలే అలసిపోయారు. విషయాలు తర్వాత మాట్లాడొచ్చు గానీ ముందు మూడు ముక్కల పెసరట్టు తిని టీ తాగండి" అంటూ హాట్ బాక్సులోంచి తీసి పెసరట్టును ప్లేట్లో పెట్టాడు రైటర్ రామ్మూర్తి.



"టీ తెమ్మంటే అట్టూ తెప్పిచ్చావా?" సుతారంగా అట్టుముక్క తుంచుకొని నోట్లో పెట్టుకుంటూ అడిగాడు ఎస్సై.

"మీకోసం స్పెషల్ అట్టు తెప్పించాను" అన్నాడు రామ్మూర్తి.

"పార్టీ ఎవరు?"

"యోహాను"

ఎస్.ఐ. మౌనంగా అట్టుతినటం ముగించాడు. కప్పు టీ తాగుతూ అప్పుడు అడిగాడు హెడ్డును మళ్ళీ "సాధువులను తెచ్చావా?"

"లే...లేదుసార్!" అంటూ నసిగాడు హెడ్డు.

"ఎందుకు తేలేదు?"

"మన్లాగా సాధువులక్కూడా యిన్ఫార్మర్లు ఉన్నట్టుంది సార్. నేను యిద్దరు కానిస్టేబుళ్లను వెంటపెట్టుకుని అలా స్టేషన్ లోపలికి వెళ్లానో, లేదో అన్నపూర్ణ కావిళ్ళ గంటలు వినిపించాయి. తీరాచూస్తే కొంత మంది సాధువులు కావిళ్ళు భుజాన పెట్టుకొని పరుగు లంకించుకున్నారు. వాళ్ళంతా కూర్చొని రాత్రిళ్ళు గంజాయి తాగి భజనలు చేసే బోరు పంపు దగ్గరిక్కూడా వెళ్ళాం సార్. ఒక్క సాధువూలేడు. వాళ్ళ ఆనవాళ్ళు కూడా కనిపించకుండా గుడ్డల మూటలూ, గంజాయి చిలుములూ చివరికి కొబ్బరి పీచుకూడా వదలకుండా అన్నీ తీసుకొని పారిపోయారు సార్" అని చెప్పి భయంభయంగా ఎస్సై కళ్లల్లోకి చూశాడు హెడ్డు.

ఎస్సైకిక మాట్లాడే అవకాశం యిస్తే హెడ్డును బండబూతులు తిడతాడని ఊహించాడు రైటరు రామ్మూర్తి. హెడ్డును అలా తిట్లు తినకుండా కాపాడేందుకు,

"సార్! పేతురు కోసం పార్టీ వచ్చింది" అని చెప్పాడు ఆ చర్చకు అంతరాయం కలిగిస్తూ.

"వొచ్చిన పార్టీ గట్టిదేనా?" అడిగాడు లోకనాథం.

"వాడి పెళ్లాందేముందిలే గానీ పెద్దమనిషిగా వచ్చిన యోహాను గట్టిపార్టీనే అనిపిస్తోంది"

"ఎలా చెప్పగలవ్?"

రైటర్ రామ్మూర్తి సమాధానం చెప్పలేక నీళ్ళు నమిలాడు.

"యోహానంటే ఎవడో, వాణ్ణి పిలువ్" చెప్పాడు ఎస్సై రైటర్తో.

రైటర్ రామ్మూర్తి బైటికి వెళ్ళాడు.

"గంజాయి కేసు ఎలా చేద్దాం? చివరికి మనకు సాధువులు కూడా చిక్కటంలేదంటే రేపు క్రయిమ్ మీటింగులో ఎస్.పి. దొరగారు బూతులు తిడతారు" అని "పోనీ ఎలాగో దేవసహాయానికి నచ్చచెప్పి వాడి కేసు ఫైల్ చెయ్యకుండా పేతుర్ని గంజాయి కేసులో కోర్టుకు పెడితే?" అడిగాడు ఎస్సై లోకనాథం.

"బాగానే ఉంటుంది" అన్నాడు హెడ్డు.

యోహాన్ను వెంటపెట్టుకుని రైటరు రామ్మూర్తి లోపలికి వచ్చాడు.

"నువ్వేనా పేతురుకోసం వచ్చిన యోహానంటే?" అడిగాడు ఎస్సై

"అవును సార్" చెప్పాడు యోహాను.

"పేతురుమీద చాలా కేసులున్నాయి. అది యిప్పుడు తేలే విషయంకాదు. మీరు రేపురండి మాట్లాడ్దాం" అని, యోహానుకు ఎలాంటి అవకాశం యివ్వకుండా కుర్చీలోంచి లేచి వెళ్ళిపోయాడు ఎస్సై లోకనాథం.

పేతురును చూసేందుకు పోలీసులు అంగీకరించలేదు. ఆ పూటికిక చేసేదేమీ కనిపించలేదు.

మార్తమ్మను వెంటపెట్టుకుని మాదిగ పల్లెకు బయల్దేరాడు యోహాను.





అప్పటికే బాగా చీకటి పడింది.



పోలీసుస్టేషనుకు వెళ్ళిన తన భర్త మార్తమ్మా దీపాలు పెట్టేవేళయినా యింకా ఇంటికి తిరిగి రాకపోయే సరికి పేతురు వ్యవహారం ఎక్కడో తిరుగుడు పడిందని ఊహించింది భాగ్యమ్మ. వాళ్ళకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

వాళ్ళు ఎంతకూ రాలేదు. మార్తమ్మ పిల్లలు ముగ్గురూ ఆకలికి నకనకలాడు తోంటే భాగ్యమ్మకు జాలనిపించింది.

వాళ్ళు వస్తున్నారేమో అని ఒకసారి వీధి చివరివరకూ చూపు సారించింది. వాళ్ళ జాడేలేదు.

దీర్ఘంగా నిట్టూర్చి అరుగుమీంచి కిందికి దిగి ఇంట్లోకి వెళ్ళి నాలుగు డబ్బాల బియ్యం గిన్నెలో పోసి కడిగి పొయ్యిమీద పెట్టింది.

పొద్దున్న వండిన చేపలకూర కొంచెమే ఉంది. దాన్ని భర్తకోసం ఉంచి గబగబా నాలుగు వంకాయలు తరిగి మరో పొయ్యి మీద కూరగిన్నె పెట్టి వంట పనిలో నిమగ్నమైంది.

అరగంటలో అన్నం, కూరా తయారయ్యాయి.

మార్తమ్మ గుడిసెలోకి వెళ్ళి చూసింది భాగ్యమ్మ.

అమ్మాయి, చిన్నవాడూ చాపలమీద పడుకొని అప్పటికే నిద్రపోతున్నారు. ఏలియా మాత్రం మెలకువతో ఉన్నాడు. నులకమంచంమీద కూర్చొని దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నాడు.

భాగ్యమ్మ తడక తలుపు తోసుకొని లోపలికి రాగానే ఆ అలికిడికి తలెత్తి చూశాడు ఏలియా.

"పదరా, ఏలియా! బువ్వదినొచ్చి పండుకుందురు" అని ఏలియాతో చెప్పి, చాపల మీద పడుకున్న ఇద్దర్నీ నిద్రలేపింది భాగ్యమ్మ.

"మా అమ్మయాడికి బోయింది? " భాగ్యమ్మను అడిగాడు ఏలియా.

"మీ అయ్యను ఇంటికి తేనుబోయింది" చెప్పిందామె.

"అయ్యయాడున్నాడంట? " మళ్ళీ అడిగాడు ఏలియా.

జరిగింది పిల్లలకు చెప్పాలా, వద్దా అని ఆలోచించింది భాగ్యమ్మ. చెప్పి వాళ్లను బాధపెట్టేకన్నా చెప్పకపోవటమే మంచిదన్న నిర్ణయానికి వచ్చి,

"పనిమీద బోయినార్లే! మీరు మా ఇంట్లో బువ్వదినండి. బువ్వ దినొచ్చి తొంగోండి. అయ్యా, అమ్మా ఏవరకొత్తారో! పొద్దుబోయింది" అని చిన్నమ్మాయిని భుజానికి ఎత్తుకుంది భాగ్యమ్మ. చిన్నవాడ్ని చెయ్యి పట్టుకొని నడిపించింది.

ఏలియా కూడా వాళ్ళవెంట భాగ్యమ్మ యింటికి వెళ్ళాడు.

ముగ్గురు పిల్లలకు అన్నం పెట్టింది భాగ్యమ్మ. వాళ్ళు అన్నంతిన్న తర్వాత మార్తమ్మ గుడిసెకు తెచ్చి "ఇంక పండుకోండి. అయ్యా, అమ్మా రాంగానే నిదర

లేపుతార్లే" అని, తడక తలుపు బిగించి తిరిగి తన ఇంటికి వెళ్ళింది.

భర్త వచ్చాక అన్నం తిందామని ఎదురు చూస్తూ కూర్చుంది.

కొంచెం సేపటికి యోహాను, మార్తమ్మా వచ్చారు.

"పేతురు ఏడీ? " అడిగింది భాగ్యమ్మ.

మార్తమ్మకు దుఃఖం ఆగలేదు.

భర్తను విడిచిపెట్టకుండా, కనీసం చూడనైనా చూడనివ్వకుండా పోలీసులు "రేపు రాండి" అని చెప్పినప్పుడే మార్తమ్మకు ఏడుపొచ్చింది. అంతమంది పోలీసు పెద్దల ముందు ఏడిస్తే ఏమంటారో అని భయపడి ఏడుపును నిగ్రహించుకుంది.

ఆ తర్వాత ఇంటికి వస్తూంటే దారిలో అదే పరిస్థితి ఎదురైంది. కానీ వీధుల్లో ఏడిస్తే బాగుండదని అక్కడా నిగ్రహించుకుంది.

అందుకే, అలా కడుపులో దాచుకున్న దుఃఖమంతా భాగ్యమ్మను చూడగానే గట్లు తెంచుకొని పొంగి భోరుమని ఏడుస్తూ కింద కూలబడిపోయింది.

"పేతుర్ని యిడ్సిపెట్టలేదా? " భర్తను మళ్ళీ అడిగింది భాగ్యమ్మ.

"రేపు... రేపు రమ్మన్నారు" చెప్పాడు యోహాను.

"యియ్యాళ బాగా లేదంటనా ముహూర్తం! ఆ వరకి టేశనుకెళ్ళి యీవర్దాకా కూకున్నా కనీసం ఆడమడిసి ముకం సూసైనా యిడ్సిపెట్టొచ్చే పేతుర్ని. ఆళ్ళు మడుసులా? పసరాలా? " అంది భాగ్యమ్మ ఆవేశంగా.

యోహాను అదోలా చూశాడు.

పేతుర్ని తీసుకొని రాలేదు కనుక భర్త యిచ్చే వివరణ పూర్తిగా అనవసరం అనుకుందేమో భాగ్యమ్మ. అతడి సమాధానం కోసం చూడకుండా మార్తమ్మ దగ్గరికి వెళ్ళి చేత్తో తలను సవరించింది. వీపుమీద తట్టింది. కళ్ళకు అడ్డం పెట్టుకున్న మార్తమ్మ చేతులను తన చేతులతో పట్టుకొని పక్కకు తొలగించి,

"అన్నింటికీ ఆ ప్రభువే ఉండాడు. మనసు నిమ్మలం చేసుకో" అంది కొంతబాధగానూ, కొంత తాత్వికంగానూ.

యోహాను బట్టలు మార్చుకొని లుంగీ కట్టుకుని వచ్చాడు.

"భాగ్యం! మార్తమ్మ అన్నం తిన్లేదు. పిల్లలకీ వండలేదు. దిగుల్లో ఉన్న మనిషి యిప్పుడు వంట ఏం చేస్తుందిలే అని బలవంతంగా ఆమెను ఇంటికి తెచ్చాను" చెప్పాడు యోహాను భోజనాల విషయం అన్యాపదేశంగా చెబుతూ.

"అంతమాత్రం తెలవదా నాకు! అందరికీ యీడ్నే బువ్వొండాను. పిల్లలు తిని తొంగున్నారు" చెప్పింది భాగ్యమ్మ.

"ఐతే యికనేం. మార్తమ్మా, వెళ్లి కాళ్ళు కడుక్కునిరా. అన్నం తిందువుగాని. ఈ ఒక్కరాత్రి అంతా మర్చేపో. రేపుమధ్యాహ్నం కల్లా నీ మొగుడ్ని నీకు అప్పగించకపోతే నేను యోహానునే కాదు" అన్నాడు యోహాను చాలా దృఢంగా.

భాగ్యమ్మ మార్తమ్మ చెయ్యిపట్టుకొని బలంగా పైకి లేపింది. నీళ్ళ గాబు దగ్గరికి తీసుకొని వెళ్లి చెంబుతో నీళ్ళు ముంచి తనే మార్తమ్మ కాళ్ళమీద పోసింది. మళ్ళీ ఆమెను ఇంట్లోకి తెచ్చి కూర్చోబెట్టింది. ఎదురుగా కంచంపెట్టి అన్నం పెట్టింది. కూర వేసి "ఇక దిను మార్తమ్మా! మా ఆయన అట్టా ప్రెతిగ్నె సేసిండంటే ఇంక నీ మొగుడు వచ్చినట్టే. దిగులు పడగాక. బువ్వదిని పిల్లలకాడికెళ్ళు" అంది.

పిల్లల ప్రస్తావన రాగానే అడిగింది మార్తమ్మ. "పిల్లలు బువ్వదిన్నారా? "

"చెప్తిని గదా! తిని తొంగున్నారు గానీ




నువ్వు తిను" అంది భాగ్యమ్మ.

"అందరం కలిసి తిందాం. మనక్కూడా పెట్టకపోయావా? " అన్నాడు యోహాను భాగ్యమ్మతో.

భాగ్యమ్మ ఆ విషయం ముందుగానే ఆలోచించింది. చేపలకూర తక్కువగా ఉంది. అందరూ ఒకేసారి అన్నానికి కూర్చుంటే మార్తమ్మకు వెయ్యకుండా కూరంతా భర్తకు వెయ్యటం భావ్యంకాదు.

అందుకే అన్నది భాగ్యమ్మ-

"మార్తమ్మ తొందరగా బువ్వదిని పిల్లల కాడికి ఎళ్లాలగానీ నీకేటి తొందర? "

యోహాను మౌనంగా వెళ్లి మంచంమీద వాలిపోయాడు.

మార్తమ్మ మనసంతా భర్తమీదే ఉంది. అన్నం తినేందుకు కూడా మనస్కరించడం లేదు. యోహాను, భాగ్యమ్మల బలవంతం మీద కంచం ముందు కూర్చుందే గానీ ఒక్క ముద్దకూడా సహించటంలేదు.

"మార్తమ్మా. గాచారం బాగోలేక ఏందో అయిందిగానీ యింక యిసుచంటియి గాకుండా, సూసుకోండి. పేతురు రాంగానే సెప్పు- గాలి సచ్చినోళ్ళతో గలిసి తాగొద్దని. తాగిన తిక్కలో తగువులకు బోవొద్దని. అసువంటోళ్ళ సావంసం నీ మొగుడికింక అనవొసరం. సక్కంగా శాకిరి జేస్కోని యాళకింత బువ్వదింటా సలచ్చనంగా ఉండొచ్చు కాత్తో కూత్తో దాపెడుతుంటే సాలు! అయి బెట్టి ఎండో బంగారవో గొనొచ్చు" అని.

"మార్తమ్మా అన్నట్టు నీకు ముక్కుపుడక గాలాల్నని మనసులో ఉండాది గదూ? " అని అడిగింది.

మార్తమ్మ మౌనంగా చెయ్యి కడుక్కుంది. తిన్న కంచం ఎత్తబోతే వారించి తనే ఎత్తి పక్కన పెట్టింది భాగ్యమ్మ.

మార్తమ్మ చెయ్యి తుడుచుకుంటూ "యల్తానే అప్పా" అని భాగ్యమ్మకు చెప్పి వెళ్ళబోతోంటే,

"పొద్దున్నే మనిద్దరం స్టేషనుకు వెళ్లాలి" అని గుర్తుచేశాడు యోహాను.

తెల్లవారింది.

"మార్తమ్మ యింకా నిద్రలేవలేదా? " అంట్ల గిన్నెలు తోమి లోపలికి తెస్తున్న భార్యను అడిగాడు యోహాను.

"నేనూ అదే ఆలోచిత్తన్నాను. యింత ఆలీశంగా ఎప్పుడూ లెగవదు మార్తమ్మ. అసుమంటిది యియ్యాళ ఏట్టైనాదో? " అంది భాగ్యమ్మ, గిన్నెలు సర్దుతూ.

"వెళ్ళి చూడరాదూ! పోలీసు స్టేషనుకు వెళ్ళాలి" చెప్పాడు యోహాను.

భాగ్యమ్మ విచిత్రంగా చూసింది. భర్తను ఏదో అడగబోయిందల్లా ఆగి "సూసొత్తాను" అని వెళ్ళింది.

అప్పటికే పోలీసు స్టేషనుకు వెళ్ళేందుకు తయారయ్యాడతను.

భాగ్యమ్మ కోసం ఎదురుచూస్తూ కూర్చు న్నాడు.

భాగ్యమ్మ వెళ్ళేసరికి మంచంమీద పడు కొని మూలుగుతోంది మార్తమ్మ. ఏలియా ఆమె తలగడన కూర్చొని చేతులను నొసటి మీద పెట్టి ఆమె తల వొత్తుతున్నాడు.

మిగతా యిద్దరు పిల్లలూ యింకా నిద్ర లేవలేదు.

"ఏట్టైందే మార్తమ్మా నీకు? " తట్టిలేపి అడిగింది మార్తమ్మను.

మార్తమ్మ నెమ్మదిగా కళ్లు తెరిచింది. భాగ్యమ్మను చూసింది. ప్రపంచంలోని విషాదాన్నంతా ఒక చిన్న నవ్వుగా మార్చి నీరసంగా నవ్వుతూ "జొరం" అంది.

"లెగవలేవా? " దగ్గరికి వెళ్లి మార్తమ్మ చెయ్యి పట్టుకొని చూసి "అబ్బో పెనవోలె కాల్తంది వొళ్ళు" అని "అరే ఏలియా దుకా

ణానికి వెళ్ళి అమ్మకి జొరం మాత్తర యత్త కరా. నువ్వొచ్చేపాలికి టీ ఎడతాను. మాత్త రేసి టీ తాగిస్తే జొరం తగ్గుద్దిలే" అంది ఏలియాతో.

ఏలియా మంచంమీంచి లేచాడు.

భాగ్యమ్మదే ఆలస్యం అన్నట్టు చూశాడు.

భాగ్యమ్మే వెడుతూ వెడుతూ చెప్పింది మార్తమ్మకు వినిపించేట్టు,

"టేశను కాడికి యళ్ళాలంటగా! ఆయన నీ కోసరమే సూత్తన్నాడు. సర్లే... ఎళ్ళి మాత్తరం ఆడమడిసివి నువ్వేటి సేసేదుంది గానీ ఆయన్నే యళ్ళవని సెప్తాను. నువ్వు లెగిసి మొగం కడుక్కో! మాత్తర మింగి తొంగుందువు" అని చెప్పి ఏలియాను వెంట బెట్టుకొని వెళ్ళిపోయింది.

"మార్తమ్మకు జొరం. అస్సులికి లెగవ లేదు. గుబుల్తో రేత్తిరంతా నిదరబోకుండా ఏడ్చినట్టుంది" యోహానుతో చెప్పింది భాగ్యమ్మ యింట్లోకి వెళ్లగానే.

యోహాను ఉత్సాహం అంతా చప్పున చల్లారిపోయింది.

రాత్రి తను మార్తమ్మ కిచ్చిన మాట ప్రకారం యీ రోజు మధ్యాహ్నం కల్లా పేతుర్ను కేసుల్లేకుండా విడుదల చేయించి ఆమెకు అప్పగించాలి. రాత్రంతా అదే ఆలో చించాడు. ఎలా చెయ్యాలో? ఏం చెయ్యాలో? అన్న విషయంలో నిర్ణయానికి కూడా వచ్చాడు.

పోలీసులకు డబ్బులు వెదజల్లాలి. అప్ప టికీ వాళ్ళు దేవసహాయం వంక చూపించి పేచీ పెడితే కులసంఘం నాయకులను రంగంలోకి దించైనా అతడ్ని దారికి తెచ్చి కేసు విషయంలో పట్టుదల పట్టకుండా చూడాలి. అలా చేసినా యింకా వాళ్లు తోక జాడిస్తే అప్పుడు దించాలి రంగంలోకి సీత య్యచౌదర్ని.

అంత శ్రమ తాను ఎందుకు పడుతు న్నట్టూ...?

కేవలం మార్తమ్మకోసం!

మార్తమ్మ తనవెంట ఉండి తన శ్రమనూ, పలుకుబడినీ కళ్ళతో చూసి తన మీద అభిమానం పెంచుకోవాలి. తన సామర్థ్యాన్ని గుర్తించి మెచ్చుకోలుగా ఆరా ధించాలి.

"మార్తమ్మ స్టేషనుకు రాలేదంటావా?" మళ్ళీ అడిగాడు.

"మడిసన్నాక ఒక పాలి సెప్తే అరదం కాదా? దానికి జొరం. మాత్తర తెప్పిస్తా అని ఏలియాగాడ్ని పిల్చుకొచ్చాను. ఐనా ఆడికొచ్చి మార్తమ్మ చేసే నిర్వోకం ఏంటి దంట?" అంది భాగ్యమ్మ కొంచెం చిరాకు గానే.

"ఏందే... నువ్వు మాట్లాడేది? భర్త పోలీసు కష్టడీలో ఉంటే వెళ్లి చూడాలని మార్తమ్మకు ఉండదా. అదే నేను స్టేషన్లో పడితే నువ్వూరుకుంటావా, రాకుండా?" అని సెంటిమెంటును కెలుకుతూ అన్నాడు యోహాను.

భాగ్యమ్మ "హూ... " అంటూ నిట్టూ ర్చింది. "అదీ నిజ్జవేగానీ ఏటి సెయ్యగలం! అంతా గాచారం" అంది బాధగా.

యోహాను వెళ్ళి కాళ్లకు చెప్పులు తొడు క్కున్నాడు. చెప్పులకంటిన మట్టిని విది లిస్తూ నేలమీద రెండుసార్లు చిందులు వేసి,

"గాచారమో గోచారమో ఏద్దైతే ఏంగానీ జరగాల్సింది ఏమిటి?" అని అడిగాడు.

"పేతురు యవ్వారం నువెళ్ళి సూడు. అట్టాగే ఏలియాగాడ్ని యంటబెట్టకెళ్ళి జొరం మాత్తర యిప్పిచ్చి పంపియ్యి" చెప్పింది భాగ్యమ్మ.

"జ్వరం మాత్తరంటే యియ్యడు షాపు వాడు. ఏం జ్వరం? జలుబుతో వచ్చిందా? వేడిమీద వచ్చిందా? అంటూ రకరకాల ప్రశ్నలు వేస్తాడు"

"మరిప్పుడేటి సెయ్యాలా?"





"మార్తమ్మను పలకరించి వివరం తెలుసుకోవాలి? " అంటూ ఏలియా చెయ్యి పట్టుకొని మార్తమ్మ దగ్గరికి వెళ్ళాడు యోహాను.

మార్తమ్మలేచి ముఖం కడుక్కొని టవల్తో తుడుచుకుంటోంది.

"జ్వరం వచ్చిందటగా? " లోపలికి వెళ్లి అడిగేడు యోహాను.

"ఊ..." అందామె పొడిగా. టవల్ని దండెంమీద ఆరేసి "యియ్యాళన్నా ఆయన్ని యిడిసిపెడ్తారా? " అని అడిగింది.

"ఆ పనిమీదే వెళ్తున్నాను. భాగ్యమ్మ చెప్పింది. నీకు జ్వరమని. చూసి వెళ్దామని వచ్చాను. ఇంతకీ జ్వరం ఎందుకొచ్చింది? " అని అడిగేడు.

"తెలవదు"

"జలుబు చేసిందా? "

"లేదు"

"ఆకలి బాగానే వేస్తుందా? "

"ఊఁ..."

"అయితే ఏలియాతో అట్టు. కూడా పార్సిలు పంపించమంటావా? "

"వద్దు"

"మాత్రలు పంపిస్తాను, సరేనా? "

మార్తమ్మ చేత్తో నొసలు రాసుకుంది.. "అప్పకీ, నీకూ శానా రుణపడ్తన్నాం. టేశన్లో గూడా శానా కర్సవుతాంది నీకు. ఎట్టా తీర్చాలి అదంతా! సీ... సీ.. ఆయనెందు కట్టా సేసిండో అర్థంగావటంలేదు" అంది నొచ్చుకుంటూ.

"ఛ! భలే దానివే నువ్వు. ముందే చెప్పాను మనలో మనకి బాకీ అన్నది లేదని. ఇదంతా నీకోసం చేస్తున్నదే అయినప్పుడు అది బాకీ కాదుగదా!" అంటూ దండెం దగ్గరికి వెళ్లాడు యోహాను.

మార్తమ్మ ముఖం తుడుచుకొని ఆరేసిన టవల్ను తీసుకొని ముఖం తుడుచుకొని మళ్లీ అక్కడే ఆరేసేడు.

మార్తమ్మ ముఖంమీది నీటి చెమ్మను పీల్చుకున్న ఆ టవలును ముఖానికి అద్దుకుంటేనే చల్లగా హాయిగా తోచిందతనికి.

"వెళ్లొస్తాను. ఇవ్వాళ మాత్రం యీ యోహానంటే ఏమిటో చూపిస్తాను. అన్నమాట ప్రకారం పేతుర్ను తెచ్చి నీకు అప్పగిస్తాను" అన్నాడు.

మార్తమ్మ అభిమానంగా చూసింది. ఆ చూపుల్లో కృతజ్ఞత, ఆశ మిళితమై కనిపించాయి. ప్రవాహంలో కొట్టుకుపోతోంటే కొయ్య దుంగ దొరికినట్టు ఆమె ముఖంలో చిరుదీపం కాంతి మెరిసింది.

ఆమె ముఖంలో మెరిసిన ఆ కాంతి చాలు యోహానుకు! గుండె నిండా గాలి పీల్చి వదిలి "పదరా ఏలియా వెళ్దాం" అంటూ బైటికి నడిచేడు.

వాళ్లిద్దరూ వెళ్లిపోయాక మంచంమీద వాలిపోయింది మార్తమ్మ.

పేతుర్ను పోలీసులు విడిచిపెడతారా? ఒకవేళ విడిచిపెట్టినా యోహాను పెడుతున్న ఖర్చంతా లెఖ్ఖ చూసి అతడి బాకీ తీర్చేది ఎలా? ముక్కుపుడక లేకపోతే మానె, దానికోసం దాచినట్టే ఎన్ని ముంతల చిల్లర దాస్తే బాకీ తీర్తుంది? అన్న రకరకాల ప్రశ్నలు దయ్యపిల్లల్లా మార్తమ్మ మెదడును పొడుచుకొని తినసాగేయి.

★ ★ ★

రక్తం పులిమినట్టు ఎర్రటి కాంతితో రాక్షసుడి కన్నులా రాత్రంతా వెలిగిన ఎర్ర దీపం తెల్లవారగానే పోలీసు స్టేషను మీద రెప్పవాల్చింది.

రోజుటికన్నా ముందుగా చాలా ప్రొద్దున్నే రైటరు రామ్మూర్తి, హెడ్డు జీవరత్నం డ్యూటీకి వచ్చారు.

స్టేషను చాలా హడావుడిగానూ, సందడిగానూ ఉంది. ఆ హడావుడికీ, సందడికీ

కారణం దసరాపండుగ.

ఎస్పీ కార్యాలయం మౌఖిక ఆదేశాల ప్రకారం వాళ్లకు తమ పోలీసు స్టేషను కోటాగా పండుగలోపు రెండు లక్షల రూపాయలు పంపించాలి. స్థానిక అధికారులకూ, మామూలు కానిస్టేబుళ్లకూ ఇతర సిబ్బందికీ కొంత కావాలి.

మొత్తం కలిపి తమ స్టేషను తరఫున ఐదు లక్షలు వసూలు చెయ్యాలని వాళ్లు నిర్ణయించారు.

పండుగ రోజుల్లోకి వస్తోంది.

అందుకే స్టేషన్లో అంత హడావుడీ... సందడీ! హెడ్డూ, రైటరూ కలిసి ఆలోచించారు. హనుమంతును నాయకుడిగా నియమించారు. అతనికి నలుగురు కానిస్టేబుళ్లను కేటాయించారు. తర్జనభర్జనలు పడి చివరికి ఎలాగైతేనేం దానికి దసరా కమిటీ అన్న పేరు స్థిరం చేశారు. ఆ కమిటీవాళ్లు ఊళ్లో ఎవరెవర్ని కలిసి వాళ్లకు దసరా మామూలు ఎంతెంత విధించాలో తేల్చారు.

హనుమంతు తన కమిటీ కానిస్టేబుళ్లను వెంటపెట్టుకొని వెళ్లాలి. రైసు మిల్లర్ల సంఘం, దాల్ మిల్లర్ల సంఘం, ఫ్యాన్సీ అండ్ జనరల్ మర్చెంట్స్ అసోసియేషన్, ఆయిల్ మర్చంట్స్ అసోసియేషన్ ఇత్యాది వ్యాపార సంస్థలవారి సంఘాలకు చెందిన వారినీ మిఠాయిబండ్ల యజమానుల సంఘం, కూరగాయల అమ్మకందారుల సంఘం, రిక్షా ఓనర్ళు సంఘం వాళ్లనూ, సాంఘిక సేవా సంస్థల నాయకులనూ లిస్టు రాశారు. ఎవరెవరికి ఎంత మామూలు విధించారో, ఆ వివరాలు రాసిచ్చారు. దాని ప్రకారం వాళ్లు దసరా మామూళ్లు వసూలు చెయ్యాలని చెప్పారు.

కానిస్టేబులు హనుమంతు కార్యసాధకుడన్న నమ్మకం డిపార్టుమెంట్లో అందరికీ ఉంది. అతను అందరు కానిస్టేబుళ్లలా కేవలం లాఠీమీదా, అధికారం మీదా ఆధారపడడు. చిర్నవ్వూ, లౌక్యంతో కొట్టుకొని వస్తాడు.

నిజానికి కరకుగా వ్యవహరించే కానిస్టేబుళ్లకన్నా సర్వీసులో అతగాడు సాధించిన విజయాలే ఎక్కువ. అందుకు గత సంవత్సరం వాళ్లు వసూలు చేసిన దసరా మామూళ్ల చిట్టాయే సాక్ష్యం.

కానిస్టేబుళ్లను వెంటపెట్టుకొని హనుమంతు వెళ్లిపోయాడు.

హెడ్డుతో చెప్పాడు రైటరు రామ్మూర్తి,

"ఇక మనం చెయ్యాల్సిందేంటంటే రసికవాడలో ఇరవై ఇళ్లున్నాయ్. ఆ ఇరవై ఇళ్లల్లో మొత్తం అరవై చిలకలున్నాయ్. చిలక్కో వెయ్యీ, ఓనరుకో వెయ్యీ వేసినా మనకు నికరంగా వచ్చేది ఎనభైవేలు"

"అవునవును. అంతే" అన్నాడు హెడ్డు తలాడిస్తూ.

అవికాక సింగిల్ నెంబరు లాటరీవాళ్ళూ, పేకాట క్లబ్బులవాళ్ళూ, సారా పొట్లాలవాళ్ళూ, నాటుబాంబుల వ్యాపారస్తులూ, మూడు ముక్కల ఆటేసే వాళ్ళూ, చిల్లర మల్లర దొంగలూ, చెయిన్‌స్నాచర్లూ, అలాంటివాళ్ళందరి దగ్గరికి మన కానిస్టేబులు ఫైవ్ ట్వంటీటూ కమిటీని పంపిద్దాం..."

"కరక్ట్! అలాంటివాళ్ళ దగ్గరికి వాడ్నే పంపించాలి. లాఠీకి తప్ప వాళ్ళు మాట వినరు. మనవాడికి లాఠీతో తప్ప మాట్లాడ్డం రాదు" అన్నాడు హెడ్డు.

వాళ్ళంతా అలా దసరా సంరంభంలో ఉంటే సరిగ్గా అప్పుడే స్టేషనుకు వచ్చాడు యోహాను.

నమస్కారాలూ నవ్వులూ పలకరింపులూ అయ్యాయి.

యోహాన్ను చూసేవరకూ హెడ్డుకు రాత్రి వెడుతూ వెడుతూ ఎస్సైగారు అప్పగించి వెళ్లిన పని జ్ఞాపకం రాలేదు.

గంజాయి కేసులో కోర్టులోనేరం ఒప్పుకొనే విధంగా పేతురుకు నచ్చచెప్పమని




ఆదేశించారాయన.

"యోహానుగారూ! మీ పని అంత త్వరగా తెమిలేది కాదు. పైగా ఎస్సైగారింకా రాలేదు. వారు రాగానే నేను మాట్లాడి వారేమన్నదీ మీకు చెప్తాను. వీలుంటే మీరొక్కసారి సాయంత్రం కనిపించండి" చెప్పాడు హెడ్డు జీవరత్నం యోహానుతో.

యోహాను ముఖంలో రంగులు మారేయి. సహనం కోల్పోయాడు. మార్తమ్మకు యిచ్చినమాట మనసులో ముల్లులా పొడుస్తోంది. పేతుర్ని యివ్వాళ అన్న మాట ప్రకారం విడిపించకపోతే మార్తమ్మకు ముఖం ఎలా చూపించాలో బోధపళ్ళేదు.

"ఇంతకీ మీరేం చెయ్యదల్చుకున్నారో తేల్చి చెప్పండి" అన్నాడు కోపంగా.

హెడ్డూ, రైటరూ ఒకళ్ళముఖం ఒకళ్ళు చూసుకున్నారు.

యోహాను ఎంత మంచిపార్టీ అయినా పోలీసుస్టేషన్లో, అందునా హెడ్డుతో అలా మాట్లాడడం వాళ్ళకు అవమానంగా తోచింది.

"తేల్చి చెప్పకపోతే ఏం చేస్తావ్?" అన్నాడు హెడ్డు చాలా తీక్షణంగా చూస్తూ.

"చేసేవాడు చెప్పడు, చేసి చూపిస్తాడంతే" అన్నాడు యోహాను.

"నీకు చాతనైంది చేసుకో పో" అని హెడ్డు అనగానే యోహాను గిర్రున వెనుదిరిగి విసవిసా నడిచి వెళుతూ,

"అరగంటలో తేలుస్తాను మీ వ్యవహారం" అని హెచ్చరించి మరీ వెళ్ళిపోయాడు.

"వాడితో అనవసరంగా ఎందుకలా గొడవపడ్డావ్? ఒక్క నిముషం నువ్వు ప్రశాంతంగా ఉంటే వాడిచేత దసరా మామూలు బోణీ కొట్టించేవాడ్ని" అన్నాడు హెడ్డుతో రైటరు రామ్మూర్తి.

"విషయం అదికాదులే! పేతుర్ని విడిచిపెట్టే ప్రసక్తేలేదు" అన్నాడు హెడ్డు.

"ఎందుకని? దేవసహాయం రాజీపడనన్నాడా?"

"వాడి ముఖంలే... అదికాదు కానీ పేతుర్ని మరోకేసులో పెట్టాలని చెప్పారు ఎస్సైగారు"

"ఏం కేసు?"

"గంజాయి కేసు"

"సాధువులు దొరక్కపోవటం వీడి చావు కొచ్చిందన్నమాట"

"అంతే"

"పేతురు ఒప్పుకుంటాడా?"

"ఒప్పించాలి"

"రికార్డింగు రూమ్‌లోనా?"

"కాదు. మామూలుగానే" అని హెడ్డు జీవరత్నం లేచి వరండాలోకి వెళ్ళాడు. గేటువేపు చూశాడు.

స్టేషను ముందే శనక్కాయల బుట్టవాడ్ని నిలబెట్టి ఒక్కోకాయ తీసి పగలగొట్టి తింటూ కనిపించాడు కానిస్టేబులు టూ ట్వంటీటూ.

కేకవేసి అతడ్ని పిల్చాడు హెడ్డు.

హెడ్డు పిలుపు విని "ఆ ఇంకెళ్ళి జాగ్రత్తగా బేరం చేసుకో పో" అని బుట్టవాడ్ని తరిమి పంపించి లోపలికి వచ్చాడా కానిస్టేబులు.

"నువ్వెళ్ళి చీపు విస్కీ ఒక క్వార్టరు పట్టుకురా" అని చెప్పాడు హెడ్డు ఆ కానిస్టేబులుతో.

ఇన్‌ఫార్మర్లకూ, స్టార్ విట్నెసులకూ తప్ప స్టేషన్లో మరెవ్వరికీ అలా చీపు మందు అవసరం ఉండదు.

అందుకే "ఎవరికి?" అని అడక్కుండా వెళ్ళిపోయాడతను.

పది నిముషాల్లోనే మందుసీసా

తెచ్చాడు. హెడ్డుకిచ్చాడు.

లాకప్పు తలుపులు తెరుచుకున్నాయి.

ఆ శబ్దానికి గోడకు ఆనుకొని కూర్చున్న పేతురు ఉలిక్కిపడి చూసి, భయంతో ఒణికిపోతూ "నన్ను కొట్టమాకండి దొరలూ... సచ్చి నా తోల్తో తవరికి సెప్పులు గుట్టిత్తాను దొరలూ..." అని పెద్దగా అరిచాడు.

లాకప్పు తలుపులు తెరిచిన హెడ్డు లోపలికి వెళ్ళాడు.

"ఎందుకురా అంత భయపడ్తావ్?" అంటూ అతడికి మరింత దగ్గరగా వెళ్లి చేత్తో అతడి చెయ్యి పట్టుకొని పైకి లేపాడు.

పేతురు తూలి కింద పడబోయాడు. హెడ్డును పట్టుకొని తమాయించుకుని ఆగాడు. పాదాలమీద నిలబడలేక విలవిల్లాడుతుంటే,

"ఏమైందిరా... కాళ్లకు?" అడిగాడు హెడ్డు.

"దొరా... ఎస్సైదొర నా యీపూ, సేతు లేగాదు నా కాళ్ళు కూడా యిడ్సిపెట్టలేను. లాటీతో అరికాళ్ళమీనా కొట్టిండు వొళ్ళంతా గుల్ల జేసిండు. యింక నే నాలుకుల్లోకి బోయేదాకా యీ నెప్పులు తగ్గేట్టు లేవు దొరా... పసరాన్నో, పావునో గొట్టినట్టు కొట్టిండు" అని చెప్పాడు పేతురు.

హెడ్డు అతడి ఒంటిమీది దెబ్బలను పరీక్షగా చూశాడు.

"అరెరే ఎస్సై మనిషా పసువా యింత దారుణంగా కొట్టాడు. ఛీ... ఛీ... యిలాంటివాళ్ళ వల్లనే మా డిపార్ట్‌మెంటును జనం అసహ్యించుకునేది" అని చేత్తో పేతురు భుజంమీద తడుతూ "ఇన్ని గాయాలతో మందులు తినకుండా ఉంటే ధనుర్వాతం వచ్చి చచ్చిపోతావు. వెళ్దాంపద. అంటూ అతడ్ని లాకప్పు గదిలోంచి బైటికి నడిపించాడు. రికార్డు రూమ్‌లోకి తీసుకొని వెళ్ళాడు.

"సారూ... నాకోసం నా భార్య మార్తమ్మ రాలేదా?" అడిగాడు పేతురు.

"నిన్న వచ్చింది"

అతడి కళ్ళు తళుక్కున మెరిసేయి.

"మరి నాకు సూపియ్యలేదేం సారూ?"

"అప్పుడు మా నరరూప రాక్షసుడున్నాడు అందుకని"

"రాచ్చసుడా?"

"వాడే... మా ఎస్సై" అని "నువ్వా కుర్చీలో కూర్చో" అంటూ పేతురుకు ఖాళీ కుర్చీ చూపించాడు హెడ్డు.

పేతురు వళ్ళు జలదరించింది. "నేను తవరిముందు కుర్సీలో కూకుంటనా... కూకోను" అన్నాడు తలను అటూ యిటూ తిప్పుతూ.

బలవంతంగా అతడ్ని కుర్చీలో కూర్చోబెట్టాడు హెడ్డు.

ఎదురుగా ఉన్న స్టూలుమీద తను కూర్చొని "ఇంక నీ జోలికి రావద్దని ఎస్సైకి నేను చెప్పాను కానీ తగిలిన దెబ్బలు తగ్గాలిగా! ఈ మాత్తరవేసుకో" అని సన్నటి రేకు పొట్లం చించి పెయిన్ కిల్లర్ చేతికి యిచ్చాడు.

పేతురు అయోమయంగా చూశాడు.

"నీకోసం అట్టు తెప్పించాను. ముందుగా అది తిని తర్వాత మాత్ర వేసుకో" అంటూ పార్శిలు పొట్లం విప్పి ఘుమఘుమలాడు తోన్న అట్టు చేతికి అందించాడు. మంచి నీళ్ళ గ్లాసుకూడా పెట్టి,

"ఏమిటోగానీ యిలాంటి ఎస్సైలదగ్గర ఉద్యోగం చెయ్యాలంటే మనసు వొప్పదు. కానీ తప్పదు, పొట్ట తిప్పలు కదా! అతను చాలా కోపదారిమనిషి. అందర్నీ యిలాగే కొడుతుంటాడు. స్వభావం అది" అంటూ పేతురు అట్టు తిని మాత్ర వేసుకొనేదాకా అలా అనర్గళంగా మాట్లాడుతూనే ఉన్నాడు.




అట్టు పార్శిలు కాయితం మడిచి దాన్ని ఎక్కడ వెయ్యాలా అని చూస్తుంటే పేతురు చేతిలోంచి కాయితాన్ని లాక్కుని దూరంగా పారేసి వచ్చాడు హెడ్డు.

"తవరు దేవుడసుమంటోళ్ళు" అన్నాడు పేతురు ఆరాధనగా హెడ్డువేపు చూస్తూ.

"మందు తాగుతావు కదూ నువ్వు" అడిగాడు హెడ్డు.

మందుతాగిన నిషాలో దేవసహాయాన్ని కొట్టిన విషయం అతను అడుగుతున్నాడని భావించి తల వొంచుకున్నాడు పేతురు.

క్వార్టరు మందును గ్లాసులో వొంపి చేతికి అందిస్తూ "మరేం ఫర్వాలేదు మందు తాగు. నెప్పులు సర్దుకుంటాయి"

"నాకొద్దుసారూ..."

"తాగాల్సిందే. నువ్వు నా కొడుకులాంటి వాడివి. నెప్పులతో బాధ పడుతుంటే చూడ లేక తెప్పించాను. నా మాట కాదనకు. హెడ్డు చెప్పినా నువ్వు మందు తాగలేదని ఎస్సైకి తెలిసిందంటే ఊరుకోడు. వాడొక మకుర్దున్న"

పేతురు గ్లాసు ఎత్తి గటగటా తాగాడు.

హెడ్డు అమృతాంజనం మూత తెరిచాడు. పేతురు కిచ్చాడు.

"దీన్ని గాయాలమీద పూసుకో" అన్నాడు జాలిగా.

హెడ్డు చూపిస్తున్న ఆదరణ, అభిమానాలకు పేతురుకుదుఃఖం ఆగలేదు.

"పోలీసు దొరా...! వొలుకుల్లో దెయ్యాలు, బూతాలూ, పీనిగెలూ, కాలని కట్టెలూ, బొమికెలూ మాత్తరమే ఉంటయ్యనుకుంటున్న నాకిక్కడ వొలుకుల్లో దేవుడుండాడన్నట్టే తవరు కనిపిచ్చినారు. ఇంక నువ్వే నాకు దేవుడివి. నా పెండ్లాం మార్తమ్మను నాకు సూపియ్యవూ? " అని అడిగాడు అమాంతం లేచి హెడ్డు రెండుచేతులూ పట్టుకుంటూ.

"నీ పెండ్లాం అంటే అంత ప్రేమా నీకు? " అడిగాడు హెడ్డు.

మౌనంతోనే 'అవును' అన్నట్టు చెప్పాడు పేతురు.

"పేదవాడి ప్రేమవల్ల పెళ్ళానికి వొరిగేదేమిటి? "

"తవరన్నదీ నిజ్జివే. పాపం ఆ పిచ్చిముండకి మా లగ్గమైన తొలిరేత్తిరి కాడ్నించీ ముక్కుపుడక తెత్తానని యియ్యాల్టిదాకా తేలేకపోనాను. దాని సిన్న కోరిగ్గూడా తీర్చ లేకపోనాను. అయినాగానీ నా కోసరవే దాని ప్రేణం కొట్టకలాడ్తందంటే యింక సూడు, అదెంత ఎర్రిబాగులముండో" అని శూన్యంలోకి చూస్తూ భార్య రూపాన్ని మనసులోనే ఆవిష్కరించుకొని మౌనం దాల్చాడు పేతురు.

"నిజంగానే నీ భార్యకి ముక్కుపుడక కొనాలని ఉందా? " సూటిగా పేతురు కళ్ళలోకి చూస్తూ అడిగాడు హెడ్డు.

"ప్రెభువు సాచ్చిగా ఉంది సారూ"

"ఐతే నీ భార్యకి ముక్కుపుడక కొనే మార్గం చెప్తాను. నేను చెప్పినట్టు చేస్తావా? "

పేతురు హెడ్డువేపు ఆరాధనగా చూశాడు.

"సారూ యిసువంటి మాటే యంక టేశర్లంటే ఆడెంట బోయి తాగినాను. వాడి దర్మం ప్రకారం వాడేదో సెప్పిండు. ఆడు సెప్పింది నా వల్లగాక ఎళ్ళొచ్చినాను. తవరి యిసయంలో అట్టాగా సెయ్యను. మానం బోకుండా ఉంటే సాలు పేనంబోయే పనైనా సేత్తాను. అది కూడా నా పెండ్లాం ముక్కుపుడక్కోసరం మాత్తరవే కాదు, తవరిమాట కోసరం" అన్నాడు.

హెడ్డుకు అతను దార్లోకి వచ్చాడన్న నమ్మకం కుదిరింది.

"ఐతే నేనేం చెప్పినా చేస్తావుకదూ? "



అడిగాడు మళ్ళీ

"సేస్తాను"

"మాట మార్చవుగా? "

"అది మా వొంశెంలో లేదు"

"అయితే విను, ఈమధ్య మేం కొంచెం గంజాయి పట్టుకున్నాం. అది పత్రికల్లో వచ్చింది. నేరస్తులను విడిచిపెట్టమని ఎం.ఎల్.ఏ. గారు ఒత్తిడి తెచ్చారు. దాంతో మేం గత్యంతరం లేక విడిచిపెట్టాం. వాళ్ళ పేర్లను కూడా బైటికి రానివ్వలేదు మేం"

పేతురు శ్రద్ధగా వింటున్నాడు.

"ఈ మధ్య ఎస్.పి. గారు ఆ కేసు విషయంలో ఒకటే గొడవ చేస్తూ ఎవరో ఒకర్ని ముద్దాయిగా పెట్టి గంజాయిని కోర్టుకు స్వాధీనం చెయ్యమన్నారు. డి.ఎస్.పి. గారూ రోజూ ఫోన్లు చేస్తున్నారు" అని క్షణం ఆగి "నువ్వు దేవసహాయంగాడ్ని చంపబోయావని కదా... నిన్ను పట్టుకుంది. సెక్షన్ 307 ప్రకారం ఆ కేసులో నీకు ఏడు సంవత్సరాల జైలు శిక్ష పడచ్చు కానీ నీకంత శిక్షపడటం మాకు యిష్టం లేదు. దేవసహాయాన్ని ఎలాగో ఒప్పించి నీమీద ఆ కేసు లేకుండా చేస్తాం. అందుకు నువ్వొక పని చెయ్యాల్సి ఉంటుంది"

"ఏంటి సారూ అది? " అడిగాడు పేతురు.

"గంజాయి కేసు నీమీద పెడతాం. కోర్టులో నువ్వు నేరం ఒప్పుకోవాలి"

పేతురు అదిరిపడి చూశాడు.

"అది చాలా చిన్నకేసు. 'గంజాయి అక్రమ రవాణా చేశావా?, అని కోర్టులో అడుగుతారు. 'తప్పయింది, యింకెప్పుడూ చెయ్యను' అనాలి నువ్వు. ప్రథమ తప్పు కింద నీకొక యాభయ్యో, వందో జరిమానా వేసి విడిచిపెడతారు. జరిమానా డబ్బులు మేమే కడతాం. నీ పెళ్ళానికి ముక్కుపుడకా కొనిపెడతాం. ఏమంటావ్" అని పేతురు వేపు చూశాడు హెడ్డు జీవరత్నం.

"సివరికి నన్ను గంజాయి అమ్మేవోణ్ణి సేత్తన్నారా పోలీసు దొరా? అది మానం బోయేపని. ముందుగాల్నే సెప్పానుగదా, అసుమంటియి సెయ్యను. మరేటైనా చెప్పండి. తవరికోసరం చేస్తాను. అంతేగానీ శబ్బరపన్లు నా శాతగాదు" అన్నాడు పేతురు చాలా కరాకండిగా.

హెడ్డుకు కోపం నషాళానికి అంటింది.

కళ్ళు, అంటించిన కొలుములయ్యాయి.

బండెడు అన్నంవేపూ, భక్షించబోయే నరుడివేపూ ఆకలిగా చూసిన బకాసురుడికి మల్లే చూస్తూ పేతురు చేతిలోంచి అమృతాంజనం సీసా లాక్కుని జేబులో వేసుకున్నాడు.

"తాగిన క్వార్టరుమందూ కక్కిస్తా నా కొడకా" అని పక్కనే ఉన్న లాఠీ అందుకొని బెయ్యిబెయ్యిన మొదలుపెట్టాడు.

ఆ దెబ్బలకు ఓర్చుకోలేక పోలీసుస్టేషను దద్దరిల్లేలా ఏడవసాగాడు పేతురు.

సరిగ్గా అప్పుడే రైటరు రామ్మూర్తి హడావుడిగా వచ్చాడు.

"ఎం.పీ. గారు లైన్లో ఉన్నారు. డి.ఎస్.పి. దొరగారికి ఫోన్ చేస్తే క్యాంపులో ఉన్నారట. అందుకోసం యిక్కడికే ఫోన్ చేస్తున్నారట" చెప్పాడు.

హెడ్డు లాఠీని బల్లమీద పెట్టాడు.

"ఎస్సైగారు లేరని చెప్పకపోయావా? " అన్నాడు విసుగ్గా.

"చెప్పాను. ఐతే నిన్ను మాట్లాడమన్నారు"

"ఏంటంట విషయం? "

"చెప్పలేదు"

"ఛీ... ఛీ... ప్రతివాడికీ పోలీసులంటే అలుసైపోయింది. ఎంత అధికారం ఉంటే మాత్రం ఏం ప్రయోజనం? అయినా ఒకళ్లను అనటం దేనికిగానీ మన మంచితనమే





మనల్ని వెధవల్ని చేస్తున్నది" అని ఫోన్ దగ్గరికి వెడుతూ వెడుతూ "మళ్ళీ వొచ్చి నీ భరతం పడతా నా కొడకా" అని వెళ్ళిపోయాడు.

పేతురు రెండుచేతులూ ఎత్తి రైటరుకు దణ్ణంపెడుతూ, "దొరా. తవరన్నా నన్నింక కొట్టద్దని సెప్పండి. ఎస్సైగోరు కొట్టిందానికే యింకా లెగవలేకుండాను. యింక హెడ్డు గారూ గొటితే సచ్చిపోతాను" అని అమాంతం రైటరు రామ్మూర్తి కాళ్ళమీద పడి భోర్న ఏడ్చాడు పేతురు.

రైటరు అతడ్ని లేపి స్టూలుమీద కూర్చోబెట్టాడు.

"హెడ్డుకూడా నిన్ను కొట్టాడా? " అని అడిగాడు.

పేతురు 'అవును' అన్నట్టు తలాడించి యింకా అలా ఏడుస్తోంటే,

"మా హెడ్డు మనిషి మంచోడేగానీ, చేసేవన్నీ యిలాంటిపనులే! ఇలాంటి వాళ్ళవల్ల మా డిపార్టుమెంటు పరువు పోతోంది. గతి లేక ఇలాంటివాళ్ళతో కలిసి పనిచెయ్యటం తప్ప ఇష్టంతో కాదు" అని పేతురు ముఖంలోకి చూస్తూ "అవునూ... హెడ్డు ఎందుకు కొట్టాడు" అడిగాడు.

"సెయ్యని నేరం వొప్పుకోమనిండు. వొప్పుకోనన్నానంతే"

"ఏం నేరం? "

"గంజాయి అమ్మినానంట"

"ఓ... అదా! అదైతే చాలా చిన్నకేసు. హెడ్డు చెప్పినట్టు వింటే నీకే చాలా మంచిది. హత్యాప్రయత్నం కేసులో సంవత్సరాల తరబడి జైల్లో ఉండేకన్నా గంజాయి కేసులో జరిమానా కట్టి బైటపట్టం సులభం"

"ఆ నేరం సెయ్యలేదుగదా సారూ... నేను"

"దేవసహాయాన్ని కొట్టి నేరం చేశావుగా! ఆ కేసులోనే జైలుకు వెళ్తానంటావా? వెళ్లు! ఎవడి కర్మకి ఎవడు బాధ్యుడంటావ్? నీ జీవానపడి భార్యా బిడ్డలూ వీధిన పడతారు. నువ్వు జైల్లో కూర్చుంటే వాళ్ళు ఆకలి చావులు చస్తారు. వాళ్ళనలా చంపాలనుకుంటే అలాగే వెళ్ళు. లేదంటే హెడ్డు మాట విను. ఇదంతా నీ మంచికే చెప్తున్నాంగానీ మా కోసం కాదు" అన్నాడు రైటరు రామ్మూర్తి.

పేతురు ముఖంలో రకరకాల భావాలు కనిపిస్తోన్నాయి.

అతను తీవ్రమైన మానసిక వొత్తిడికి గురౌతూ ఆలోచిస్తున్నట్టు గ్రహించాడు రైటరు.

"నామాట విని ఒప్పేసుకో!" అన్నాడు మళ్ళీ అనునయంగా.

"దేవసహాయంగాడు కేసొదులుకుంటాడంటారా? " కొంచెంసేపు మౌనం తర్వాత అడిగాడు పేతురు.

"వాడా కేసు వొదులుకుంటే యీ కేసు నువ్వొప్పుకుంటావా? "

"ముందుగాల అది తేలాలగా సారూ... లేకపోతే అదీ- ఇదీ కల్సి రొండు కేసులగుతాయి"

"దేవసహాయాన్ని ఒప్పించే పూచీమాది" చెప్పాడు రైటరు.

"గంజాయి కేసులో జుల్మానా తవరే గడ్తారుగా? "

"ఓ... తప్పకుండా"

"మార్తమ్మ ముక్కుపుడక్కి డబ్బులిత్తారుగా? "

"పోలీసోళ్ళ మాటంటే మాటే"

"మా మార్తమ్మ యియ్యాళ వస్తానందా సారూ? "

"రావచ్చు"

"ఐతే దాంతోన ఒక్కమాట సెప్పి ఒప్పే

సుకుంటాను సారూ!" అన్నాడు పేతురు ఒక నిర్ణయానికి వస్తూ.

ఫోన్లో ఎంపీగారితో మాట్లాడి వచ్చాడు హెడ్డు జీవరత్నం.

అతడి కళ్లలో జీవంలేదు. ముఖంలో కాంతి వాడింది. అంతకు ముందుదాకా కని పించిన అధికార దర్పంలేదు.

భవబంధాలూ, తాపత్రయాలూ అన్నీ చంపుకొని ప్రాణాయామం పట్టయినా తనువు చాలిద్దామన్నంత విరక్తిగా ముఖం వేలాడేసుకొని నిల్చున్నాడు.

"గుడ్ న్యూస్" అన్నాడు రైటరు హెడ్డుతో.

"ఏంటది? " విసుగ్గానే అడిగాడు హెడ్డు.

"గంజాయి కేసులో పేతురు నేరం ఒప్పు కుంటాడట"

హెడ్డు విషాదంగా నవ్వేడు. "వాడు ఒప్పుకున్నా అలా గంజాయి కేసు వదిలిం చుకొనే అవకాశం మనకిక లేదు"

"ఏం? ఎందుకని? "

హెడ్డు జేబులోంచి అమృతాంజనం సీసా తీసి మళ్ళీ పేతురుకిచ్చాడు.

"కమిలిన గాయాలకు రాసుకో" అని చెప్పి రైటరు రామ్మూర్తి చెయ్యి పట్టుకొని కొంచెం దూరంగా తీసుకొని వెళ్ళి-

"యోహానుగాడు అన్నంత పనీ చేశాడు" అన్నాడు బెదురుగా చూస్తూ.

"ఏంచేశాడు? "

"ఎం.పీగార్ని కలిసి మనమీద ఫిర్యాదు చేశాడు"

"అందుకేనా ఆయన ఫోన్ చేసింది? "

"అందుకే!"

"యాఁవంటాడూ? "

"యోహాను ఆయన స్వంత మనిషట. అతడు చెప్పింది చెయ్యాలట మనం"

"ఏంచెయ్యాలో గూడా చెప్పాడా? "

"ఆఁ... దేవసహాయంగాడ్ని కూడా మనమే ఒప్పించి కేసు లేకుండా చెయ్యా లట. దేవసహాయంగాడు మాట వినలేదని చెప్పినా, పేతురుమీద ఎలాంటి కేసు పెట్టినా మనందరి తాట తీస్తానన్నాడు"

"అంత మాటన్నాడా? "

"ఆయన అన్నవాటిల్లో చిన్నమాట అదొ క్కటే"

"ఇంకా ఏమన్నాడేంటి? "

"మళ్ళీ మళ్ళీ ఫోన్ చెయ్యనూ... అంతా చక్కదిద్ది పేతుర్ని ఇంటికి పంపించి ఎస్సై గార్ని ఫోన్‌చేసి ఆ విషయం చెప్పమని చెప్పమన్నారు..."

"అలా చెయ్యకపోతే ఏం చేస్తాడట? "

"ఆ మాట అడక్కపోయినా ఆయనే చెప్పాడు, మనందర్నీ వారం తిరిగేలోగా వరంగల్ పంపిస్తానన్నాడు. మందు పాతర్లు పేలి ముక్కలు కావాలన్నాడు"

"ఐతే ఈ విషయం ఫోన్‌చేసి ఎక్కడున్నా ఎస్సైగారికి చెప్పాలి"

ఇద్దరూ ఫోన్ దగ్గరికి పరుగు తీశారు.



"యోహానూ! ఇంక నువ్వు పోలీసు

స్టేషను దగ్గరికి వెళ్లు. నీ ముందే ఫోన్లో మాట్లాడేను విన్నావుకదా. ఇక వాళ్ళ తిప్పలు వాళ్లు పడతారు. ఎస్సై ఎక్కడున్నా వెదికి పట్టుకొని పేతుర్ను వెంటనే విడిచిపెడతారు. ఎందుకైనా మంచిది, నువ్వు స్టేషనుకు వెళ్లు. అతడ్ని దగ్గరుండి విడిపించు" అని చెప్పాడు ఎం.పీ. సీతయ్య చౌదరి యోహానుతో.

యోహానుకు చాలా ఆనందంగా ఉంది.

పేతురు సమస్యను చెప్పగానే ఆయన అలా స్పందించి ఫోన్లో పోలీసులను గట్టిగా హెచ్చరించటంతో సంతోషంతో తబ్బిబ్బయ్యాడు.

మార్తమ్మ దగ్గర తన పరువు పోకుండా కాపాడినందుకు ఎం.పి.వేపు అభిమానం వర్షించే కళ్లతో చూస్తూ దణ్ణం పెట్టాడు. "వెళ్ళొస్తాను సార్" అంటూ లేచి నిల్చున్నాడు.

"ఒక్క క్షణం..." అని సీతయ్యచౌదరి కూడా కుర్చీలోంచి లేచాడు. అతడి భుజం మీద చెయ్యివేసి వాకిటిదాకా నడుస్తూ, "ఐనా నీకు చెప్పేదేముందిలేగానీ చెప్పాల్సిన ధర్మం నాకుంది. తెలుసుకదా, పార్లమెంటుకు మధ్యంతర ఎన్నికలు వొస్తున్నాయి. రామిరెడ్డికీ, మనకూ పోటీ చాలా తీవ్రంగా ఉంటుంది. మీ జాగ్రత్తలో మీరు ఉండాలిక. ఏసోబూ నువ్వూ కలిసి మీ పల్లె ఓట్లే గాదు, పార్లమెంటరీ నియోజకవర్గం అంతా తిరిగి నాకు ఓట్లేయించాలి"

యోహాను వినయంగా తల ఊపాడు.

"నీకు తెలుసుగదా మన పాలసీ ఏమిటో. నన్ను గెలిపించుకోండి. నా చాత పనులు చేయించుకోండి. అదే నా పాలసీ. అది దృష్టిలో పెట్టుకొని పనిచెయ్యండి" అని చెప్పాడు.

"మీరు అంతగా చెప్పాలా సార్! ఈసారి చూడండి మా తడాకా. పల్లె ఓట్లు ఒక్కటి కూడా పోకుండా అన్నీ మీకే వేయించక పోతే నా పేరు యోహానే కాదు" అని గర్వంగా చూశాడు యోహాను.

ఎం.పీగారు చిర్నవ్వు నవ్వి యోహానుకు వీడ్కోలు చెప్పారు.

ఇంట్లోంచి బైటికి వచ్చాడతను.

సంతోషంతో అలా గాలిలో తేలిపోతూ సన్నగా ఈల వేస్తూ కొంత దూరం నడిచి ఏదో గుర్తొచ్చి ఆగేడు.

ఎం.పీగారి ఇంటికి కొంచెం దూరంలో చాపల మార్కెట్టు. ఆ మార్కెట్టు దాటి కొంచెం దూరం వెడితే, కుడిచేతివైపు గొంది లోనే ముత్యాలమ్మ ఇల్లు.

అతడికి ముత్యాలమ్మ గుర్తొచ్చింది!

అంతకుముందయితే ముత్యాలమ్మ కోసమే ముత్యాలమ్మ గుర్తొచ్చేదిగానీ ఇప్పుడతనికి మార్తమ్మ కోసం ముత్యాలమ్మ గుర్తొచ్చింది.

అటువేపుకు నడక సాగించాడు.

చాపల మార్కెట్టు దాటాడు.

కుడిచేతి వేపున్న గొందిలోకి వెళ్ళాడు.

ఒకే కాంపౌండ్లో స్త్రీ జనాభ్యుదయం కోసం గవర్నమెంటు నిధులతో ముత్యాలమ్మ నిర్వహిస్తోన్న సేవాసంస్థలున్నాయి.

ఆ ఆవరణ మెయిన్‌గేటు పక్కనే రెండు గదుల పోర్షనుకు 'వరూధిని స్టే హోం' అన్న బోర్డు వేలాడుతోంది. ఆ స్టే హోంలో విధివంచితులు, భర్తల విశ్వాసఘాతుకానికి గురై దిక్కుతోచక ఒంటరిగా మిగిలిన వాళ్ళూ... అలాంటి కొంతమంది స్త్రీలకు ఉచితంగా భోజనం, వసతి కల్పించి వారికి చేతివృత్తులు నేర్పించే సంస్థ అది.

మరికొంచెం ముందుకు పోగానే వికలాంగుల శరణాలయం, అది దాటగానే కుట్టు పని నేర్పే కేంద్రం... దానిపక్కనే ముత్యాలమ్మ ఇల్లు!

యోహాను ముత్యాలమ్మ ఇంటి తలుపు



కొట్టాడు. కొంచెం సేపటికి ముత్యాలమ్మే తలుపు తీసింది. యోహాన్ను చూసి అందంగా నవ్వింది. సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించింది.

వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ఎయిర్‌కూలర్ ఆన్ చేసి ఫ్రిజ్ లోంచి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది.

"నువ్వు నాకొక్క సహాయం చెయ్యాలి"

"ఏమిటో? " అని ప్రశ్నార్థకంగా చూసింది ముత్యాలమ్మ.

"మా పక్కింటి మార్తమ్మ గుర్తుందా? "

"లేకేం... నేను మీ ఇంటికి వచ్చినప్పుడు చూపించారు. మనిషి చాలా అందగత్తే" అంది నొసలు చిట్లిస్తూ.

"ఆమె విషయమే నీతో మాట్లాడాలని వచ్చాను"

"చెప్పండి"

"ఆమె చాలా కష్టాల్లో ఉంది"

"మా స్టే హోంలో చేర్చుకోమంటారా? "

"వొద్దొద్దు. ఆమెను నేను చాలా ఇష్టపడుతున్నాను"

"అయితే ఏం చెయ్యమంటారు? "

"కుట్టుపని నేర్పితే చాలు. ఎలాగో ఒక మిషన్ కూడా ఇప్పిస్తే ఆమె బతుకు ఆమె బతుకుతుంది"

"ఎందుకో అంత దయ? " అడిగింది ముత్యాలమ్మ.

"చెప్పానుగా. ఆమె అంటే నాకిష్టం అని. కుట్టుపని నేర్పటంతోపాటు ఎలాగైనా నచ్చ చెప్పి ఆమెను నాదారికి తేవాలి నువ్వు"

"నేనా? "

"అలాంటిది సాధించే సమర్థత ఉంది నీకేకదా! నువ్వు అది సాధించితీరాలి. అందుకు బదులుగా నీకు మనం అనుకున్నట్టే త్వరలో చర్మకార సంఘం లోను శాంక్షన్ చేయిస్తాను. ఇది మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ జరిగితీరాలి. చెప్పానుగా, మార్తమ్మంటే అంత ఇష్టం నాకు" అన్నాడు యోహాను దృఢంగా.

"నా ప్రయత్నం నేను చేస్తాను" అంది ముత్యాలమ్మ శూన్యంలోకి చూస్తూ.

"సరే... వెళ్తాను. పోలీసు స్టేషన్‌కి వెళ్ళాలి" అని చెప్పి వెళ్ళిపోయాడతను.

మార్తమ్మ చుట్టూ అల్లుకుంటున్న విషవలయాన్ని ఊహించుకుంటూ అలాగే కూర్చుండిపోయింది ముత్యాలమ్మ.

★ ★ ★

ఏదో వ్యక్తిగతమైన పనిమీద ఎవరికీ పత్తాకూడా దొరక్కుండా రహస్యంగా వెళ్ళిన ఎస్సై లోకనాథం ఇంటికి వచ్చీరాగానే హెడ్డు ఫోను అందింది. పేతురు విషయంలో ఎం.పీ.గారు ఇచ్చిన వార్నింగు హెడ్డు నోటిగుండా వినగానే అతడి నవనాడులూ కృంగిపోయాయి.

తీవ్రంగా ఆలోచించి చివరికి దేవసహాయాన్ని రాజీకి ఎలా ఒప్పించాలా అన్న విషయంలో ఒక నిర్ణయానికి వచ్చాడు. అలా నిర్ణయానికి రాగానే క్షణం ఆలస్యం చెయ్యకుండా మళ్ళీ యూనీఫాం వేసికొని బయల్దేరి వాకిట్లోకి వచ్చాడు.

సరిగ్గా నాలుగు క్వార్టర్ల అవతల కానిస్టేబులు ఎయిట్ నాట్ టూ ఇంటిముందు అన్నపూర్ణ కావిడి భుజంమీద పెట్టుకొని "మాతా... భిక్షం" అని అరుస్తోన్న సాధువుమీద చూపులు గుచ్చేడు.

లోకనాథం మెదడు వేగంగా పనిచేసింది.

గంజాయి కేసులో ముద్దాయిలుగా పెట్టేందుకు సాధువులకోసం హెడ్డు జీవరత్నం రైల్వే స్టేషనుకు వెడితే వాళ్ళంతా పారిపోయిన విషయం గుర్తుకు వచ్చి చిన్నగా నవ్వుకున్నాడు.

వెదకపోయిన తీగ కాలికి చుట్టుకోవటం అంటే అదే!




అవి పోలీసు క్వార్టర్సు అని తెలియక ఆ సాధువు అంత ధైర్యంగా అక్కడికి రావటం, పైగా అన్నపూర్ణ కావిడి కూడా తేవటం.

"అరేయ్... ఆనాకొడుకుని ఇటు పట్టక రాండి" అంటూ పెద్దగా కేక పెట్టాడు ఎస్సై లోకనాథం.

డ్యూటీదిగి ఇంటికి వచ్చి వాకిట్లో చెట్ల పాదులకు నీళ్ళు పోస్తున్న డి.ఎస్.పి. దొర గారి ఆర్డర్లీ ఎస్సై కేక వినగానే నీళ్ళ బకెట్ను కిందికి విసిరేసి ఒక్క పరుగున సుడిగాలిలా వెళ్ళి సాధువును వాటేసుకున్నాడు.

అన్నపూర్ణ కావిడి గంటలు గణగణా మ్రోగాయి.

సాధువును గుంజుకుంటూ లోకనాథం దగ్గరికి తెచ్చి నిలబెట్టాడు.

"ఏరా... నిన్న మా హెడ్డును చూసి పారిపోయావుకదూ? " నొసలు చిట్లించి, సూదికళ్ళతో సాధువును చూస్తూ అడిగాడు ఎస్సై లోకనాథం.

సాధువు గడగడా ఒణికిపోతూ "లేద్సారూ... నిన్న నేనీ ఊళ్ళోనే లేను. నందేల రేలుకు పొద్దుగాల్నే వచ్చాను" అన్నాడు.

లోకనాథం తల ఎగురవేశాడు. "నేరస్తులంతా ఇట్లాగే అంటారు. కళ్ళు చూస్తేనే కనిపెట్టాంరా మేము" అంటూ ఆర్డర్లకీ సైగ చేశాడు.

ఆ సైగల భావం తెలిసిన దొరగారి ఆర్డర్లీ సాధువు భుజంమీంచి అన్నపూర్ణ కావిడ్ని గుంజి కిందపెట్టాడు.

కావిడిలో ఉన్న రెండు ఇత్తడి బిందెల్లో బియ్యం ఉన్నాయి.

"ఒక బిందె బియ్యం మీ ఇంట్లో యివ్వు. ఒక బిందె బియ్యం మా పనిమనిషికి ఇవ్వు. బిందెల్ని మాత్రం బాగా తోమించి మా ఇంట్లో మీ అమ్మగారికివ్వు" అని ఆర్డర్లీని ఆదేశించాడు ఎస్సై లోకనాథం.

భయంతో బిక్కచచ్చిన సాధువును రిక్షా పిలిపించి ఎక్కించారు.

అన్నపూర్ణ కావిడిని ఇంట్లో పెట్టి వచ్చాడు ఆర్డర్లీ.

"నువ్వా రిక్షాలో ఎక్కి వెళ్ళి వీడ్ని స్టేషన్లో హెడ్డుకు అప్పగించిరా. నేను దారిలో గవర్నమెంటు ఆస్పత్రికి వెళ్ళి దేవసహాయంగాడితో మాట్లాడి వస్తానని చెప్పు" అన్నాడు ఎస్సై ఆర్డర్లీతో.

సాధువునూ, అతడి ఆర్తనాదాలనూ మోసుకుంటూ రిక్షా వెళ్ళిపోయింది.

ఎస్సై లోకనాథం ఆనందంగా నవ్వుతూ మోటారు సైకిలు ఎక్కాడు. కిక్కుకొట్టి స్టార్టు చేశాడు. ఐదు నిముషాలలో ఆస్పత్రికి వెళ్ళి దేవసహాయం పడుకున్న మంచం దగ్గర వాలాడు.

దేవసహాయం మంచంమీంచి లేవబోయి "అమ్మా..." అని మూలిగేడు. ఇక లాభం లేదనుకొని పడుకునే ఎస్సైగారికి దణ్ణం పెట్టాడు.

"ఈ దొంగ దణ్ణాలూ... దొంగ వేషాలూ చాలా చూశాన్లేగానీ నిజం చెప్పరా నా కొడక. పేతురును కొట్టావా? లేదా? " అని తీక్షణంగా చూశాడు లోకనాథం.

దేవసహాయం బిత్తరపోయాడు. ఒక్క క్షణం అతడి నోటివెంట మాటలు పెగలిరాలేదు. "నేనా? " అన్నాడు చివరికి ఎంతో ప్రయత్నంమీద మాటలు పెగల్చుకుంటూ.

"నువ్వేరా... నువ్వుగాక నేనా? వాడి వొంటిమీద గాయాలు లేని చోటంటూ లేదు. నువ్వే ముందుగా వాడ్ని కొట్టావట. ఆ తర్వాత వాడు కోపం పట్టలేక నిన్ను కొట్టాడట. దాన్ని కేస్ అండ్ కౌంటర్ అంటారు. ఐ.పి.సి. 307 కింద ఇద్దరిమీదా కేసు బుక్ చేస్తాను. బెయిలు కూడా దొరకదు. అసలే ఎండాకాలం. జైల్లో మగ్గిచ

స్తారు"

"ప్రభువు సాచ్చిగా సారూ... వాడ్ని నేను కొట్టలేదు"

"వాడూ అంతే అన్నాడ్రా... మరి నీ వొంటిమీదా, వాడి ఒంటిమీదా దెబ్బలు ఎలా వచ్చాయంటావ్? "

"నా తలమీద మాత్తరం ఆడు కొట్టిన దెబ్బే సారూ! వాడొంటిమీన దెబ్బల యవ్వారం నాకేటీ తెలవదు" అన్నాడు దేవ సహాయం చాలా దీనంగా.

"అవ్వన్నీ నాకు అనవసరం. వెళ్తే ఇద్దరూ జైలుకు వెళ్ళాలి. లేదంటే ఇద్దరూ రాజీపడాలి. అంతకన్నా మార్గంలేదు"

"తమరే ఎట్టాగోజేసి గట్టెక్కియ్యాల నన్ను. సత్తెంగా ఆడ్ని నేను కొట్టలేదు. జేలుకూ సత్తేనికీ సమ్మందం లేదంటే నామీన దయతోన తమరే మమ్ముల రాజీ పెట్టండి" అని అభ్యర్థించాడు దేవసహాయం.

లోకనాథం అతడితో ఇక మాటలు పొడిగించలేదు.

తెల్లకాయితం ఒకటి అతడికిస్తూ, "నీది సంతకమా? వేలుముద్రా? " అని అడిగాడు.

"సంతకం జేస్తాను సారూ" అన్నాడు దేవసహాయం గర్వంగా.

లోకనాథం అతడిచేత తెల్లకాయితంమీద సంతకం చేయించుకొని మడిచి జేబులో పెట్టుకున్నాడు. వెళ్ళేందుకు సిద్ధమై లేచి నిల్చుంటూ.

"ఏదోలే, కష్టంచేసి బతికే బీదవాళ్ళని జాలిపడి మిమ్మల్ని జైలుకు పంపించకుండా రాజీ చేస్తున్నాను. ఆ విశ్వాసం నీకూ ఉండాలి. ఆస్పత్రినించి విడుదలై రాగానే ఓ ఐదొందలన్నా స్టేషనుకు పంపించు" అని చెప్పి ఠీవిగా నడుస్తూ వెళ్ళిపోయాడు.

పేతురు వొంటిమీద దెబ్బలు ఎవరు కొట్టారా? అని ఆలోచిస్తూ పడుకున్నాడు దేవసహాయం. ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. పేతురు తనను కట్టెతో కొట్టగానే తనుకిందపడిపోయాడు. అంతవరకే అతడికి గుర్తుంది.

ఒకవేళ తనలా పడిపోయింతర్వాత తన మనుషులు పేతుర్ను కొట్టారా? అన్న అనుమానం అప్పుడు కల్గింది.

అంతే అయిఉంటుంది అనుకున్నాడు దేవసహాయం.



పోలీసు స్టేషను ముందు మోటారుసైకిలు ఆగింది. దిగి స్టాండువేసి లోపలికి వస్తూనే 'సాధువును రికార్డింగు రూమ్'లోకి పట్టుకువెళ్ళి గంజాయి కేసు ఒప్పించండి" అని చెప్పాడు హెడ్డుతో.

హెడ్డు లోపలికి వెడుతూంటే ఆపి, "పేతుర్ని నా గదిలోకి పంపించు" అన్నాడు.

హెడ్డు లోపలికి వెళ్ళిన కొంచెంసేపటికి గడగడా ఒణుకుతూ ఎస్సై చెక్కల గదిలోకి వెళ్ళాడు పేతురు.

"దండాలు దొరా..." అన్నాడు కంపిస్తున్న చేతులను జోడిస్తూ.

"రావోయ్ పేతురూ! వచ్చి కూర్చో.." అన్నాడు ఎస్సై నవ్వుతూ.

పేతురు సంభ్రమంగా చూశాడు.

యాంత్రికంగానే ముందుకు వెళ్ళి నిల్చున్నాడు.

"కుర్చీలో కూర్చో"

పేతురు సంశయిస్తూ అక్కడే నిలబడిపోయాడు.

"కూర్చోమంటే భయపడ్తావేం? "

పేతురు కుర్చీలో కూలబడి చేష్టలుడిగి చూస్తున్నాడు.

"నేను నిన్ను కొట్టినట్టు యోహానుతో




చెప్పావా? " అడిగాడు ఎస్సై.

"లేదు దొరా...! నా భార్యనే సూడ్నియ్య లేదు. నేనింక యోహానుతో యాడ మాట్లా డేను"

"పోనీలే... అది కొంత నయం! చూడు పేతురూ మిమ్మల్ని మేము కొట్టినా, తిట్టినా అంతా మీ మంచికే! నిన్ను నిన్నలా కొట్టానా... రాత్రంతా ఒకటే ఆలోచన, నిన్నెలా కాపాడాలా? అని. పొద్దున్నే లేచి దేవసహాయం దగ్గరికి వెళ్ళాను. నీ కోసం వాడ్ని కాళ్ళూ గడ్డాలూ పట్టుకొని రాజీకి ఒప్పించాను"

పేతురుకు అంతా అయోమయంగా తోస్తోంది.

"అందుకని ఇక నీమీద ఏ కేసూ లేనట్టే. హాయిగా ఇంటికి వెళ్ళొచ్చు" అన్నాడు.

సరిగ్గా అదే సమయంలో యోహాను లోపలికి వచ్చాడు. పేతురుతో మాట్లా డుతూ ఎస్సైగారు కూడా తమ గదిలో ఉన్నారని వాకిట్లోనే చెప్పాడు సెంట్రీ. అందుకే అతను సరాసరి చెక్కల గదిలోకి వచ్చాడు.

"రండి యోహానుగారూ... మీ కోసమే ఎదురు చూస్తున్నాను" అంటూ ఆహ్వానిం చాడు లోకనాథం.

యెహాను వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు.

"బాగున్నావా? " అని అడిగాడు పేతుర్ని.

పేతురు మౌనంగా తలాడించాడు.

"ఎం.పీ. సీతయ్య చౌదరిగారి దగ్గర్నించే వస్తున్నాను. మీరిక పేతుర్ని విడిచిపెడతా రని వారు చెప్పారు. ఒకవేళ విడిచిపెట్టక పోతే వారికి ఫోన్‌చేసి నన్ను చెప్పమ న్నారు. ఏమని ఫోన్ చెయ్యమంటారు? " లోకనాధాన్ని అడిగేడు యోహాను.

లోకనాధం అతడివేపు సౌమ్యంగా చూస్తూ భలేవాడివోయ్ యోహానూ... పేతుర్ని విడిచిపెట్టినట్టే. కాకుంటే పంపించే ముందు కొంచెం టీ అయినా ఇప్పిద్దామని ఇక్కడ కూర్చోపెట్టాను. సమ యానికి నువ్వూ వచ్చావ్. అందరం కలిసి టీ తాగుదాం. తర్వాత నిరభ్యంతరంగా మీవాడ్ని మీ వెంట తీసుకువెళ్ళొచ్చు" అని "అరేయ్ ఎవడ్రా... అక్కడ? " అంటూ కేక వేసి పిల్చాడు.

"ఇప్పుడు మాకు టీ ఎందుకూ... వెళ్తాం" అన్నాడు యోహాను.

"అమ్మో... మీరు టీ తాగకుండా వెళ్తే నన్ను చంపుకుతిన్నట్టే!"

ఇక తప్పదన్నట్టు కూర్చున్నాడు. యోహాను. అతడి మనసంతా ఇంటి దగ్గరే ఉంది. పేతుర్ని వెంటపెట్టుకొని వెళ్ళి మార్తమ్మకు అప్పగించాలి. అప్పుడు ఆమె కళ్లలో పూసే వెలుతురు పువ్వులు చూడాలి.

★ ★ ★

భాగ్యమ్మ, మార్తమ్మ అరుగుమీద కూర్చొని దారులు చూస్తున్నారు.

మార్తమ్మకు జ్వరం తగ్గింది.

మధ్యాహ్నంకల్లా పేతుర్ని తెచ్చి అప్పగి స్తానని యోహాను చెప్పగా ఆశగా ఎదురు చూస్తోంది.

అప్పుడే ఇంటిముందు రిక్షా ఆగింది.

యోహానూ, పేతురూ రిక్షా దిగేరు.

అరుగుమీంచి కిందికి దిగి భర్తకు ఎదు రువెళ్ళింది మార్తమ్మ. భర్త కళ్లలోకి జాలిగా చూసింది.

పేతురు కూడా మార్తమ్మవేపు చూశాడు.

ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

గుండెల్లో పేరుకున్న ఆవేదనంతా చూపు లతోనే తవ్వి చూస్తూ- ఒకరినొకరు ఊర డించుకొంటూ- కళ్లల్లో ఉబుకుతోన్న కన్నీ ళ్లను ఒకరిపొకరు చూడకుండా రహస్యంగా



తుడుచుకుంటూ...

ఆ కళ్ల భాషలో అనంతకోటి భావాలు తుళ్లిపడ్డాయి.

అందరూ లోపలికి వెళ్ళి కూర్చోగానే-

"మార్తమ్మా...! అన్నమాటప్రకారం మీ ఆయన్ని నీకు అప్పగించాను. ఇక మీ కుటుంబం కుదురుకోవాలంటే నువ్వు నేను చెప్పినట్లుగా రోజూ ముత్యాలమ్మ దగ్గరికి వెళ్ళి కుట్టుపని నేర్చుకోవాలి. ఎంత త్వరగా నేర్చుకుంటే అంత త్వరగా కుట్టుమిషను కూడా ఏర్పాటు చేయిస్తాను. ఈ విషయం మీ ఆయనకూ చెప్పాను. ఒప్పుకున్నాడు" అని చెప్పేడు యోహాను.

రాత్రి గడచి తిరిగి తెల్లవారింది.

పేతురు ప్రొద్దున్నే తయారై యధావిధిగా ఖాకీ సంచి భుజాన తగిలించుకొని బయల్దేరి వెళుతూ మార్తమ్మతో చెప్పేడు.

"మార్తమ్మా...! తొందరగా పని కానియ్యి. పిల్లలకి బువ్వెట్టు. ముత్తేలమ్మ యింటికెళ్ళు. మళ్ళా మనం ముంతలో డబ్బులు దాసాల. సావి దయచేత నువ్వు తొందరగా గుడ్డలు కుట్టటం నేర్చినావంటే ముక్కపుడక కొంటం కట్టంగాదు" అని అలవాటుప్రకారం చుట్ట డబ్బులకోసం జేబులు తడుముకున్నాడు.

తాత్వికంగా నవ్వుతూ వెళ్ళిపోయాడు.

గంట తర్వాత యింటిపని, వంటపని ముగించుకొని, పిల్లలకు అన్నాలు పెట్టి ముత్యాలమ్మ యింటికి బయల్దేరి వెళ్ళింది మార్తమ్మ.

గుడిసె వాకిట నిలబడి ఓరకంటితో మార్తమ్మనే గమనిస్తున్నాడు యోహాను. ఆమె వెళ్తోంది ముత్యాలమ్మ యింటికే అని గ్రహించాడు.

మార్తమ్మ యిక తన వశంకావటానికి అట్టే కాలం పట్టదని మనసులోనే ఆమె పొందును ఊహించుకొంటూ ఆనందంలో తేలిపోతోన్నాడు.

తలంటు స్నానంచేసి వచ్చింది భాగ్యమ్మ.

తువ్వాలుతో తల తుడుచుకుంటూ, "నామీన మార్తమ్మకుండ ప్రేవ నీకు లేక పాయ!" అంది.

ఆశ్చర్యంగా చూసేడు యోహాను.

"బువ్వకి లేకపోయినా నాకోసరం పేల మందు తెచ్చింది!" అంది గర్వంగా.

యోహాను హతాశుడయ్యాడు.

★ ★ ★

మాజీ పార్లమెంటు సభ్యుడు రామిరెడ్డి యింట్లో చాలా కాలానికి మళ్ళీ జనసంచారం కనిపిస్తోంది!

అందుకు కారణం పార్లమెంటుకు తిరిగి ఎన్నికలు రావటమే!

అనుకున్నట్టే కేంద్రంలో ప్రభుత్వం పడిపోయింది. ప్రభుత్వాన్ని స్థాపించగల ప్రతిపక్షం కనిపించలేదు. ఎన్నికలు అనివార్యమైనాయి.

ఈ ఎన్నికల్లో రామిరెడ్డి విజయంకోసం వ్యూహ రచన చేస్తూ ప్రముఖులు చాలా మంది రామిరెడ్డి యింట్లో కొలువుతీరారు.

బెంజిమన్, వెంకటేశ్వర్లు హడావుడి అంతా యింతా కాదు!

ఎవరికివారు ఎలా గెలవాలి? ఏం చెయ్యాలి? అన్న విషయంలో తమ అభిప్రాయాలను చెప్తోంటే చాలా సేపటికి రామిరెడ్డి ముందు పెదవి విప్పి చెప్పాడు బెంజిమన్.

"సారూ...! నేనంటే బాగుండదుగానీ అపారమైన జనసంపద కలిగి ఉన్న మనదేశంలో ఇరవైశాతం లోపే వున్న జనానిదే యీ ఎన్నికల పితలాటకం అంతా! మిగతా ఎనభై శాతం జనం ఎవ్వరికీ గుర్తుండరు. ఆ ఇరవై శాతం జనంమీద ఆధారపడకుండా ఎనభైశాతం జనంలోకి వెళ్ళింది కనుకనే

ఇందిరాగాంధీ తిరుగులేని నాయకురా లైంది. మనం ఆ ఎనభైశాతం జనంలోకి వెళ్ళాలి"

"ఎలా వెళ్ళాలో గూడా చెప్పు"

"మనం మాల, మాదిగ పల్లెలకు వెళ్ళాలి. పేదల గుడిసెలే మాకు దేవాలయాలని చెప్పాలి. అనాదిగా మనకు వాళ్ళతో వున్న సంబంధాలను గుర్తుచెయ్యాలి. వాళ్ళ బాధలు తీరుస్తామని హామీ యివ్వాలి. అలా చెప్పి వాళ్ళకింత నమ్మకం కుదిరేలా నటిస్తే చాలు, వాళ్లకా నమ్మకం పోయేదాకా మనదే రాజ్యం!"

"ఎన్నికలని మనం హామీలు యిచ్చి రేపు ఏమీ చెయ్యకపోతే జనం ఎదురు తిర గరూ? "

బెంజిమన్ కిసుక్కున నవ్వేడు!

"మనవాళ్ళు వర్తమానాన్ని పట్టించుకోరు. గతాన్ని తవ్వి తీసి దాని శకలాల పరిశీల నలో భవిష్యత్తును అంచనా వేస్తారు. అందువల్ల వర్తమానంలో మనవల్ల వాళ్ళకు అన్యాయం జరిగినా వాళ్ళు మేల్కొని ఎదు రుతిరిగేది కొన్ని దశాబ్దాల తరువాత మాత్రమే"

"అంటే? "

"మనువు కాలంనాటి వర్ణ విభజనను యీనాడు వ్యతిరేకిస్తున్నాం. ఆనాటి బొంబాయిని ముంబాయిగా, మద్రాసును చెన్నైగా యీనాడు మార్చుకున్నాం. స్వాతంత్ర్యానికి ముందు జరిగిన విమానప్ర మాదంలో సుభాష్‌చంద్రబోస్ చనిపో యింది నిజమా? కాదా? అని ఐదు దశా బ్దాల తరువాత విచారణకు సన్నాహాలు చేస్తున్నాం. డచ్చి ఫ్రెంచి, యీస్టిండియా కంపెనీల పాలనవల్ల మనదేశం అధోగతి పాలైందని అంచనాలు వేస్తున్నాం. అలాగే యిప్పుడు మనం విద్రోహం చేసినా జనం ఉద్యమించేనాటికి కొన్ని తరాలు గడిచిపో తాయి గనుక మనకు ఎలాంటి భయం లేదు"

బెంజిమన్ రాజకీయ పాండిత్యానికి అబ్బురపోయారందరూ.

"సెబ్బాష్!" అన్నాడు రామిరెడ్డి మెచ్చుకో లుగా.

"సారూ... నాదొక్క మనవి!" అన్నాడు అందరినీ తోసుకొని ముందుకు వెళుతూ వెంకటేశ్వర్లు.

"ఏమిటి? " అడిగేడు రామిరెడ్డి.

"మనూరి మాదిగపల్లె చాలా పెద్దది. ఆ పల్లెలో మొత్తం నాలుగొందల గుడిసెలు న్నాయి. నాలుగొందల గుడిసెల్లో పన్నెం డొందల ఓట్లున్నాయి"

"అయితే? "

"ఆ పన్నెండొందల ఓట్లలో పోయిన పార్లమెంటు ఎన్నికల్లో మనపార్టీకి ఒక్క ఓటూ పళ్ళేదు. పల్లె పోలింగు బూతులో మనకి ఏజంటే లేడు"

"విషయం చెప్పు!"

"అలాంటి మాదిగ పల్లెలో మన ఆధిక్య తకోసం నా పథకం ఫలిస్తే ఈసారి పల్లె ఓట్లలో ఎక్కువ శాతం మనవే!" అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వులు చిందిస్తూ.

"నీ పథకం ఫలించాలంటే నేనేంచె య్యాలి? " అడిగేడు రామిరెడ్డి.

"ఆ విషయం మా గురువు బెంజిమనూ, నేనూ చూసుకుంటాంగానీ మీరు నా సొంతానికి ఒక సాయం చెయ్యాలి"

"ఏమిటో? "

"ఢిల్లీలోని మానవవనరుల శాఖలో నాకు కొంచెం పనుంది. అక్కడి అధికారులం దరూ మీరు ఎం.పీగా ఉన్న కాలంవాళ్ళే. వాళ్ళకు మీరంటే చాలా గౌరవం. మీరు రికమండ్ చేస్తే ఎంత పనైనా నిముషాల మీద చేస్తారు. ఈమధ్యనే ఢిల్లీవెళ్ళి వివరా లన్నీ కనుక్కొని వచ్చాను"



"ఇంతకూ ఏమిటి నీ పని? " అడిగేడు రామిరెడ్డి.

చెప్పేందుకు శిష్యుడు కొంచెం సందేహిస్తు న్నాడని గమనించి "మరేంలేదు, మనవాడు అమ్మవారి ఆశ్రమాన్ని అప్పనంగా కొట్టేసి బారు పెట్టాడు. కొంతకాలం మద్యనిషేధం అని, కొంతకాలం నిషేధం లేదనీ... అలా వ్యాపారంలో యిబ్బందులొచ్చి"

"మద్యనిషేధం పెట్టకుండా చూడమం టారా ఏమిటి? "

"అదికాదు విషయం, మనవాడు బారు ఖాళీచేయించి అందులో వృద్ధుల శరణా లయం పెట్టాలట. నిధులకోసం ఢిల్లీ చుట్టూ తిరుగుతున్నాడు" అని తన శిష్యుడి పనేమిటో రామిరెడ్డికి వివరించాడు బెంజి మన్.

రామిరెడ్డి కళ్ళు అరమోడ్పులు చేసి కుర్చీ వెనక్కువాలేడు. కొంచెం సేపు తీవ్రంగా ఆలోచించి మళ్ళీ కళ్ళు విప్పార్చి గోల్డ్‌ఫ్రేం కళ్ళద్దాల్లోంచి చూస్తూ, "ఎలక్షన్లు కాగానే నువ్వు ఢిల్లీ వెళ్ళి పని చేసికొని వచ్చే ఏర్పాటు చేస్తాను. ఈలోగా మీరంతా కలసి మాదిగ, మాల పల్లెల్లో మనకు మెజారిటీ వచ్చే ఏర్పాటు చూడండి" అన్నాడు అభయం యిస్తూ.

వెంకటేశ్వర్లు ముఖం కాంతితో విచ్చు కుంది.

పేతుర్ను పోలీసులు పట్టుకొని వెళ్ళిందీ, అతడ్ని సీతయ్యచౌదరి విడిపించిందీ తెలి యని వెంకటేశ్వర్లు, భార్య ముక్కుపుడక లాంటి స్వల్పమైన ప్రయోజనాల ఆశే పేతుర్ను తప్పకుండా తన దగ్గరికి నడిపి స్తుందన్న విశ్వాసంతోనే ఉన్నాడు. ఆ విశ్వా సంతోనే రామిరెడ్డికి హామీ యిచ్చాడు. రామిరెడ్డి దగ్గర అభయం పొందాడు.

రాజకీయపు ఎత్తుగడల్లో పేతురు ఆశకు తలవంచి 'మాయలేడి' వెంట పరుగుతీ స్తాడో, తనను విడిపించిన సీతయ్యచౌదరి కోసం బెంజిమన్‌తో కలసి ప్రయాణం చేస్తాడో వేచి చూడాలి!

★ ★ ★

రోజులు వేగంగా దొర్లిపోతోన్నాయి. ముత్యాలమ్మ కుట్టుసెంటరుకు క్రమంతప్ప కుండా రోజూ వెళుతూ కుట్టుపనిలో చాలా మెలకువలు నేర్చుకుంది మార్తమ్మ.

కొలతల ప్రకారం జాకెట్టు ముక్కలు, లంగాలూ కత్తిరించి కుట్టటం, చీరలకు ఫాల్సు వెయ్యటం నేర్చుకుంది, కొద్దిరోజు ల్లోనే. ఇంటి దగ్గర ఒక మిషను పెట్టుకొని బట్టలు కుడితే డబ్బులు సంపాదించే స్థాయికి చేరుకుంది.

మార్తమ్మ కుట్టు సెంటర్లో చేరిన దగ్గ ర్నించి యోహాను తరచుగా ముత్యాల మ్మను కలుస్తున్నాడు. ఎలాగైనా నచ్చచెప్పి మార్తమ్మను తనతో పొందుకు ఒప్పుకొనేలా మానసికంగా సిద్ధం చెయ్యమని అడుగు తూనే ఉన్నాడు.

అతడికి అప్పటికి తోచిన ఏదో ఒక సమాధానం చెప్తూ రోజులు గడుపుతోంది ముత్యాలమ్మ.

ఎందుకో ఆ విషయంలో చొరవ చూపిం చాలని ముత్యాలమ్మకు అనిపించటంలేదు. ఇంకా బాల్యం కూడా దాటనట్టుండే మార్తమ్మ అమాయకత్వం, సాంఘిక కట్టు బాట్లపట్ల ఆమె చూపించే గౌరవం అందుకు కారణం కావచ్చు! లేదా మరొక స్త్రీ వ్యామో హంలో పడితే యోహాను తనను విస్మరిస్తా డనీ, అలా జరిగితే అతడితో ముడిపడి ఉన్న ఆర్థిక వ్యవహారాలు దెబ్బతింటాయన్న భయమూ కావచ్చు!

ఏదియేమైనా యింతకాలం మార్తమ్మ దగ్గర యోహాను ప్రసక్తే తీసుకురాలేదు ముత్యాలమ్మ. కానీ, యిక తప్పించుకునే అవకాశం కనిపించటంలేదు!

క్రితం రాత్రి యోహాను ముత్యాలమ్మ దగ్గరికి వచ్చి మార్తమ్మ విషయం గట్టిగా




హెచ్చరించాడు. ఆ కార్యాన్ని నిర్వర్తించక పోతే ముత్యాలమ్మతో తనకున్న సంబంధ బాంధవ్యాలు తెగిపోతాయని కూడా బెదిరించాడు.

ఆరోజు ప్రొద్దున్నే రోజుటికి మల్లే కుట్టు సెంటరుకు వెళ్ళింది మార్తమ్మ.

ఆమె వెళ్ళేసరికి హాల్లో ఒంటరిగా సోఫాలో కూర్చొని చాలా దిగులుగా ఆలోచిస్తోంది ముత్యాలమ్మ.

"ఏంటప్పా... అట్టాగుండావ్? " దగ్గరికి వెళ్ళి అడిగింది మార్తమ్మ ఆమె పక్కనే సోఫాలో కూర్చుంటూ.

ముత్యాలమ్మ ఆలోచనల్లోంచి తేరుకుంది. మార్తమ్మను చూసి అదోలా నవ్వింది. లేచి వెళ్ళి, బీరువాలోంచి కొత్త చీర తెచ్చి మార్తమ్మకిచ్చి "ఇది కట్టుకో. ఈ చీరలో నువ్వెంత అందంగా ఉంటావో చూడాలి" అంది.

"కొత్త సీరె నాకేంటికి? "

"తప్పదు. నాకోసమైనా యిప్పుడే నువ్వీ చీర కట్టుకోవాలి"

కొంచెంసేపు సంశయించి, యిక తప్పదనుకొని ముత్యాలమ్మ చేతిలోంచి చీర అందుకొని లోపలికి వెళ్ళింది మార్తమ్మ. ఐదు నిముషాల్లో కొత్త చీర కట్టుకొని వచ్చి ముత్యాలమ్మ ఎదురుగా నిలబడి, "బాగుందా? " అని అడిగింది.

ముత్యాలమ్మకు ఒక్కక్షణం నోటివెంట మాటలు రాలేదు. కళ్ళప్పగించి మార్తమ్మనే అబ్బురంగా చూస్తూంది!

యోహాను మార్తమ్మకోసం అంతగా ఎందుకు తపించిపోతోన్నాడో యిప్పుడు తెలిసింది ముత్యాలమ్మకు!

ఆ చీరలో మార్తమ్మ అందానికి నిర్వచనంగా తోచింది. తనకూ ఆమెకూ ఉన్న తేడా ఏమిటో కూడా అర్థమైంది! తను రకరకాల రంగుల మేలు కలయికతో పోతపోసిన ప్లాస్టిక్ పువ్వయితే, మార్తమ్మ సహజ సిద్ధంగా చెట్టుకు పూసి- మంచులో తడిసిన అందమైన పుష్పం!

భావోద్వేగం తొలగిపోయాక ఆమెను అక్కున చేర్చుకుంది ముత్యాలమ్మ.

"నీకోసం ఈ చీర ఎవరు తెచ్చారో తెలుసా? " అడిగింది.

"ఎవురూ? "

"యోహాను!"

ఉలిక్కిపడింది మార్తమ్మ!

అంతదాకా అద్భుతం అనిపించిన ఆ చీర వొంటిమీద ఉంటేనే యిప్పుడు తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లనిపించింది!

"ఏమిటలా ఆలోచిస్తున్నావ్? "

మార్తమ్మ సమాధానం చెప్పలేదు.

"యోహాను చీర ఎందుకు తెచ్చాడో తెలుసా? మీ ఆయన్ని పోలీసు స్టేషన్నించి ఎందుకు విడిపించాడో, పోలీసులకు ఐదు వందల రూపాయలదాకా ఎందుకు వెదజల్లాడో, నీ కళ్లలో ఆనందం చూడాలని ఎందుకు తపన పడుతున్నాడో తెలుసా? అంతా నీకోసం, కేవలం నీ పొందుకోసం!" చెప్పింది ముత్యాలమ్మ గుండెలోని అలజడిని అణచుకుంటూ.

సంభ్రమంగా చూసింది మార్తమ్మ. గొంతు పెకలించుకుంది. "ముత్తేలమ్మప్పా...! ప్రెపంచకం నిన్ను ఏటో అంటుంటే బయ్యంగానే నీకాడికొచ్చాను. నన్ను నువ్వు సేర్దీసిన తీరు సూసినాక ప్రెపంచకందే తప్పనుకుండాను. శబ్బరతనం ప్రెపంచకం కాడ్నే ఉందిగానీ, నీకాడ లేదనుకుండాను. అసువంటి నువ్వేనా అప్పా... నాతోన యిట్టా మాట్టాడేది? " అంది జాలిగా.

ఆ మాటలకు ఎవరో రంపంతో పొట్ట కోసి, పేగులను బైటికి లాగి ఎదరగా కుప్ప పోసినట్టే విలవిల్లాడింది ముత్యాలమ్మ.

ఉబికి వస్తోన్న కన్నీళ్ళను ఖాతరు చెయ్యకుండా.

"మార్తమ్మా...!" అని పిల్చింది ఆర్ద్రంగా.

మార్తమ్మ యింకా తేరుకోలేదు.

"... ఆ గదిలో ఖళ్ళుఖళ్ళున దగ్గుతున్నదే, మా అమ్మ! ఆమె పతివ్రతామతల్లికాదు. కులస్త్రీ కూడా కాదు. ఆమె ఒక వేశ్య!"

మార్తమ్మ చివాలున తలెత్తి చూసింది.

"... ఆ వేశ్య కడుపున పుట్టిన నేనూ ఒక వేశ్యనే!"

మార్తమ్మ నిర్ఘాంతపోయింది.

"...నేను ఉంటున్న ఇల్లు, కట్టే బట్టా, తినేతిండీ, అనుభవిస్తున్న విలాసాలూ... చివరికి యీ ఫ్రిజ్జూ, కలర్‌టీవీ, ఫర్నీచరూ అంతా నాకిలా అమిరింది నేను వేశ్యను గనుకనే!

యౌవనంలో అడుగుపెట్టి పరిస్థితులు కాటువెయ్యనంతకాలం నేను వేశ్యను కాను, అమ్మ చాటు పాపాయిని!

"నాకు బాగా జ్ఞాపకం మార్తమ్మా...! చిన్నప్పుడు చంకనెత్తుకొని అమ్మ నాకు చందమామను చూపిస్తూ వెన్నెల్లో అన్నం పెట్టేది. అన్నంలో పాలు పోసి పంచదార కలిపితేనే తింటానని మారాంచేస్తే తన కడుపు కాల్చుకొని నాకన్నీ సమకూర్చేది.

"అసలుకు నేను అమ్మ కడుపున ఎలా పడ్డానో తెలుసా? ఒక వంచకుడి తాళి బొట్టు మెడకు చుట్టుకున్నందువల్ల. నేను కడుపున పడగానే వాడు అమ్మమీద మోజు తీరి దగాచేసి వెళ్ళిపోయాడు.

"అప్పుడు పిండం రూపంలో కడుపులో ఉన్న నేను తప్ప అమ్మకు 'నా' అన్నవాళ్ళెవరూ లేరీ ప్రపంచంలో. అలాగే కడుపున మోసింది. కాన్పునెప్పులుపడి జన్మనిచ్చింది.

"పతివ్రతలైన కుల స్త్రీలకు మాత్రమే కాన్పు నెప్పులుండాలిగానీ మా అమ్మక్కూడా అలాంటి శాపం సృష్టికర్త ఎందుకు యిచ్చాడో!

"అమ్మను క్షోభపెట్టి పుట్టాను. సంఘంలోనే పెరిగాను. అమ్మను వంచించిన వాణ్ణి ఎవ్వరూ పల్లెత్తుమాట అనలేదుగానీ అమ్మను మాత్రం 'పతివ్రతకాదు' అన్నారు.

"మార్తమ్మా...! అప్పుడప్పుడే ఊహ తెలుస్తూ ఆదర్శాల పిచ్చి అంటింది నాకు. ఆ ఆదర్శాల పిచ్చిలో అమ్మనే అర్థంచేసుకోలేకపోయాను. అందరిలా నేనూ ఆమెను శంకించాను. అమ్మ కూడా అందరిలా పతివ్రత అయివుంటే బావుండేది అనుకున్నాను. అలాంటి అవకాశం అమ్మకు కలగాలంటే పుష్కలంగా కాకున్నా అవసరాల మేరకయినా డబ్బుండాలన్న సత్యం ఆలస్యంగా తెలిసింది. ఆ సత్యం నీలా భర్తచాటున ఉండే వాళ్ళకు వర్తించకపోవచ్చు! కానీ అమ్మకు భర్తలేడు. పైగా ఆమె అందమైన ఒంటరిది!

"అమ్మ నన్ను బడికి పంపించేది. హోంవర్కు చేసిన పుస్తకాన్ని చూపించలేదని మా పంతులుగారు స్కేలును గోటుగా పెట్టి చేతివ్రేలి గణుపులమీద ఎంత కసిగా నిర్దాక్షిణ్యంగా రాక్షసంగా కొట్టేవారో! ఆయన తప్పుమాత్రం ఏముందిలే, అలా కొడితే నేను ఆదర్శ పౌరురాలిగా మార్తానని వారి ఆశ!

"పరిస్థితులకు తల వొంచింది అమ్మ. వేశ్యగా మారి విటులకు వొళ్ళమ్ముకుంటూ సంఘం కలలు పండించింది. స్త్రీ మానానికి సరిగా విలువ కట్టని యిక్కడికన్నా అక్కడే శ్రమకు తగిన ఫలితం అందుతుందని అప్పటి బొంబాయి చేరింది. రెడ్‌లైట్ ఏరియాలో కుదురుకుంది.

"ప్రాంతం మారినా నా పట్ల అమ్మ ప్రేమ మారలేదు. విజృంభించి వేశ్యా వృత్తి చేస్తున్నా, ఆమెలోని కరుణ రవ్వంత తగ్గలేదు. అలాంటి వృత్తి చెయ్యని రోజుల్లో





జనం అమ్మ వెంటపడి 'కులట-వేశ్య- బరితెగించిన ఆడది' అంటూ గంగ్రాళ్ళు విసిరేవాళ్ళుకానీ అమ్మ నిజంగానే ఆ వృత్తిలో కుదురుకున్నాక ప్రక్కకు తొలగిపోవటం ప్రారంభించారు. మర్యాదస్తులంతా దూరంనుంచి ఆరాధనగా ఆశగా ఆర్తిగా చూసేవాళ్ళే తప్ప గంగ్రాళ్ళు విసరనూలేదు. ధైర్యంగా పట్టపగలు ఆమెను ఆశించనూలేదు, చీకటి రహస్యాలు తప్ప!

"ఆ పరిణామం అమ్మకు ఎంత శాంతిని ప్రసాదించిందో! అందుకే మా అమ్మకు వేశ్యలంటే తాము కాలుతూ అందరికీ వెలుగునిచ్చే దివిటీలు అన్న సద్భావన!

"బొంబాయి ముంబాయిగా మారినా అమ్మ బతుకులో మార్పేంలేదు. అలా బతుకులు మార్తాయా? మార్పు కావాలని కూడా ఆమె కాంక్షించలేదేమో!

"సీత, సావిత్రి, అనసూయ, అహల్యల్లా 'పతివ్రత' అన్న పేరు రాకుండా చేతులారా చెడగొట్టుకున్నానన్న ఆలోచనే అమ్మకెప్పుడూ కలగలేదు. ఆ బాధ, భ్రమ ఆమెకు లేవు!

"అలాంటి పేరు తెచ్చుకోవాలంటే రాజకుటుంబాల్లో పుట్టాలి. లేదా రాజులనూ శాశించే రుషుల కుటుంబాల్లో పుట్టాలి. అప్పటికే కామాంధులు వెంటబడి కాటువేసే సన్నాహాల్లో ఉంటారు. చెడిపోకుండా ఉండాలంటే రాముడంత ధీశాలి అయిన భర్త ఉండాలి. ఆ భర్తకు అండగా కోతిమూక వంటి బలగం ఉండాలి. అన్నీ వున్నా ఆశించినవాడు రావణబ్రహ్మంత నిజాయితీపరుడై ముట్టకుండా ఉండాలి. లేదా... కపటోపాయంతో ఎవరైనా శీలం చెరిచినా మంత్రజలం చల్లి మళ్ళీ పతివ్రతగా మార్చే పుణ్యపురుషులుండాలి. వాళ్ళు పాదాలతో అయినా తన్ని పుణ్యస్త్రీలుగా మార్చాలి!

"ఎంత కష్టం... ఎంత కష్టం!

"శాశ్వతము కానిది సత్యము కాదు" అన్నప్పుడు భౌతిక దేహమే శాశ్వతము కాదు గదా... యిక అశాశ్వతమైన ఆ భౌతిక దేహం ఆచరించే క్రీడలకు అంతటి ప్రాముఖ్యత యివ్వటం ఎందుకో!

"కోరికయే చావు, పుట్టుకలకు కారణము. కోరిక నశించినచో కర్మమూలము నరకబడి చావు పుట్టుకల చక్రము దాటును. జన్మరాహిత్యము పొందనగును" అన్న ప్రవక్తల సూక్తులను నమ్మి, జన్మరాహిత్యం పొందాలన్న కోర్కెతో యితర కోర్కెలను నశింపజేసుకున్నా ఆ ఒక్క కోర్కె చాలుకదా, జన్మరాహిత్యాన్ని కోల్పోయేందుకు!

"ప్రవక్తల సూక్తులను నమ్మి మా అమ్మ ఆదర్శాల నిషాలో కోర్కెలను చంపుకోలేదు. కన్న పేగునైన నాకు వెన్నెల్లో గోరుముద్దలు తినిపించాలన్న కోర్కెతోసహా! నాకు అదే ఆనందం, అమ్మ అలా ఆదర్శాలను విస్మరించి ఎంత మేధస్సుతో నేర్పుగా తప్పుకుందో, ప్రవక్తల బారినపడకుండా!

"ఈ పాతివ్రత్యం, సత్యనిష్ఠ, ధర్మాలు, ఆదర్శాలూ, నీతిసూక్తులూ అన్నింటిమీదా యీసడింపు, చులకన భావం కుదురుకుంది నాలో.

"ఏ పాపమూ ఎరుగని భార్యాబిడ్డను నానాహింసలు పెట్టాడు హరిశ్చంద్రుడు. భార్యను బానిసగా అమ్మాడు. శవాలను కాల్చాడు. కల్లుకుండలు మోశాడు. కొడుకు శవానికీ కాటిసుంకం కావాల్సిందే అన్నాడు. అంత ఛండాలమూ, పరమ నీచమూ ఐన పనులన్నీ చేశాడు. మొగుడికి తప్ప మరెవ్వరికీ కనిపించకుండా చంద్రమతి దాచుకున్న మాంగల్యాన్నీ గుంజుకున్నాడు. అప్పులవాడి దగ్గర మర్యాద నిలుపుకొని సత్యహరిశ్చంద్రుడయ్యాడు. అప్పు చేసింది తనైతే శిక్ష అనుభవించింది భార్యా, అలాంటివాడికి కొడుకుగా పుట్టిన నేరానికి లోహితాశుడూ...

"నాకు అనిపిస్తుంది కదా. అలా వాళ్ళను క్షోభ పెట్టకుండా, అప్పులవాడి బాధలేకుండా అతనే యింత విషంతాగి చస్తే బాగుండేది. అప్పులవాడ్ని చంపితే మరీ బాగుండేది!

"మన పతివ్రతలు కూడా తెలివితక్కువగా, నిరుపయోగంగా ఎలా జీవించారో తెలుసా! సీతమ్మవార్నే తీసుకో...! 'నాన్న గారి మాట ప్రకారం నేను అరణ్యవాసానికి వెళ్తున్నా'నని రాముడు చెప్పగానే 'సరే... నాకు చెప్పకుండా అలా మీరే నిర్ణయించుకున్నారు గనుక నిక్షేపంగా వెళ్ళిరండి' అనకుండా ఆమె కూడా భర్త వెంట బయల్దేరింది.

"అరణ్యాలకు వెళ్ళింది కుదురుగా ఉందా అంటే అదీ లేదు. బంగారం మీద వ్యామోహంతో మాయలేడిని కోరుకుంది. ధర్మసూత్రాల కోసం లక్ష్మణరేఖ దాటింది. కోరి కష్టాలు తెచ్చుకొని రావణాబ్రహ్మ చెరన బడింది.

"రావణ సంహారంచేసి భార్యను రక్షించుకున్నా ఆమె శీలాన్ని శంకిస్తే నిప్పుల్లో దూకింది. పతివ్రతనని సాక్ష్యం చూపించింది. భర్తమీద విసిగిపోయి చివరికి తన మహిమలతో భూమాతను బ్రద్దలు చేసి తల్లి ఒడిలోకి వెళ్ళిపోయింది.

"ఎంత మానసిక క్షోభ అనుభవించిందీ!

"నేను అయితే నా మహిమలతో రావణాబ్రహ్మను తిరిగి బతికించేదాన్ని. అన్నాళ్ళు అతని చెరలో ఉన్నా ఏనాడూ అఘాయిత్యం చెయ్యని సత్పురుషుడు రావణాసురుడితో కలిసి హాయిగా జీవించేదాన్ని.

"అనుక్షణం అనుమానించే మొగుడికన్నా అణువణువునా ఆరాధించే విటుడే నయం కదా!

"మన అహల్యది మరీ ఘోరం, పాపం! ఆ పిచ్చిది గౌతముడి వేషంలో వచ్చిన ఇంద్రుడ్ని నిజం మొగుడే అనుకుంది. పడక సుఖం అందించింది. శీలం చెడింది గనుక భర్త ఆగ్రహానికి గురైంది. శాపవశాన శిలగా మారింది. శాప విముక్తి రామ పాదం శోకినప్పుడే అన్నారు. రాముడొచ్చి కాలితో తంతే మళ్ళీ ఆడదైంది. పుఠంపడిన లోహం మలినాలను తొలగించుకున్నట్టు పతివ్రతగా మారింది.

"భార్య తప్పు లేశమాత్రం లేకుండానే శిలవు కమ్మని ఒక మహాముని శపిస్తే ఆ శాప పరిహారం, భార్యను అనుమానించిన ఒక పుణ్యపురుషుడి పాద స్పర్శ!

"ఎంత విడ్డూరం!

"అదే నేను అహల్యనైతే నా నిస్సహాయతనూ, తప్పులేమినీ గమనించకుండా అహంకారంతో శపించిన గౌతముడి బవిరి గడ్డాలపీడ వదిలించుకొని శాపవిమోచనం కాగానే, నాకోసం వెంపర్లాడిన ఆ ఇంద్రుడి దగ్గరికే వెళ్ళేదాన్ని. అతడు అక్కున చేర్చుకొంటే ఆనందించేదాన్ని. తిరస్కరించినా రంభ, ఊర్వసి, మేనక, తిలోత్తమల్లాంటి దేవవేశ్యల సరసన చేరేదాన్నిగానీ పతివ్రతనయ్యేదాన్ని కాదు!" అన్నది ముత్యాలమ్మ, బాధ, ఆవేశం మిళితమైన స్వరంతో.

ఆమె అలా మాట్లాడినా యింకా తల వెయ్యి వక్కలు కాలేదేం? కనుగుడ్లయినా పేలిపోలేదేం? పోనీ, కాళ్ళూ చేతులూ కదలకుండా పక్షవాతమైనా రాలేదేం? అనుకొంటూ ఆశ్చర్యంగా చూసింది మార్తమ్మ ముత్యాలమ్మవేపు.

ఆమె నిక్షేపంగా ఉంది!

"గొప్పోళ్ళని అట్టా అనగాకే ముత్యాలమ్మప్పా!" అంది బ్రతిమాలే ధోరణిలో. "సదూకున్న దానివి నువ్వు. శాత్రాలనించి బొక్కుల్లో నించీ మంచికీ శబ్బరగ్గూడా సాచ్చీకాలు సూపెట్ట గలిగిందానివి. మంచిని సెడుగా జెప్పాల్నన్నా, సెడును మంచి అనిపియ్యాలన్నా సమ్మర్దత గల్గిందానివి. అసువంటి నువ్వు నీ గేనంతోన ఎంత సెప్పినా గేనం లేన్దాన్ని నాకెట్టా అర్దమైతది!




నాకు సదువులేదు. గేనం లేదు. ప్రెపంచకం తెలవదు. తెలిసిందల్లా నీలు పల్లానికి బార్తయ్యనీ, పాలు తెల్లంగుంటయ్యనీ, జల్మనిచ్చిన అమ్మా నాన్నా సిన్నప్పటికాడ్నించి నేర్పిచ్చింది నూరిపోసిందీ మంచిదనీ, ఆళ్ళు సీదరిచ్చుకుంది శబ్బర అని మాత్తరం తెల్సు నాకు.

"ముత్తేలమ్మప్పా! యోహాను మోజు పడుతుండాడని ఆడికి సోటు పెట్టటం మంచిదో? సెడుదో నా కనవసరం. అట్టా సెయ్యటం నాకిట్టంలేదంతే! నిజ్జ వప్పా! నాకు బెండకాయ కూరంటే అసయ్యం అంటాను. అంతమాత్తరాన కూర మంచిది గాదన్నుగదా! మంచిదని ఎవురైనా సెప్పినా తిన్నుగదా! అంతేనప్పా యిది గూడా!" అంది మార్తమ్మ.

ముత్యాలమ్మ అభిమానం వర్షించే కళ్ళతో చూసింది.

"మార్తమ్మా...! నీ అభిప్రాయాన్ని నేను కాదనను. యోహానుమీద ఆధారపడిందాన్ని కనుక యిలా అన్నాను కానీ నిన్ను నీ మార్గంనుంచి తప్పించి నా మార్గంలోకి తెచ్చుకుందామని కాదు" అని కొంచెం ఆలోచించి "యోహాను బాధ ఒదిలించుకోవాలంటే నువ్విక నా దగ్గరికి రావద్దు. అది మన ఇద్దరికీ మంచిది. నా దగ్గర పాత కుట్టుమిషనుంది. ప్రస్తుతానికి దాన్ని పట్టుకొని వెళ్ళు. ఇంటి దగ్గరే మిషను కుట్టుకో!"

"నా మీన నీకు కోపవా అప్పా?" దీనంగా అడిగింది మార్తమ్మ.

"పిచ్చిపిల్లా... నీమీద కోపం లేకపోవటమేకాదు, అమితంగా నిన్ను అభిమానిస్తున్నాను కనుకనే యీ నిర్ణయానికి వచ్చాను. ఇది మన ఉభయులకూ శ్రేయస్కరం" అని "ఆ విషయంలో యిక నా నిర్ణయం మారదు. ఇకపోతే, నీ విషయంలో భంగపడ్డ యోహాను తన చివరి అస్త్రంగా ప్రయోగించేది అతనికి మీరు యివ్వవలసిన డబ్బు"

మార్తమ్మ గుండె ఝల్లుమంది.

"నిజ్జివేనే అప్పా" అని "అయినాగానీ అది మొగోళ్ళ యవ్వారం. బాకీ యిసయం మా ఆయన సూసుకుంటాడు. నాకేటి సమ్మందం" అంది.

ముత్యాలమ్మ జాలిగా నవ్వింది. "మార్తమ్మా చిన్న ముక్కుపుడక కొనలేదనే మీరు పడుతోన్న భంగపాట్లు నువ్వే చెప్పావు నాకు. అలాంటప్పుడు యోహాను బాకీ ఎలా తీర్చగలడు మీ ఆయన?" అడిగింది.

మార్తమ్మకు సమాధానం తోచలేదు. పైటచెంగు దారాలను మెలి పెడుతూ నిల్చుంది.

"ఒక పని చెయ్యి" అంది ముత్యాలమ్మ క్షణం తర్వాత.

"ఏంటప్పా?"

"యోహాను డబ్బుకోసం వత్తిడిచేస్తే వెంటనే నా దగ్గరికి వచ్చేయ్. ఆ డబ్బులు నేను యిస్తాను. యోహాను బాకీ తీర్చు"

"నీకయినా బాకీనేగా అప్పా ఎట్లాగా తీర్సాల?"

"నా డబ్బు నేను అతడినుంచే రాబట్టుకుంటాను. అది జీవితం నాకు నేర్పిన విద్య కనుక నువ్వు దాన్ని బాకీగా అనుకోవద్దు" చెప్పింది ముత్యాలమ్మ.

"సరే, యల్తాను. నా పాత సీరె యాడుందే అప్పా! ఇది యిడిసి నా సీరె కట్టుకొని పోతాను" అడిగింది మార్తమ్మ.

"అప్పా! అని పిలుస్తున్నావంటే నేను నీకు పరాయిదాన్ని కాదు. ఆ చీర నువ్వే వుంచుకో. యోహాను విషయం మర్చిపో" అంది ముత్యాలమ్మ.

మార్తమ్మ ఆమెవేపు అభిమానం వర్షించే కళ్ళతో చూసింది.

తనలో దాగి వున్న అనంతకోటి భావా

లను ఒక్క మాటలో పొందుపరుస్తూ "అప్పా" అని పిలిచింది ఆర్ద్రంగా.

అప్పుడు మార్తమ్మ ముఖంలోకి చూసి గమనించిందామె.

మార్తమ్మ కళ్ళలో కన్నీటితడి.



ముత్యాలమ్మ ఇచ్చిన కుట్టుమిషను తెచ్చి యింట్లో పెట్టింది మార్తమ్మ. పల్లెలో యింటింటికీ తిరిగి జాకెట్లు, లంగాలూ కుట్టేందుకు తనకు యివ్వమని చెప్పింది. అందరికన్నా కుట్టుకూలి ఒక రూపాయి తక్కువగానే తీసుకుంటాననీ చెప్పింది.

భాగ్యమ్మ ద్వారా ఆ విషయం తెలిసి హడావుడిగా ముత్యాలమ్మ ఇంటికి వెళ్ళాడు యోహాను.

ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్న ముత్యాలమ్మ యోహానును చూసి కుర్చీ లోంచి లేచింది. అతడ్ని లోనికి ఆహ్వానించింది.

"మొత్తానికి మార్తమ్మకు కొద్దిరోజుల్లోనే కుట్టుపని నేర్పావు. మిషను కూడా యిచ్చి పంపించావు. నీ స్త్రీ జనోద్ధరణకు జోహార్లు గానీ యింతకీ మార్తమ్మతో నా విషయం హెచ్చరించావా? లేదా?" అని ముత్యాలమ్మ కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూస్తూ అడిగాడు యోహాను.

"మీరు చెప్పాక చెప్పినట్టు చెయ్యకుండా ఎలా ఉంటాను" అంది ముత్యాలమ్మ.

"ఏమన్నది?"

"ససేమిరా కాదన్నది"

"నా పలుకుబడితో, డబ్బుతో ఆమె జీవితాన్నే మారుస్తాననలేదా?"

"మారనంది"

"ఇంతకూ నువ్వు ఏం సాధించినట్టు?"

"పేదరికం అన్నింటికీ తల వంచదని తెలుసుకున్నాను"

"పేదరికానికి తల వొంచేకదా, నువ్వు మారింది"

"మనుషుల్లో వ్యత్యాసాలుంటాయి"

"కరెక్టే! ఆ వ్యత్యాసాలను బట్టి అవసరమైతే పెద్దపెద్ద ప్రలోభాలను ఆశ చూపించాలి. కార్యసాధనకు దారి అదే! మార్తమ్మ ముక్కుపుడక్కీ చిల్లర డబ్బులకూ లొంగక పోవచ్చు మీతోపాటు ఆమెనూ చర్మకార సంఘంలో చేర్పిస్తానంటే తప్పక లొంగుతుంది"

"ప్రయత్నించండి"

"నేను గెలిచి తీర్తాను"

"అప్పుడీ ప్రపంచంమీద నాకున్న కొద్దిపాటి విశ్వాసమూ పోతుంది"

యోహాను విసురుగా కుర్చీలోంచి లేచి బైటికి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో మార్తమ్మ తప్ప ఇంట్లో ఎవరూ ఉండరు. భాగ్యమ్మ చూడకుండా ఎలాగో వెళ్ళి మార్తమ్మతో మాట్లాడాలనుకున్నాడు యోహాను.

రిక్షా పిలిచి ఎక్కి కూర్చుంటూ "మాదిగ పల్లెకు పోనీ" అన్నాడు.

పది నిముషాలలో రిక్షా మార్తమ్మ ఇంటికి కొంచెం దూరంగా ఆగింది. రిక్షా

 

వాడికి డబ్బులు యిచ్చి పంపించాడు యోహాను. నెమ్మదిగా నడుస్తూ భాగ్యమ్మ కదలికలను గమనించేందుకు యింటివేపు చూస్తున్నాడు.

భాగ్యమ్మ యింట్లో ఏదో పనిలో ఉన్న ట్టుంది.

మరి కొంచెందూరం అలాగే నడిచి రివ్వున పక్కకు తిరిగి వేగంగా మార్తమ్మ యింట్లోకి దూరాడు.

పాత గుడ్డతో మిషను తుడుస్తున్న మార్తమ్మ ఆ అలికిడికి తల ఎత్తి చూసింది.

యోహాను కనిపించగానే గుండె అవి సింది. నరాల్లోని రక్తం పోటెత్తింది. డబ్బు... డబ్బు... డబ్బు అంటూ కొట్టుకుం టోంది గుండె.

"వీడు డబ్బు అడిగేందుకే వచ్చాడా?" అనుకుంది మార్తమ్మ.

"ముత్యాలమ్మ దగ్గరికి వెళ్ళొస్తున్నాను" అన్నాడు యోహాను.

మార్తమ్మ మాట్లాడలేదు.

"అంతా చెప్పింది నాకు" అన్నాడు.

"ఇంక యీడికెందుకు వొచ్చినావు" గొంతు పెగల్చి అడిగింది.

"నీకోసం" అన్నాడతను వెంటనే.

"అదీ జల్మలో జరగదు"

"మార్తమ్మా..." అనునయంగా పిల్చాడు. "జీవితం ఒక గాలిబుడగ. ఏ క్షణాన అది పేలిపోతుందో చెప్పలేం. మనం చెయ్యా ల్సిందల్లా బతికున్న నాలుగు రోజులూ సుఖపట్టమే. అదికూడా అందరికీ అందుబా టులోకి రాదు. అందుకు అదృష్టం కలిసిరా వాలి. నీకలా కలిసివచ్చింది కనుకనే నీమీద మోజుపడ్డాను నేను. ఈ అవకా శాన్ని సద్వినియోగం చేసుకొంటే నీ జీవి తాన్ని అద్భుతంగా మారుస్తాను. నన్ను కాదని యిలా తెలివితక్కువగా ప్రవర్తించి ఏం సాధించగలవ్?" అని అడిగాడు యోహాను. ఆరాధనగా ఆమెవేపు చూస్తూ నిల్చున్నాడు.

మార్తమ్మకు వొళ్ళంతా చమటలు పట్టాయి. సన్నగా కంపిస్తోంది. అతను అలా అక్కడ నిలబడటమే సహించలేనట్టు చిరాకుగా చూస్తూ, "ఎళ్ళిపో యోహానూ" అంది ముఖం చిట్లిస్తూ.

ఆ తిరస్కారం, నిర్లక్ష్యం, అనుకున్నది సాధించలేని కసి, ఆమెకోసం ఆరాటపడు తోన్న మనసుకు కలిగిన తాపం, అప జయం తాలూకు ఆవేదనా అన్నీ కలగాపు లగంగా చుట్టుముట్టి అతడ్ని ఉన్మత్తుణ్ణి చేశాయి.

ఆవేశంతో ఊగిపోతున్నాడు. విచక్షణా జ్ఞానం కోల్పోయాడు. అతడ్ని రాక్షసత్వం ఆవహించింది. పశుప్రవృత్తి నిద్రలేచింది.

ఆమెను పొందలేని అపజయం ముందు నియమాలు, పరువుప్రతిష్టలు, కట్టుబాట్లు అన్నీ వృధా అనిపించాయేమో మాటువేసిన పులి లేడికూన మీదికి దూకినట్టు అమాంతం లంఘించి దూకి ఆమెను తన బాహువుల్లో బంధించాడు.

క్షణం నివ్వెరపోయింది. మరుక్షణం గిల గిలా కొట్టుకుంది. గోళ్ళతో రక్కుతూ కెవ్వున కేకవేసింది.

ఆ కేక భాగ్యమ్మకు వినిపించిందేమో అన్న ఆలోచన కల్గింది అతనికి.

పట్టు సడలింది.

అదే అదనుగా తన రెండు చేతులనూ అతడి గుండెకు ఆన్చిపెట్టి దూరంగా తోసింది మార్తమ్మ.

ఆ విసురుకు యోహాను తూలి, రెండు అడుగులు వెనక్కువేశాడు.

తడక తలుపు తెరుచుకుంది.

మార్తమ్మ, యోహానూ యిద్దరూ అటువే పుకు చూశారు.

అతను పేతురు.



పేతుర్ని చూడగానే యోహాను పిల్లిలా బైటికి జారుకున్నాడు.

పేతురు అతడ్ని నిరోధించలేదు. నిలదీసి ఏమీ నిందించలేదు. రక్తం అంతా తోడివేసి నట్లు పాలిపోయిన కళ్ళతో మార్తమ్మనే చూస్తూ నిల్చున్నాడు.

అతడి చూపులూ, ఆ మౌనం గమనించి గడగడా వొణికిపోతూ "ఆడు... యోహాను గాడు ఇంటోదూరి ఏంటేంటిదో మాట్లాడిం డుగానీ నేనే తప్పు సెయ్యలేదు" అంది తల వంచుకుంటూ.

పేతురు మార్తమ్మ దగ్గరికి వెళ్ళాడు.

ఆమె గడ్డంకింద చెయ్యిపెట్టి ముఖాన్ని పైకిలేపాడు.

"మార్తీ... నువ్వు శబ్బరపని చేస్తే యోహానుగాడ్ని దూరంగా నెట్టవు. నీ గాజు లిట్టాగా పగలవు" అన్నాడు జాలిగా ఆమె కళ్ళలోకి చూస్తూ.

అప్పుడు గమనించింది మార్తమ్మ. యోహానుతో పెనుగులాడినప్పుడు పగిలిన గాజుముక్కలు నేలమీద మెరుస్తోన్నాయి.

సన్నగా ఏడుస్తోంది మార్తమ్మ.

"నువ్వేంటికే ఏడుత్తావూ... బువ్వకిలేని బీదోడినైగూడా నీ అసుమంటి అందగత్తెని సేసుకొని అందరికీ సులకన సేసినందుకు నేనేడవాల. కలిగినింటి కోడలివైయ్యుంటే యిట్టా ఎవ్వరైనా దైర్నంజేసి యింటో దూర్తారంటే! మనది పూరిగుడిసె. నీ మొగుడు బువ్వకి లేనోడు. ఆనాడు నోరుతె రిసి ముక్కుపుడక గావాలిమావా అని అడి గితే యియ్యాల్టిదాకా కొనలేనోణ్ణి. పెండ్లానికి అనువైన ఒక్కసీరా, రెయికా యియ్యలేకపో యినా యంటెంటనే తొంగుని కడుపుల్సేసి నోణ్ణి, ఆదర్వు లేకుండా పిలకాయలు గాలికి పెరుగుతాంటే ఆళ్ళ బతుకులకైనా యింత దారి సూపిచ్చలేనోణ్ణి, పేదోణ్ణి. సెప్పులు గుట్టే పేతురుగాణ్ణి. అసువంటి నాకు కోపం అనవొసరం అని తెల్సిగూడా మందు



తిక్కలో దేవసహాయంగాడి తల పగల్నాకి జేలుకు బోయినోణ్ణి.

"యదవనే నాను మార్తీ... యదవను

"దేవసహాయంగాణ్ణి సావగొట్టిన యద వను, యోహానుగాడు నా కళ్ళముంగలే నీ సెయ్యి బట్టుకున్నా, నిన్ను సెరబ్బోయినా సేతులు గట్టుకొని ఎందుకు ఊరుకుండానో తెల్సా? మళ్ళా యిడ్ని గొట్టి జేలుకుపోతే యింకెవుడూ యిడిపిచ్చడని బయ్యంతో

"ఆ బయ్యం జేలుగురించి గాదు. పోలీ సోళ్ళ దెబ్బలు గురించికాదు. వాళ్ళు మాట్టాడే బూతుకూతల గురించికాదు. అస లికియ్యన్నీ ఏంటిగ్గానీ బయ్యం నా గురించి గాదే... మార్తీ... మీ గురించి. మీ బువ్వ గురించి పుట్టిచ్చిన బిడ్డల గురించి. అంతే" అంటూ ఖిన్నుడై తల వొంచుకున్నాడు పేతురు.

అక్కడ నిశ్శబ్దం పురుడు పోసుకుంది.

పేతురు నెమ్మదిగా బాధనించీ, భావో ద్వేగం నించీ బయటపడుతూ,

"యోహానుగాడి డబ్బులు ఆడి మొకాన కొడితే యింక మన యింటి సాయలకు రాకుండా సెయ్యొచ్చు. ఇంక మనం సెయ్యా ల్సిందదే! ఎంతియ్యాలే ఆడికి? " అని అడి గాడు.

"ఐదొందలు" చెప్పింది మార్తమ్మ.

పేతురు ఏదో నిర్ణయానికి వస్తూ, "నేనట్టా ఊళ్ళోకి ఎళ్ళొత్తానుగానీ బద్రం గుండు" అంటూ బయల్దేరేందుకు తయార య్యాడు.

"ఇయ్యాళ పనెట్టలేదా? " అడిగింది మార్తమ్మ.

"లే..."

"ఏంటికని? "

"జొరం"

మార్తమ్మ రెండు అంగల్లో భర్త దగ్గరికి వెళ్ళింది. చేత్తో అతడి నొసటిమీద తాకి చూస్తూ "అమ్మో వొళ్ళు కాలిపోతాంది"

అంది.

"పేనం బోదులే, జొరవేగా" అంటూ గుడిసెలోంచి బైటికి వెళ్ళిపోయాడు పేతురు.

వృద్ధుల శరణాలయానికి సంబంధించిన కాయితాలేవో తయారుచేస్తూ యింట్లోనే ఉన్నాడు వెంకటేశ్వర్లు పేతురు వెళ్ళేసరికి.

అతను రావటం వెంకటేశ్వర్లుకు ఆశ్చర్యం కల్గించలేదు.

"రా... రా... సమయానికి వచ్చావ్" అని పిలిచి, పక్కనే కుర్చీలో కుర్చోపెట్టుకుని "ఏమిటి విశేషాలు? " అని అడిగాడు.

"ఒక యవ్వారంలో యోహానుగాడికీ, నాకూ సెడింది. ఈ మద్దెన నన్ను పోలీ సోళ్ళు కొట్లో బెడితే సీతయ్య సౌదరిగార్తో జెప్పిచ్చి యిడిపిచ్చిండు. ఐదొందలు కర్సు గూడా బెట్టిండు. ఆడి డబ్బులు ఆడికి య్యాల. పల్లెలో ఎటూ ఆడు సీతయ్యసౌదరి పార్టీ జండాలెత్తిస్తాడు. ఓట్లడుగుతాడు. ఆడికి యతిరేకం జెయ్యాలంతే! యోహానుగాడికి మా పల్లెలో ఓటు లేకుండా సెయ్యాలంతే"

వెంకటేశ్వర్లు ఆలస్యం చెయ్యలేదు. ఆ వేడిమీదనే అతడ్ని వెంటపెట్టుకుని వెళ్ళి బెంజిమెన్‌కు కలపాలని నిర్ణయించుకుని లేచాడు.

"బెంజిమెన్ దగ్గరికి రావటానికి నీకేమీ అభ్యంతరం లేదుగా? " అని అడిగాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"లేదు. యాడికైనా వత్తానంతే! ఈ దెబ్బతో పేతురుగాడంటే ఏంటిదో సూపిత్తాను. యోహానుగాడి గుండెల్లో నిదరబోతాను"

ఇద్దరూ ఇంట్లోంచి బైటికి వచ్చారు. రిక్షా పిలిచాడు వెంకటేశ్వర్లు. ఇద్దరూ. ఎక్కి కూర్చున్నారు. పది నిముషాల్లో బెంజిమెన్ ముందు వాలేరు.

"బాగున్నావా పేతురూ? " పలుకరించాడు బెంజిమెన్.

"ఏం బాగులే నా బొందబాగు, మనిషి మంచివాడుకదా ఎలా బాగుంటాడూ, ఈమధ్య మనం ఊళ్ళో లేనప్పుడు పేతుర్ని పోలీసులు పట్టుకుపోయారు. సీతయ్యచౌదరికి చెప్పి విడిపించాడట యోహాను. ఆ తర్వాత యిద్దరికీ ఎందుకో బెడిసికొట్టింది. అందుకే మన దగ్గరికి వచ్చాడు" చెప్పాడు వెంకటేశ్వర్లు.

"ఇప్పటికైనా కళ్ళు తెరిచాడు" అని పేతురువేపుకు తిరిగి "పేతురూ నీ అవసరాలు నాకు తెలుసు. నీ సత్తా కూడా నాకు తెలుసు. ఈ ఎన్నికల్లో నువ్వు నీ సత్తా నిరూపించుకొని మాదిగ పల్లె ఓట్లు మాకు వేయించావంటే నీ అవసరాలు తీర్చటం మాకేమీ పెద్దపని కాదు" అన్నాడు.

"బెంజిమేను గోరు! అవసరాలు తీరుత్తారంటే మంచిదేకానీ నేను మీకాడికొచ్చింది ఒక్క అవసరాలకోసం గాదు. యోహానుగాడిమీన కచ్చతో. ఇంక సూడండి సావులూ... పల్లెలో నేనంటే ఏంటిదో!

"గుడిసె గుడిసెకీ మన జండా లెగవాల. మడిసి మడిసికీ నిదర్లోకూడా మన గురుతే గుర్తుండాల. ఓటొక్కటి కూడా రామిరెడ్డిగోరికి లేని మాదిగపల్లెలో యీ తూరి యోహానుగాడిదీ, ఏసోబుగాడిదీ దప్ప సీతయ్య సౌదరికి మూడో ఓటే పడకుండా సెయ్యాల. ఆ బాద్దెత నాది. నాకు సాయం చేసే బాద్దెత మీది" అన్నాడు పేతురు ఉత్సాహంగా.

అప్పుడు బెంజిమెన్‌తో చెప్పాడు వెంకటేశ్వర్లు,

"పాపం... మన పేతురుకు అవసరాలు తప్ప ఆశల్లేవు. కష్టాలు తప్ప సుఖాల్లేవు. యోహానుకు ఐదొందలు బాకీ. భార్యకు ముక్కుపుడక ఒకటి కొనాలని జీవితాశయం. ఇంకా ఏదీ తీరలేదు" అని.



బెంజిమెన్ పేతురు భుజంమీద చరిచాడు. "అన్నింటికీ నీకింక నేనున్నాను. నువ్వింక ఎన్నికల పనిలోకి దిగితే నీ అవసరాలు గుర్తించి ఏం చెయ్యాలో ఆలోచిస్తాం" అని హామీ యిచ్చాడు.

సమావేశం అంతటితో ముగిసింది.

పేతురుకు మాయలేడి కనిపించి ఊరించింది.

★ ★ ★

ఎన్నికల ప్రచారం వేడెక్కుతోంది. నిత్యం ఊరేగింపులూ, వార్డువార్డుకూ మీటింగులూ, పల్లెపల్లెకూ నాయకుల ప్రయాణాలూ...

ఊహించినట్టే రామిరెడ్డికీ, సీతయ్యచౌదరికీ మధ్య పోటీ చాలా తీవ్రంగా ఉంది.

పేతురుకు క్షణం తీరికలేదు.

పగలంతా యథావిధిగా చర్చిదగ్గర చెప్పులు కుట్టటం, సాయంత్రం కాగానే ఇంటికి వెళ్ళి నాలుగు చెంబుల నీళ్ళు వొంటిమీద పోసుకోవడం, నాలుగు ముద్దలు హడావుడిగా మింగి పల్లెలో తిరుగుతూ 'రామిరెడ్డి పార్టీకే మన ఓట్లు' అంటూ నిద్ర తూలేదాకా తిరగడం, తిరిగి పొద్దున్నే చర్చి దగ్గరికి వెళ్ళటం అతడి దినచర్యగా మారింది.

పేతురు రంగప్రవేశంతో పల్లెలో నిజంగానే చాలా మార్పొచ్చింది.

తన కంచుకోటగా భావించిన పల్లె అలా చెయ్యిజారిపోవటంతో సీతయ్యచౌదరి కంగుతిన్నాడు. యోహాను ముఖం వాడిపోయింది. పేతురుకు చాలా ఆనందంగా ఉంది. రామిరెడ్డి పార్టీవాళ్ళకు అంతకన్నా ఆనందంగా ఉంది.

ఆ రోజే పోలింగు.

పేతురుపొద్దున్నే ఒకసారి పల్లె అంతా తిరిగి రామిరెడ్డి పార్టీ గుర్తును అందరికీ మళ్ళీ ఒకసారి గుర్తు చేశాడు. ఎండ ఎక్కకముందే వెళ్ళి ఓటువేసి రమ్మని చెప్పాడు. తొమ్మిది గంటలకల్లా యధావిధిగా ఖాకీ సంచి భుజానికి తగిలించుకొని బయల్దేరాడు.

"యియ్యాళ గూడా సెప్పులు గుట్టాలా?" అంది మార్తమ్మ.

"తిక్కల్దానా అంత గేనం లేకపోతే మాట్టాడమాకు. జనం యియ్యాళ పోలింగు బూతు లకాడ నెట్టుకుంటారు. తోసుకుంటారు. కొట్టుకుంటారు. బాంబులేస్కుంటారు. పోలీసోళ్ళు కర్రల్తో బాత్తుంటారు. జనం లగువెత్తుతుంటారు. అసుమంటప్పుడేనే ఎంత కంపెణీయీ, కొత్తయీ అయిన మొనగాడి సెప్పులైనా ఉంగటాలు తెగుతయ్యి. మనికి బేరం అంటే యియ్యాళ్నేనే!" అన్నాడు పేతురు.

మార్తమ్మ ఏదో చెప్పబోయింది. చెప్పాలా? వద్దా? అని సందేహిస్తూ తను చెప్పాలనుకున్నది మరోవిధంగా భర్తకు గుర్తుచేస్తూ,

"బెంజిమెను డబ్బులియ్యంగానే వత్తా వత్తా సిన్నదానికి కాళ్ళపట్టీలు తెత్తావా?" అని అడిగింది.

పేతురు కళ్ళు తళుక్కున మెరిసేయి.

బెంజిమెన్ అంతకు క్రితంరోజే పేతురుతో చెప్పాడు, "రేపు సాయంత్రంకల్లా నేనే నిన్ను వెదుక్కుంటూ వచ్చి డబ్బులిస్తాను" అని.

ఇంటికి వెళ్ళగానే ఆ విషయాన్ని భార్యకు చెప్పాడు పేతురు.

"ఇయ్యాళ బెంజిమేను డబ్బులిత్తాడు. ఆటిల్లోంచి ఐదొందలిచ్చి యోహానుగాడి శనిపీడ వొదిలిచ్చుకోవాలి. ఇంకా నాకాడ డబ్బులుంటయ్యి. సిన్నదానికి పట్టీలు గొంటాను. పలకా బలపం కొంటాను. ఇద్దరు కొడుకులకీ చొక్కాలు, లాగులు కొంటాను. అన్నీ గొన్నా యింకా డబ్బులు మిగుల్తయ్యిగందా, ఏం సెయ్యాలీ" అని




మార్తమ్మను ఉడికిస్తూ ముసిముసిగా నవ్వాడు పేతురు.

మార్తమ్మ "ఊ" అంటూ దీర్ఘం తీసింది. "నువ్వూ నీ బిడ్డలూ అన్నీ గొనుక్కోని సుకంగుంటే అంతేసాల్నాకు, ముక్కుపుడ కేంటి కర్మం, ముత్తేల గొలుసే ఏసుకు న్నంత. యోహానుగాడి బాకీ తీర్సు, అదే గనకార్యం" అంది మూతి విరుస్తూ.

"అయితే నీకు ముక్కుపుడకొద్దా? "

"అడగాల్నా ఏటి అది కూడా. యాపారం జేసైనా పెండ్లానికి ముక్కుపుడక తెద్దావ నేగా యవ్వారానికెళ్లి దేవసహాయంగాడి తలపగల్నాకినావు. అసువంటోడివి, డబ్బు లుంటే తీసుకురాకుండా ఉంటావా ముక్కు పుడక" అని మార్తమ్మ కూడా ముసిముసిగా నవ్వింది.

పేతురు గుడిసె మూలకు వెళ్ళి చెప్పులు తొడుక్కున్నాడు. బైటికి వెళ్ళబోతోంటే,

"ఎప్పుడుండే దరిద్దరవే గానీ తెంపుజేసి నువ్వాక పంచా, సొక్కా కొనుక్కో" అని చెప్పింది మార్తమ్మ భర్తతో.

పేతురు ఆగాడు, క్షణం ఆలోచించాడు.

"ముంతలో సిల్లర ఎంతుంటాది? " అని అడిగాడు.

"ఏంటికీ? " ప్రశ్నార్థకంగా చూసింది మార్తమ్మ.

"మా అప్పకీ, బావకీ సెప్పులు గొన్న ప్పుడు సీ కాళ్ళపట్టీలు తాకట్టెట్టాను గందా... అయిగూడా యిడిపిచ్చాల. డబ్బులు సాల్తయ్యో, లేదో! సాలకపోతే యియిగూడా గలిపి పట్టీలు తెత్తాను" అని భార్యవేపు మురిపెంగా చూస్తూ, "సావి రంగా! ముత్తేలమ్మిచ్చిన గళ్ళకోక గట్టి ముక్కుపుడక బెట్టి నువ్ కాళ్ళకి పట్టీలు గట్టి నడుస్తాంటే ఎంత సక్కంగా ఉంటా దోనే మార్తీ" అన్నాడు పేతురు.

మార్తమ్మ సిగ్గుతో మొగ్గ తొడిగింది.

ముంతలోంచి తీసిన చిల్లర డబ్బులను కాయితంలో కట్టి భర్తచేతికి అందించింది.

ఆ పొట్లాన్ని జేబులో పెట్టుకున్నాడు పేతురు. చాలా సంతోషంగా, హుషారుగా పోలింగు బూతుదగ్గరికి వెళ్ళాడు.

పోలింగు బూత్‌కు కొంచెందూరంగా ఓటరు స్లిప్పులు యిస్తున్న రామిరెడ్డి, పార్టీ కార్యకర్తలకు పేతుర్ని చూడగానే ఆనందం అనిపించింది. "పేతురు- జిందాబాద్! గెల్చే పార్టీ- రామిరెడ్డి పార్టీ" అంటూ నినాదాలు చేశారు.

పోలీసులు వచ్చి వారించేక గానీ నినాదా లహోరు ఆగలేదు.

ఓటరు స్లిప్పు తీసికొని పోలింగు బూత్ లోకి వెళ్ళాడు పేతురు. రామిరెడ్డి గుర్తుమీద ఓటు ముద్రవేశాడు. ఓటు కాయితం మడిచి పెట్టెలో వేశాడు. పోలింగ్ బూత్‌నుంచి బైటికి వచ్చి మళ్ళీ కార్యకర్తల దగ్గరికి వెళ్ళాడు. ప్రశాంతంగా పోలింగు జరిపించమని అక్కడివాళ్లకు చెప్పి నెమ్మ దిగా బయల్దేరాడు.

కొంచెందూరం వెళ్ళగానే యోహాను ఎదు రయ్యాడు. పేతుర్ని నమిలి మింగేట్టే కోపంతో డేగచూపులు చూస్తూ, "విశ్వాసం లేని మనిషివిరా నువ్వు. పోలీసులకు సెప్పి విడిపించిన మాకే ద్రోహం చేస్తావా? ఇక్కడ ఎవ్వరూ గాజులు తొడుక్కుని లేరు. ఇందుకు ఫలితం అనుభవిస్తావ్" అని హెచ్చరించాడు.

పేతురుకు కోపం నషాళానికి అంటింది.

"అరే... యోహానుగా. వొలుకుల్లో నక్క కాపలాకి కాదురా తిరిగేది, పీనిగెలకోసరం! నువ్వూ అసువంటోడివే. నీకు శాతనైంది నువ్వు చేస్తే నాకు శాతనైంది నే జెయ్యనం టరా? మాటలు దేనిగ్గానీ ఎళ్ళెళ్ళు" అని కసిరికొట్టి తన దారిన తను చర్చి దగ్గరికి వెళ్ళిపోయాడు పేతురు.

సాయంత్రం నాలుగ్గు గంటలైంది.

ఎవరైనా వస్తే చెప్పులు కుడుతూ ఖాళీగా ఉన్నప్పుడు వీధుల్లోకి పరకాయించి చూస్తూ కూర్చున్నాడు పేతురు.

వెంకటేశ్వర్లుగానీ, బెంజిమెన్‌గానీ యింకా అజాపజాలేరు.

వాళ్ళిద్దరిలో ఎవరో ఒకళ్ళు వచ్చి డబ్బు లిస్తే వెంటనే బంగారం కొట్టుకు వెళ్ళాలి. ముక్కుపుడక కొనాలి. ఆ తర్వాతనే మిగతా పనులు!

ఒకవేళ వాళ్ళు రావటం ఆలస్యమైతే? బాగా చీకటి పడ్డాక వచ్చి డబ్బులు యిస్తే?

అయినా నష్టంలేదు. చీకట్లో బాగా మెరి సేదే మంచి ముక్కుపుడక!

పేతురుకు అప్పుడు గుర్తొచ్చింది. ఎల క్షను రోజు దుకాణాలు ఉండవు.

"హోర్నీ...యవ్వ" అంటూ నొసలు కొట్టు కున్నాడు.

చర్చికి కొంచెం దూరంలో ఏదో గొడవగా ఉంది. రోడ్డుమీంచి కొంతమంది జనం పరుగులు పెడుతున్నారు. పోలీసులు లాఠీ లతో కనిపించిన ప్రతివాడినీ బాత్తూ వెంట పడి తరుముతూంటే, భయంతో వాణికి పోతూ సామాన్లను ఖాకీ సంచిలోకి సర్దబో యాడు పేతురు.

అప్పటికే ఆలస్యమైంది.

నలుగురు పోలీసులు పేతుర్ని చుట్టు ముట్టారు. "ఎలక్షనురోజు కూడా చెప్పులు కుడతావంటరా" అంటూ లాఠీలతో బాదసా గేరు.

ఖాకీ సంచి దూరంగా ఎగిరిపడింది. సామాన్లు చెల్లాచెదురయ్యాయి.

దెబ్బలను కాచుకుంటూ గావుకేక పెట్టి ఆ నలుగురు పోలీసుల మధ్యనుంచి సందు చూసుకొని పరుగు లంకించాడు.

★ ★ ★

మాదిగపల్లె పోలింగు బూత్ దగ్గర నిల బడి సరదాగా చూస్తూ నిల్చున్నాడు ఏలియా.

కొంచెం సేపటికి అక్కడ బాంబులు ప్రేలాయి.

కొంతమంది జనం పోలింగు బూతులోకి ప్రవేశించారు. పోలింగు సిబ్బందిని కొట్టి, బలవంతంగా పోలింగు బాక్సులు ఎత్తుకు పోయారు.

అలా అక్కడ గొడవ మొదలు కాగానే పరుగెత్తుకుంటూ ఇంటికి చేరుకున్నాడు ఏలియా.

"ఏందిరేయ్, ఆ లగువు?" అడిగింది మార్తమ్మ.

"ఆడ ఓటోళ్లు కొట్టుకుంటుండారు" గసపో సుకుంటూ చెప్పాడు ఏలియా. "ఊళ్లో అంతా గొడవ గుందంట. పోలీసోళ్లు సావ గొడుతుండారంట" అన్నాడు.

మార్తమ్మ ముఖం పాలిపోయింది.

"మీ అయ్య యాడుండాడో? ఎట్టాగుం డాడో?" అని అందుకు ఏలియా చెప్పే సమాధానం ఏమీ ఉండదనుకొని ఆత్రంగా గుడిసె బైటికి వెళ్ళి నిల్చుంది. తల ఎత్తి వీధికేసి చూస్తోంది భర్తకోసం.

"మార్తమ్మా!" అన్న పిలుపు వినిపించి ఉలిక్కిపడి చూసింది.

ఎటునుంచి వచ్చాడోగానీ యోహాను ఆమె పక్కనే నిలబడి కనిపించాడు.

మార్తమ్మ ఇంట్లోకి వెళ్ళబోయింది.

"ఒక్కమాట విని వెళ్ళు. ఈ ఎలక్షన్లో మీ ఆయన మాకు చేసిన ద్రోహానికి ఎంత శిక్ష వేసినా అది తక్కువే! నేను 'సరే' అంటే మా వాళ్లు క్షణంలో వాడి అంతు చూస్తారు. కానీ ఎందుకో అలా చెయ్యాలని అనిపించటంలేదు. అందుకు కారణం ఇంకా నీమీద నాకున్న వ్యామోహమే. ఇప్పటిక యినా మించిపోయిందేంలేదు. జరిగిం దంతా మర్చిపోదాం. మీ భాగ్యమ్మప్ప గూడా ఇంట్లోలేదు. పుట్టింటికి వెళ్ళింది.

ఇది మనకు మంచి అవకాశం మార్తమ్మా! నన్ను కాదనకు" అన్నాడు యోహాను.

మార్తమ్మకు చిర్రెత్తుకొచ్చింది.

ఎన్నడూ అలా పిలువనిది 'అరే... యోహానుగా' అని పిల్చి 'మంచి మడిసికొక మాట, మంచి గొడ్డుకొక దెబ్బ' అన్నారంట. నువ్వు మడిసివి గావని తేలిపోనాది. గొడ్డు వని కూడా తేలిపోనాది. కానీ అరేయ్! నువ్వేటో అనుకుంటున్నావ్‌గానీ నా మొగుడు శాతగానోడు గాదు. శావలేనాడేం గాదు. పక్కింటోడొచ్చి పెండ్లాన్ని సెడగొడతా వుంటే సేతులు గట్టుకొని కూకుండేవోడు గాదు, బీదోడంతే!

ఇప్పుడే నా మొగుడొత్తాడు. నీ ఐదొందలు నీ మొకాన గొడతాడు. ఆ ఛణంకాడ్నించి ఇస్మంటి పైచ్చికం కూతలు మళ్లా గూసినావంటే గూడలింక జార్తయ్యి జాగరతొ" అని గుడ్లురిమి చూసి-

"అరే... ఏలియా! మీ అయ్య కోసరం ఎళ్ళిరా..." అని కేక వేస్తూనే గుడిసె వేపుకు రెండడుగులు వేసింది. వెనక్కు తిరిగి మళ్ళీ ఒకసారి వీధికేసి చూసింది.

గాలిలో తేలుతూ- తూలుతూ బాణంలా దూసుకొని వస్తూ దూరంగా కనిపించాడు పేతురు.

ఆమె ముఖంలో వెల్తురు పూసింది. "వత్తన్నాళ్ళే మీ అయ్య" అంది మార్తమ్మ పెద్దగా.

యోహాను అదృశ్యమైపోయాడు.

కొంచెంసేపటికి పేతురు వచ్చాడు.

"యీవర్దాకా యాడున్నావ్?" అని అడుగుతూ మార్తమ్మ అప్పుడు చూసింది భర్త వైపు పరీక్షగా.

అతడి జుట్టు రేగిపోయింది. తొడుక్కున చొక్కా చినిగిపోయింది. కట్టుకున్న పంచె మీద అక్కడక్కడా రక్తపు మరకలు కనిపించాయి.

నిర్ఘాంతపోయింది మార్తమ్మ.

పేతురు లోపలికి వెళ్లి అమాంతం నులక మంచంమీద వాలిపోయాడు.

అతడి వెంటే లోపలికి వెళ్ళి "ఏటైందే నీకు?" అడిగింది భయం భయంగా.

పేతురు ఆయాసంతో రొప్పుతున్నాడు. మధ్యమధ్యలో మూలుగుతూ కాళ్ళూ, చేతులూ వొత్తుకుంటూ-

"ఇయ్యాళ ఉంగటాల బేరం శానా వొచ్చిందే మార్తీ! టీగ్గూడా లెగవకుండా సుట్టగాల్సకుండా సెప్పులు కుడతా కూకున్నాను. నాలుగ్గంటలకాడ ఓట్లోళ్లు కొట్లాటకి దిగినారు. పోలీసోళ్లు బడితె కర్రల్తో మంది మీన ఎగబడి ఓ కొట్టుడూ... ఓ కొట్టుడూ!

"అందరూ లగువెత్తుతాంటే నానూ లగు వెత్త బోనానంతే, పోలీసోళ్ళొచ్చి కర్రల్తో జీవాన్ని గొట్టినట్టు కొట్టారు. సావాన్లూ గీవాన్లూ యాడ బోయినయ్యో. ప్రేణం వుంటే సాలు దేవుడా అనుకుంటా నానూ లగువెత్తినాను.

"మార్తీ! ఆ వజాన లగువెత్తీ లగువెత్తీ సెర్చి యనకమాలగా యిస్కోలు పక్కమాలగా సందుల్లో, గొందుల్లో బడి పారెళ్ళి వస్తాంటే నువ్విచ్చిన సిల్లర పొట్లం యాడ బోయిందోగానీ పోయిందంతే!

"నిజ్జంగా దలిద్దరపు యదవనే నేను మార్తమ్మా. ఎదవను.

"అట్టా లగువెత్తుతా లగువెత్తుతా వస్తాంటే బీడీ బంకెనకమాల కూకొని కని పిచ్చాడు బెంజిమేను. ప్రేణం లెగిసొచ్చింది. ఆడికాడికెళ్లి రెండు సేతులూ ఎత్తి దండం బెడతా 'దర్మ ప్రేబువా! పోలీసోళ్ళు ఆ వజాన కొడతాంటే పారెల్తూ పారెల్తూ దాపుడు డబ్బుల పొట్లం గూడా పోనూక్కున్నాను. బంకెనకమాల బగవంతుడోలే కని పిచ్చినావు. ఎలచ్చను డబ్బులన్నాయియ్యీ" అని గోస పెట్టి అడిగినాను.

"ఆడేంవన్నాడో ఎరికేనా మార్తీ... 'అరే పేతురుగా! నీయంట మాలంవూలు పోలీసులు బడితే నా యంట మలబారు పోలీసోళ్ళు బడినారు. నాను మాత్తరం లగువెత్త లేదేంటిది. అట్టా లగువెత్తుతాంటే నీకియ్యమని రాంరెడ్డి ఇచ్చిన డబ్బులు యాడ్నో పోనాయింక నన్నేటి సెయ్యవంటావ్' అన్నాడు. నిజ్జంగా సత్తెకాలంగాదే యిది. మనసువంటోళ్ళింక బతకలేరు" అని పేతురు పెద్దగా మూల్గి-

"మార్తీ! పోలీసోళ్ళ దెబ్బలకి వొళ్ళంతా గుల్లయినాది. కొంచెం ఏడ్నీళ్ళు ఎట్టి కాపడం గాయవే" అని అడిగాడు.

మార్తమ్మకు పెద్దగా ఏడవాలనిపించింది. అలా ఏడిస్తే భర్త మరింతగా బేజారవుతాడనీ, ఇంకొంచెం కృంగిపోతాడనీ బలవంతంగా ఏడుపు తమాయించుకుంది.

పొయ్యి దగ్గరికి వెళ్ళి చిదుగుల్ని పొయ్యిలో దూర్చింది. నీళ్ళకుండ పొయ్యి మీద పెట్టింది. అగ్గిపుల్ల గీసింది. చిదుగుల్లో వేసింది. గప్పున అంటుకొని మంటలు లేచాయి. ఆ మంటల్ని చూస్తూ మౌనంగా కూర్చుంది మార్తమ్మ.

మంటల వెల్తుర్లో ఆమె ఎర్రగా వెలుగుతోంది. నూనె దీపాల కాంతిలో గర్భగుడి లోని అమ్మవారికి మల్లేనే!

'యోహాను డబ్బులు ఎలా? ' అన్న ఆలోచనతో లోలోపలే కాలిపోతూ అప్పటికప్పుడు ముత్యాలమ్మ దగ్గరికి వెళ్ళి డబ్బులు తేవాలనీ, ఆ డబ్బుల్ని యోహాను ముఖం మీద కొట్టాలనీ నిర్ణయానికి వచ్చింది మార్తమ్మ.

నీళ్లు బాగా కాగాయి. తెర్లుతూ కుండ అంచులమీంచి పొర్లి పొయ్యిలోకి జారుతూంటే వస్తోన్న శబ్దానికి మార్తమ్మ ఆలోచనలనుంచి తేరుకుంది. నీళ్ళకుండను పొయ్యిమీంచి దించింది. భర్త మంచం దగ్గరికి పాత గుడ్డతో పట్టుకొని వెళ్ళింది.

వేడి నీళ్ళలో గుడ్డను ముంచుతూ తీస్తూ సలుపులు పెడుతోన్న భర్త వంటిమీది పోలీసు దెబ్బలకు కాపడం పెడుతూ మంచం పట్టెమీద కూర్చుంది.

"కాపు గాసినాక నేను ముత్తేలమ్మ కాడికి ఎళ్ళొత్తాను" అంది మార్తమ్మ.

"ఈవరప్పుడా? ఏంటికి? "

"అప్పకాడ డబ్బులెద్చి యోహానుకియ్యాల"

"రేత్తిరికాడ ఏంటిగ్గానీ పొద్దుగాల బో!"

"సెప్తే నీ కర్దంగాదు! ఇందాగ్గూడా అడిగిండాడు"

పేతురు ముఖం వాడిపోయింది. కొంచెం సేపు ఆలోచించి "ఊర్లో అంతా గొడవ గొడవగుంది. కనిపిస్తే బాత్తన్నారా పోలీసోళ్లు. ఎట్టా గెల్తావ్? " అన్నాడు.

"ఆడమడ్సిని నన్నేం సేత్తార్లే. తొందరగా ఎళ్ళొత్తాను" అని కాపు కాయటం పూర్తిచేసి లేచి నిల్చుంది మార్తమ్మ"

"ఏలియాని గూడా యంట తీసకెళ్ళు" అన్నాడు పేతురు.

"అట్టాగే" అని "అరే, ఏలియా! ముత్తేలమ్మప్ప కాడికి ఎళ్ళొద్దాం, పదరా!" అన్నది మార్తమ్మ.

ఏలియా అమ్మ వెంట బయల్దేరాడు.

ఇద్దరూ గుడిసెలోంచి బైటికి వచ్చి ఊళ్ళోకి వెళుతోంటే కందిపుల్లల దడి వెనుకనించి వాళ్ళనే గమనిస్తోన్న యోహానును మార్తమ్మ గమనించనేలేదు.

అతడి కళ్ళు జంతువుకోసం పొంచివున్న పులి కళ్ళకు మల్లే కౄరంగా కనిపిస్తున్నాయి.

★ ★ ★

బాగా చీకటిపడిన తర్వాత అలా ఇంటికి వచ్చిన మార్తమ్మనూ ఏలియానూ చూసి ఆశ్చర్యపోయింది ముత్యాలమ్మ.




"నేనే నీకు రమ్మని కబురు చేద్దామనుకున్నాను. నువ్వే వచ్చావ్" అంది ముత్యాలమ్మ.

"ఏంటి కప్పా?" అడిగింది మార్తమ్మ.

"చెబ్తాలేగానీ ఇంత చీకటి పడ్డాక వచ్చావేమిటి? యోహాను గొడవేనా?"

"అవునే అప్పా! ఇందాక గూడా వొచ్చిండు. ఆడి డబ్బులు ఇయ్యాళ యిద్దావంటే కుదర్లేదు. అన్నింటికీ దలిద్దరంవే మాకాడికి ముందుంటున్నాది. ఏటి సెయ్యాల్నో తోసకొచ్చాను. యోహానుగాడి బాద వొదిల్తేగానీ బువ్వగూడా సయిచ్చేట్టు లేదు. నీకాడ డబ్బుల్దెచ్చి యిత్తానని ఇంటో సెప్పొత్తన్నాను. నువ్వు తోడబుట్టిన అప్పవో, పెబువిచ్చిన అప్పవోగానీ యీ కష్టం గాయవే అప్పా. సచ్చి నీ కడుపున బుడతాను" అంది మార్తమ్మ జాలిగా.

ముత్యాలమ్మ కుర్చీలోంచి లేచింది. బీరువా దగ్గరికి వెళ్లింది. బీరువా తెరిచింది. వంద రూపాయల కాయితాలు ఐదు తెచ్చి మార్తమ్మకిచ్చింది.

అంత డబ్బు చేతిలో పడగానే మార్తమ్మ చేతులొణికాయి. మాట్లాడబోతే గొంతూ వొణికింది. "అప్పా! నీ రుణం తీర్చుకోనీకి ఎన్ని జల్మలైనా సాలవే" అంది గద్గదికంగా.

"మనకూ మనకూ మధ్య రుణాలేమిటి గానీ ఇంక ఆ విషయం ఒదిలేయ్. మనం అసలు విషయంలో కొద్దాం" అని అప్పటి దాకా మూసి ఉంచిన గుప్పెటను మార్తమ్మ ముందుంచి-

"నా చేతిలో ఏముందో చెప్పుకో చూద్దాం" అంది.

"నాకెట్టా తెలుస్తాదే అప్పా?" అంది మార్తమ్మ.

"ఊహించి చెప్పు!"

"మా ఊహలేంటికిలే అది బంగారం అంటే బూడిదైతది. బూడిదంటే బొగ్గయితది. నువ్వే ఏంటిదో జెప్పవే అప్పా" అని అడిగింది మార్తమ్మ.

ముత్యాలమ్మ కిలకిలా నవ్వుతూ గుప్పెట తెరిచింది.

ఆ గుప్పెట్లో ధగధగా మెరుస్తోన్న తెల్లరాయి ముక్కుపుడకను విప్పారిన కళ్ళతో అబ్బురంగా చూస్తూ, "అప్పా... యిదెంత సక్కంగుందే" అన్నది.

ఒక చిన్న ముక్కుపుడక చూస్తేనే ఆమె కళ్ళలో అంత కాంతి, ఆనందం, సంతృప్తి, ఇత్యాది పలురకాల భావాలను వ్యక్తీకరించిన స్పందన సజీవంగా ఇంకా మిగిలివుందంటే వింతగా తోచింది ముత్యాలమ్మకు.

"ఇది నీ కోసమే కొన్నాను" అంది మార్తమ్మ కంటి భావాలను మరింత జాగ్రత్తగా చదువుతూ.

"నా కోసరం కొన్నావా అప్పా?" అంటూ ముత్యాలమ్మవేపు చూసింది మార్తమ్మ.

"అవును. అందుకే నిన్ను రమ్మని కబురు చేద్దామనుకున్నాను. నువ్వే వచ్చావ్. ముక్కుకున్న చీపురుపుల్ల తీసి యీ ముక్కుపుడక పెట్టుకో" అంటూ ముక్కుపుడకను మార్తమ్మ చేతిలో పెట్టింది ముత్యాలమ్మ.

తలవంచుకొని ముక్కుపుడకవేపే ధ్యానంగా చూస్తూ కూర్చుంది మార్తమ్మ.

ఆశలకు వశమై మాయలేడి వెంట జీవితాన్ని పరుగులు పెట్టించాలని ఒక్కక్షణం మార్తమ్మ కూడా అనుకుందిగానీ అంతలోనే మాయనుంచి మనసును మార్గంలోకి లాక్కుంది!

"నాకెందుకులేవే ముత్యాలమ్మప్పా! అన్నీ సక్రమంగుంటేనే వొంటిమీని బంగారమైనా, వొజ్జిరాలైనా మెరుత్తాయి. లేకపోతే అయ్యా మెరవ్వు. నిత్తెం ఏడుస్తా ముక్కుసీదే నాకేంటికా ముక్కుపుడక, అదో అడ్డం" అని తన చేతిలోని ముక్కుపుడకను తిరిగి ఇవ్వబోతే



వారించింది ముత్యాలమ్మ.

మార్తమ్మను నిలువుటద్దం దగ్గరికి లాక్కొని వెళ్ళి అద్దం ముందు నిల్చోపెట్టి, "ఊఁ... తొందరగా ముక్కుకు పెట్టుకో! ఇంకా చాలా పనుంది నీతో" అన్నది ముత్యాలమ్మ.

మార్తమ్మకు తప్పలేదు. ముక్కు రంధ్రం దగ్గర గోటితో గిల్లి చీపురుపుల్లను తీసింది. కిటికీలోంచి బైటపారేసింది. ముక్కుపుడక కాడను రంధ్రంలో దూర్చి సీలను తిప్పి బిగించింది. ఆత్రంగా అద్దంలో చూసుకుంది.

"ముత్యాలమ్మప్పా...! నీ మాట కాదన్లేక పెట్టుకుండాను గానీ బువ్వ లేన్దానికి నాకెందుకీ ముక్కుపుడక? " అన్నది మళ్ళీ

ముత్యాలమ్మ ఆమె మాటలను పట్టించుకోలేదు.

గబగబా వెళ్ళి బీరువాలోంచి మరో చీర తెచ్చి ఇస్తూ "ఈ చీర కట్టుకో" అన్నది ఆదేశించినట్టే.

"మొన్ననేగా అప్పా ఒక సీరె ఇచ్చినావు" అని కొంచెం సందేహిస్తూ నిల్చుంది మార్తమ్మ.

కొత్త చీర ఆమె భుజంమీద వేసి గదిలోకి తోస్తూ "ఇంకేం మాట్లాడబోకు. చెప్పినట్టు వెళ్ళి కొత్త చీర కట్టుకో" అంది ముత్యాలమ్మ.

ఐదు నిముషాల్లో మార్తమ్మ కొత్తచీర కట్టుకొని అలా గదిలోంచి బైటికి వచ్చి ముత్యాలమ్మ ముందు నిల్చుంది.

ముత్యాలమ్మ లేచింది. చేతిలో వున్న మల్లెలు, కనకాంబరాలూ కలగలిపి కట్టిన పూలచెండును మార్తమ్మ సిగలో తురిమి, అమాంతం ఆమెను తనవేపుకు తిప్పుకొని సూటిగా ముఖంలోకి చూస్తూ.

"మార్తమ్మా..." అని పిలిచింది ఎంతో ఆర్ద్రంగా.

ఆ పిలుపులోని మాధుర్యానికీ, ఆత్మీయతకూ మార్తమ్మ చలించిపోయింది.

జీవంకొడిగట్టి, మనసు పొరల్లో ఎక్కడో మేటవేసుకున్న మానవ సంబంధం జీవం నింపుకొని నిద్రలేవగా "ముత్యాలమ్మప్పా...!" అంటూ ఆమె ముందుకు వాలి పాదాలను స్పృశించింది.

ఆ హఠాత్సంఘటనకు ఒక్కక్షణం నివ్వెరపోయిందామె. అమాంతం ముందుకు వంగి మార్తమ్మ జబ్బలు పట్టుకొని పైకి లేపింది. మురిపెంగా ముంగురులు సవరించింది.

"మార్తమ్మా...! నాకు తోబుట్టువుల్లేరు. కార్యకారణ సంబంధాలే తప్ప ఎవ్వరూ నన్నభిమానించరు. మనిషిగా ప్రేమించరు. 'అప్పా...' అన్న ఒక్క పిలుపుకోసం తపిస్తున్న నాకు నీ పరిచయమే మహాభాగ్యం. ఇది నా ఒకర్తె ఇల్లు కాదనీ నీగ్గూడా పుట్టిల్లే అనీ నువ్వు భావిస్తే అంతకన్నా ఆనందం ఉండదు నాకు. మంచి మనుషులతో స్నేహం కుదిరే జీవితం కాదమ్మా నాది. అందుకే ఈ ఆరాటం, అభిమానం" అన్నది ముత్యాలమ్మ కన్నీళ్లు తుడుచుకొంటూ.

ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా కూర్చున్నారు. భావోద్వేగం నుంచి ఆ మౌనం వాళ్ళను బైటవేసింది.

"శానా సీకటైంది. ఇంక ఎల్తానే అప్పా" అంది మార్తమ్మ.

ముత్యాలమ్మ తల ఊపింది.

ఏలియాను వెంటపెట్టుకొని ఇంటికి బైల్దేరింది.

వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎక్కడా నరసంచారమన్న మాటేలేదు. అక్కడక్కడా పగిలిన గాజుపెంకులూ, బాంబులు పేలిన తాలూకు గంధకం మరకలూ, రక్తపు చారికలూ రోడ్డుమీద కనిపించాయి.

ఇద్దరూ వేగంగా నడుస్తున్నారు.

★ ★ ★





మార్తమ్మ ఏలియాను వెంటపెట్టుకొని ఊరివేపుకు వెళ్ళటం చూసిన యోహాను క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా ఇంటికి తాళం పెట్టి పెద్ద పెద్ద అడుగులు వేస్తూ హడావుడిగా ఏసోబు ఇంటికి వెళ్ళాడు.

ఎన్నికల్లో తమ పార్టీకి ఓటమి తప్పదన్న ఆలోచన అతడికీ కల్గిందేమో, ఏసోబు ఇంటిముందున్న అరుగుమీద కూర్చొని ఉన్నాడు దీనంగా.

"ఛీ... ఛీ...! పల్లెలో మన పరువు పోయింది. నాయకుల దగ్గర తల ఎత్తుకొని తిరిగే అవకాశమే లేకుండా పోయింది" అంటూ ఏసోబు పక్కనే అరుగుమీద కూర్చున్నాడు యోహాను.

"పల్లె ఇలా అడ్డం తిరుగుతుందని కలలో కూడా అనుకోలేదు" అన్నాడు ఏసోబు.

"అంతా ఆ పేతురుగాడు చేసిన ద్రోహం యిది. ప్రతీకారం తీర్చుకుంటేనే కనీసం మనల్ని పలుకరిస్తారు నాయకులు"

"ఎలా? " అడిగాడు ఏసోబు.

"మనవాళ్ళను ప్రోగుచేసి దాడికి దిగటమే"

"పేతురుగాడి ఇంటిమీద పడదాం. దొరికిన వాళ్ళను దొరికినట్టు చితకబాది వాడి ఇంటికి నిప్పంటిద్దాం" అన్నాడు ఏసోబు కోపంగా.

"అది తెలివి తక్కువపని!"

"ఎలా? "

"పల్లెలో మనకన్నా వాడి బలగమే ఎక్కువుంది" చెప్పాడు యోహాను.

"మరి ఎలా చేద్దాం? "

"ఏం చెయ్యాలో ఆలోచించే వస్తున్నాను"

"ఆలస్యం దేనికీ? " అని యోహానువేపు చూశాడు ఏసోబు.

"పేతురు భార్య మార్తమ్మ ఇప్పుడే కొడుకును వెంటపెట్టుకొని ఊళ్ళోకి వెళ్ళింది"

"ఐతే? "

"మనం దారికాచి దాన్ని పట్టుకోవాలి. దాన్ని మానభంగం చేస్తేనేగానీ నా కక్ష చల్లారదు"

"మన శత్రువు పేతురుకదా ఆమె జోలికి వెళ్ళటం బాగుంటుందా? "

"ఇదేమీ ధర్మయుద్ధం కాదు, రాజకీయం! మహా భారతయుద్ధంలోనే ధర్మం లేనప్పుడు అలాంటి ఆలోచనలు మనకు అనవసరం. ఏదో ఒకవిధంగా శత్రువును క్షోభపెట్టటమే మన కర్తవ్యం. మార్తమ్మను అలా చేసి వదిలేస్తే పల్లెలో ఇక వాడు తల ఎత్తుకొని తిరగలేడు. దిగులుతో చస్తాడు. పీడ విరగడైపోతుంది..."

ఏసోబు ఆలోచించాడు.

"దాని వెంట ఏలియా ఉన్నాడంటివి కదా!" అని అడిగాడు.

"వాడిదేముందిలే చిన్న కుర్రవాడు. వాణ్ణి నువ్వు దూరంగా లాక్కొనిపో. దాని విషయం నేను చూసుకుంటాను"

"వాడు పోలీసులకు చెబితే? "

"ఇలాంటివన్నీ ఎలక్షన్ కేసులకిందకే వస్తాయి. మనల్ని కాపాడుకోవటం నాయకుల బాధ్యత అవుతుంది. అలాంటి గొప్ప వాళ్ళు మన తరపున రంగంలోకి దిగితే ఏ చట్టమూ మనల్ని ఏమీ చెయ్యలేదు"

"అంతేనంటావా? "

"అంతే"

"సరే! వెళ్దాం పద" అని అరుగుమీంచి క్రిందికి దిగేడు ఏసోబు.

ఇద్దరూ కలిసి మాదిగ పల్లెకూ ఊరికీ మధ్య నున్న ఖాళీ స్థలాలగుండా నడిచి గుబురు పొదల మాటున కూర్చుని రోడ్డువేపుకు దృష్టి సారించి చూస్తున్నారు.

సమయం గడుస్తోంది.

ఆకాశంలో నీలిమబ్బుల చాటు చేసు

కుంటూ చంద్రుడు కంగాళీగా పరుగులు తీస్తున్నాడు. మినుకు చుక్కలు మందంగా వెలుగుతోన్నాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది, పొదలను అంటుకొని 'గీ' పెడుతున్న కీచు రాళ్ళ అరుపులు తప్ప.

"అదిగో! మార్తమ్మ వస్తున్నది" ఏసోబు చెవిలో చెప్పేడు యోహాను.

ఏసోబు అటువేపు చూశాడు. మార్తమ్మ, ఏలియా వేగంగా నడిచి వస్తూ కనిపించారు.

దగ్గరకు రాగానే వాళ్ల మీదికి లంకించి దూకేందుకు సన్నద్ధమౌతూ పొంచి చూస్తున్నారు యోహాను, ఏసోబూ.

వాళ్ళ ఉచ్ఛ్వాస, నిశ్వాసలు పాముబుసల్లా వినిపిస్తోన్నాయి.

ఆ నీరవ నిశ్శబ్దంలో ఆ బుసలు భయానకంగా ఉన్నాయి.

కొంచెం సేపటికి వాళ్ళు దాపులోకి వచ్చేరు. అప్పుడే పొదల్లోంచి బైటికి వచ్చి ఎదురుగా నిల్చున్న యోహానునూ, ఏసోబునూ చూసి స్థాణువులా నిల్చుండిపోయింది మార్తమ్మ!

"మార్తమ్మా... ఎక్కడినించి వస్తున్నావ్?" అని అడుగుతూ దగ్గరికి వచ్చి అమాంతం ఆమెను వొడిసి పట్టుకున్నాడు యోహాను.

"మా అమ్మనొదులు" అని యోహాను వీపుమీద పిడిగుద్దులు గుద్దుతోన్న ఏలియాను నడుం దగ్గర పట్టుకొని అమాంతం భుజం మీదికి ఎత్తుకొని దూరంగా తీసుకొని వెళ్ళాడు ఏసోబు.

"అమ్మా...! అమ్మా..." అని అరుస్తున్నాడు ఏలియా నిస్సహాయంగా.

మార్తమ్మ యోహాను ముఖంమీద గోళ్ళతో రక్కింది. అతడి బాహు పంజరం లోంచి బైటపడేందుకు గిలాగిలా కొట్టుకుంటూ పెద్దగా అరిచింది.

ఆమెకు మళ్ళీ అలా అరిచే అవకాశం ఇవ్వకుండా ఒక చేత్తో బలంగా నోటిని బంధించాడు యోహాను. రెండవ చేతిని ఆమె నడుముకు మెలిపెట్టి పట్టుకొని లేడిని నోట కరుచుకున్న పులిలా పొదల వెనక్కు వెళ్ళిపోయాడు.

"అన్నా... నీకు దండం బెడతా! నీకియ్యాల్సిన డబ్బులు గూడా తెచ్చినానే నన్నిడ్సి పెట్టు" అని ప్రాధేయపడింది మార్తమ్మ, అతడి చేతుల్ని బలంగా పక్కకు తోసి వేస్తూ.

యోహాను విజృంభించేడు! మార్తమ్మను గడ్డి పరకల మీదికి తోసేడు. గుండుదెబ్బ తగిలిన పక్షిలా ఆమె నేలకు ఒరిగింది. వెల్లికిలా పడి అనంతాకాశంలోని గంధర్వుల క్కూడా వినిపించాలనీ, ఎవరో వచ్చి తనను రక్షించాలనీ అన్నంతగా గొంతు చించుకొని అరిచింది.

దిగంతాలు కూడా ప్రతిధ్వనించాయి, ఆమె ఆర్తనాదానికి!

ఆకాశంలోని చంద్రుడూ, నీలి మబ్బులూ, మినుకు చుక్కలూ నివ్వెరపోయాయి!

గాలి స్తంభించింది!

భూమి ఒణికింది!

ఆ ప్రకంపనల పర్యవసానం తన బతుకు కాలిపోవటం అన్నది గ్రహించిన మార్తమ్మ తిరుగుబాటు చేసింది మళ్ళీ!

ఆమెకు సహాయంగా గంధర్వులు రాలేదు. పురాణ పుణ్యస్త్రీల శీల రక్షణలో విలయనర్తనగావించి కాముకులకు కళ్ళెం వేసిన ప్రకృతి కూడా మార్తమ్మను పట్టించుకోలేదు.

సముద్రాలు పొంగలేదు.

భూమి బీటలుబారి అతడా బీటల్లో కూరుకుపోలేదు.

అతడ్ని దావానలం చుట్టుముట్టి ఆపలేదు.

ఆమే తిరగబడింది. తన ఎదమీద తమ కంతో వాలిపోయిన అతడి భుజంమీద రక్తం చిమ్మేలా 'కసిక్కు'న కొరికింది.

యోహాను గావుకేక పెట్టాడు.

భుజంమీంచి కార్తోన్న రక్తాన్ని చూసుకొని ఉన్మత్తుడై, కసి, ఆవేశాలతో ఊగిపోతూ అమాంతం కత్తి తీసి మార్తమ్మ గుండెలో పొడిచేడు.

మార్తమ్మను అలా కత్తితో ఎన్నిపోట్లు పొడిచేడోగానీ ఆమె శరీరం తూట్లుపడి జీవం కోల్పోయి, రక్తపు వరదలో మునిగే దాకా పొడిచి అప్పుడు శాంతించి చూసేడు.

ఆమెలో చలనంలేదు.

హంస ఎప్పుడో ఎగిరిపోయింది.

"త్వరగా కానీ... ఏలియాగాడు తప్పించుకొని పల్లెవైపుకు పరుగుతీశాడు. ఏ క్షణంలో ఐనా పేతురు, పల్లెవాళ్ళూ రావచ్చు" అని యోహాను దగ్గరికి వెళ్ళి చెబుతూ మార్తమ్మ వేపు చూసి గావుకేకపెట్టాడు ఏసోబు.

"ఎంతపని చేశావ్!" అన్నాడు కంగారుపడుతూ.

దివిటీలు కదిలి వస్తోన్నట్టు దూరం నుంచి టూర్చిలైట్లు వేసుకొని వస్తోన్న జనం వేపు చూస్తూ "పారిపోదాం పద" అన్నాడు ఏసోబు.

ఇద్దరూ అదృశ్యమైపోయారు. ముత్యాలమ్మ ఇంటిదగ్గర తేలారు!

★ ★ ★

ముత్యాలమ్మ మార్తమ్మ కొడుకును వెంటపెట్టుకొని ఇంటికి వెళ్ళగానే వారపత్రికలు ముందు వేసికొని చదువుతూ కూర్చుంది. కానీ ఎందుకో మనసు లగ్నం కావటంలేదు.

పత్రికలను పక్కన పెట్టి ఆలోచనల్లో కూరుకొని పోయింది!

మార్తమ్మతో పెనవేసుకున్న అనుబంధం ఆమెకు అద్భుతంగా తోస్తోంది. ఆమె అమాయకమైన చూపులూ, "అప్పా! అప్పా!" అంటూ వెంట తిరుగుతూండే కల్మషరహితమైన ఆమె ప్రేమాభిమానాలూ.

ముక్కపుడక యిచ్చి ఆమె చిరకాలపు కోర్కె తీర్చగలిగినందుకు ముత్యాలమ్మకు చాలా సంతృప్తిగా ఉంది.

ఒళ్ళు విరుచుకొని లేచింది ముత్యాలమ్మ.

సమయం రాత్రి తొమ్మిది గంటలైంది.

ఎప్పుడు కునుకు పట్టిందో! ఎవరో తలుపులు దడదడా బాత్తుంటే మెలకువ వచ్చి లేచి వెళ్ళి తలుపులు తెరచింది ముత్యాలమ్మ.

ఎదురుగా యోహాను, ఏసోబూ కనిపించారు.

ఆశ్చర్యపోయింది!

ఎప్పుడైనా అలాంటి సమయాల్లో యోహాను రావటం జరిగేదిగానీ అతడు మరో వ్యక్తిని వెంటపెట్టుకొని రావటంతో అదోలా చూస్తూ వాళ్ళను లోనికి ఆహ్వానించింది.

"ముత్యాలమ్మా! తలుపులు గడి బిగించిరా! ఇక్కడ మేము ఉన్నట్టు ఎవ్వరికీ తెలియకూడదు" అని చెప్పేడు యోహాను.

అతడు చాలా కంగారుపడుతోన్నట్లు గ్రహించిందామె.

తలుపులు గడి వేసి వచ్చింది.

అందరూ కుర్చీల్లో కూర్చున్నారు.

"భోజనమైందా? " పరీక్షగా యోహానును గమనించి చూస్తూ అడిగింది ముత్యాలమ్మ.

"భోజనమా... వల్లకాడా! అనుకున్నది ఒకటైతే మరొకటి జరిగి పీకలమీదికి వచ్చింది. అందుకే ఏం చెయ్యాలో పాలుపోక యిలా వచ్చాం!" చెప్పేడు యోహాను.

"ఏం జరిగింది? " అడిగింది ముత్యాలమ్మ.

"జరగ్గూడనిదే జరిగింది!"



"ఏమిటో? "

"హత్య!"

ముత్యాలమ్మ ఉలిక్కిపడి సర్దుకొని కూర్చుంటూ "హత్యా? ఎవరు ఎవర్ని చేశారూ... ఎందుకు చేశారూ? " అని అడిగింది, యింకా నమ్మనట్టు.

"హత్య నేనే చేశాను. కావాలని మాత్రం కాదు. ఏదో కోపంలో వళ్ళు మర్చేపోయి కత్తితో దారుణంగా పొడిచి చంపాను"

"ఎవర్ని? " కొంచెం కంగారు పడుతూ అడిగింది ముత్యాలమ్మ.

"మార్తమ్మను!" చెప్పేడు.

విస్ఫోటనంతో చెవులు గళ్ళుపడి, శబ్దానంతర నిశ్శబ్దమే దుర్భరశబ్ద తరంగాలై తలను పిండికొడుతూన్నట్టు వేదనతో తల్లడిల్లిపోతూ పాలిన కళ్ళను విప్పార్చి "మా...ర్త...మ్మ...నా? " అని అడిగింది ముత్యాలమ్మ.

"అవును, మార్తమ్మనే! కానీ చెప్పేనుగా... కావాలని చంపలేదు. అనుభవించాలనుకున్నాను అంతే! ఎదురు తిరిగింది. రాక్షసిలా గోళ్ళతో రక్కింది. భుజంమీద కొరికింది. రక్తం కారింది. ఆ బాధ, కనిపించిన రక్తం నన్ను వివశుడ్ని చేశాయి. అంతే! కత్తితో పొడిచి చంపేను" చెప్పేడు యోహాను.

ఆమె ఎవ్వరికీ కనిపించకుండా రహస్యంగా కళ్ళు తుడుచుకుంది.

"ఇప్పుడు కర్తవ్యం? " అని అడిగింది.

"ఈ నేరం మేము చేసినట్టు పల్లెలో తెలిసే ఉంటుంది. దాని కొడుకు ఏలియా అంతా చూసేడు. ఏసోబు పట్టునుంచి విడిపించుకొని పల్లెకు పారిపోయాడు. కనుక జరిగిందంతా వాడు చెప్పే ఉంటాడు. పల్లె వాళ్ళు టార్చిలైట్లు వేసికొని వస్తోంటే మేమిద్దరం యిలా పారిపోయి వచ్చాం. ఈ రాత్రి గడిస్తే చాలు. రేపు ఎలాగైనా మా నాయకులను కలిసి ఏంచెయ్యాలో ఆలోచిస్తాం" అన్నాడు యోహాను.

ముత్యాలమ్మ నొసలు చిట్లించింది.

"మీరు యిటువైపు వచ్చింది ఎవరైనా చూశారా? " అడిగింది.

"ఎవ్వరూ చూళ్ళేదు"

"ఇక్కడికి వస్తారని ఎవరైనా ఊహించే అవకాశం ఉందా? "

"లేదు"

"పల్లెలో మీ ఇళ్ళమీద దాడులు జరుగుతాయేమో? "

యోహానూ, ఏసోబూ ఆలోచనలోపడ్డారు.

"ఇప్పుడేం చేద్దాం? " అడిగేడు యోహాను.

ఏసోబు కూడా ముత్యాలమ్మవేపు చూసేడు.

"ఒకే ఒక్క మార్గం ఉంది!" అన్నదామె గంభీరంగా.

"ఏమిటది? "

"నేను వెంటనే పల్లెకు వెళ్తాను. అక్కడి పరిస్థితులు గమనిస్తాను. ఒకవేళ ఇళ్ళమీద దాడులు జరిగే అవకాశాలు ఉన్నట్టు కనిపిస్తే ఆ విషయాన్ని వెంటనే వచ్చి మీకు చెబుతాను. ఎంత రాత్రయినా నాయకులను కలవటం తప్పదు. పోలీసు రక్షణ పొందాల్సి ఉంటుంది. అలా దాడులు జరిగే పరిస్థితి లేదనుకో! మనకే మంచిది. నిశ్చింతగా యీ రాత్రి ఇక్కడ గడిపి పొద్దున్నే ఏదో ఒకటి చెయ్యొచ్చు" అని ముత్యాలమ్మ ఏసోబువేపు సాలోచనగా చూస్తూ.

"యోహానుగారింట్లో ఎవ్వరూ లేరు గనుక దాడి జరిగినా మనుషలకేమీ ప్రమాదం ఉండదు. మహా అయితే గుడిసె కాల్చేస్తారంతే! కానీ మీ యింట్లో అందరూ ఉన్నారు కదా! వాళ్ళకు చాలా ప్రమాదం" అంది.

ఆమె ఆలోచనతో ఏకీభవించాడు





ఏసోబు.

"నువ్వన్నదీ నిజమే! ఆలస్యం చెయ్యకుండా మాదిగ పల్లెకు వెళ్ళిరా, ముత్యాలమ్మా! వీలుంటే మావాళ్ళను అక్కడినుంచి ఎటో తప్పించు. నీ సహాయం మర్చిపోను" అంటూ అభ్యర్థనగా, జాలిగా చూసేడు.

"వెళ్ళిరానా? " యోహాన్ను అడిగింది ముత్యాలమ్మ.

అంగీకారంగా తల ఊపేడు యోహాను.

ముత్యాలమ్మ పైకి లేచింది. లోపలిగది లోకి వెళ్ళి రెండునిముషాల్లో విస్కీసీసా, గ్లాసులూ పట్టుకొని తెచ్చి బల్లమీద పెట్టింది.

"ఫ్రిజ్‌లో కోడికూర వేపుడుంది. అన్నం, రొయ్యల పులుసూ ఉంది. మీరిద్దరూ ఆ మందు త్రాగి హాయిగా భోంచేసి పడుకోండి. అక్కడున్న హడావుడినిబట్టి త్వరగానే వచ్చి నిద్రలేపుతాను. ఒకవేళ అలాంటిదేం లేకపోతే ఆలస్యంగా వచ్చినా కంగారుపడకండి" అని చెప్పింది ముత్యాలమ్మ.

"త్వరగా వెళ్ళు!" అని ముత్యాలమ్మకు చెప్పి గ్లాసుల్లో మందు వొంపేడు యోహాను.

"లోపల గడివేసుకుంటారా? ఇంట్లో ఎవరూ లేనట్టు బైట తాళంపెట్టి వెళ్ళేదా? " గడప దగ్గర నిలబడి లోపలికి తొంగిచూస్తూ అడిగింది ముత్యాలమ్మ.

యోహాను క్షణం ఆలోచించాడు.

"బైట తాళంవేసుకొనే వెళ్ళు. ఎవ్వరికీ అనుమానం రాదు. ఒకవేళ మందుతాగి మేము నిద్రపోయినా తాళం తీసుకొని రావచ్చు" అన్నాడు.

ముత్యాలమ్మ మళ్ళీ లోపలికి వెళ్ళింది. తాళం కప్పను చేతపట్టుకొని బైటికి వెళ్ళింది. తలుపులువేసి తాళంపెట్టింది. తాళంచెవిని జాకెట్లో దోపుకుంది.

ఆమెకు గుండె లోతుల్లోంచి అప్పుడు పొంగుకొచ్చింది దుఃఖం.

ధారాపాతంగా కన్నీళ్ళు కారుస్తూ వీధి చివరిదాకా పరుగెత్తి వెళ్ళి రిక్షాకోసం నలువైపులా చూసింది.

ఎక్కడా రిక్షా కనిపించలేదు. జనసంచారంలేదు. వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి.

అంతే...! క్షణం ఆలస్యం చెయ్యలేదు. సంధించి విడచిన బాణంలా మాదిగపల్లెవేపుకు పరుగుపరుగున దూసుకొని వెళ్తోంది.

మధ్యమధ్యలో కన్నీళ్ళు తుడుచుకుంటూ ఊరు దాటింది. ఊరి వెలుపలి శ్మశానం దాటింది. పంట పొలాలనూ, కాలువ గట్లనూ దాటి మాదిగపల్లె దాపుకు వెళ్ళింది.

పల్లెకు కొంచెం యివతలగా గుబురు పొదల దగ్గర జనసంచారం లీలగా కనిపించి ఒక్కక్షణం ఆగి అలుపు తీర్చుకుంటూ చూసింది.

పొదల వెనుక టార్చిలైట్లు వెలుగుతున్నాయి.

జనం గొడవగొడవగా మాట్లాడుకుంటున్నారు. ఆ శబ్దం గాలివాలుకు స్పష్టంగా వినిపిస్తోంది.

చెవులు రిక్కించి వింది ముత్యాలమ్మ.

"పోలీసోళ్ళకాడికి యెల్దాం పదండి"

"ఆళ్ళేటి జేస్తారూ! నాలుగు దినాలు నల్లకతిని కోరుటుకి బెడ్తారు. కళ్ళతోన సూసి నోడు లేడంటూ, సాచ్చీకాలు లెవ్వంటూ కోరుటోళ్ళు కేసు కొట్టేత్తారు. దాంతో యిక సరి! అట్టా యిది తేలేటి యవ్వారం కాదు గానీ ఎతుకుదాం పదండి. యోహానుగాడ్నీ, ఏసోబుగాడ్నీ నరికి సంపుదాం పదండి!"

"నలుగుర్లోబడ్డ పాము గూడా సావదంట. అన్నిటికీ అంత తొందరెందుకురా? "

అలా మాటలు వినిపించేయి.

ముత్యాలమ్మ రోడ్డుదిగి అటువేపుకు వెళ్ళింది. సుమారు యాభైగజాలదూరం

వెళ్ళేక అక్కడ నేలమీద కూర్చొని కనిపిం చేడు పేతురు.

అతను మార్తమ్మ శవం వేపే కన్నార్ప కుండా చూస్తూ మధ్యమధ్యలో ఎక్కిళ్ళుపెట్టి ఏడుస్తూ "మార్తీ...! మార్తీ...!!" అని పిలుస్తూ శవాన్ని కదిలిస్తూ నేలనల్లుకొని ఏడుస్తూంటే ఆ స్థితిలో పేతురునూ, రక్తపు ముద్దలా కనిపిస్తున్న మార్తమ్మనూ చూసి చలించిపోయింది ముత్యాలమ్మ. కన్నీళ్ళు తుడుచుకొంటూ మరి కొంచెముందుకు వెళ్ళి చేత్తో పేతురు తల నిమిరింది.

ఆ స్పర్శ స్వాంతనే కల్గించిందో, గుండె చలమను తవ్వి ఆవేదననే ఊరించిందోగానీ ముత్యాలమ్మవేపు చూస్తూనే బావురుమని ఏడుస్తూ ఆ దుఃఖపు పొంగు కాస్తంత శాంతించగానే.

"ముత్తేలమ్మ తల్లే... నీ సెల్లి బతుకు బుగ్గైపోనాది. అది దేవతోలే దేవుళ్ళలో కలిసిపోనాది. ఏలియా జెప్పిండు, దానికి ముక్కుపుడకే బెట్టినావో, కొత్తకోకే గట్టినావో, తల్లో పూలెట్టినావో అటు సూడు తల్లే... ముత్తేలమ్మా! నువ్విచ్చిన ముక్కుపుడక ఎట్టా మెరుస్తోందో! నువ్విచ్చిన గళ్ళకోకగట్టి, ముక్కుపుడకెట్టి, తల్లో పూలెట్టుకుంటే నీ సెల్లి ఎట్టాగా ఎలిగిపోతాందో సూడు, అచ్చుం రుసుల మద్దెనున్న అరుందతమ్మోలే!" అని గుండెలు బాదుకొని ఏడ్చి

"దాని బతుకు సక్కదిద్దాలని కుట్టే నేర్పినావో, ఉద్దెరగా మిశనే యిచ్చినావో, కోకలూ, రెయికలూ, ముక్కుపుడకా బెట్టినావో అస్మంటి నీ సెల్లిని బొందలో బూడవాల్సొచ్చినాదే. ముత్తేలమ్మ తల్లో! నువ్వు దానికి అప్పవిగాని అప్పవి. అమ్మవుగాని అమ్మవి. శానాసార్లు అది అన్నాదిగదా.

"శాత్రాలు జెప్పేవోళ్ళూ, మంచికీ, శబ్బరకీ సూత్తరాలు జెప్పేవోళ్లూ, పొద్దుగాల్లెగిస్తే పూజలు జేస్తా పక్కింటిదాని రంకులు సెబుతా తీరిన యాళల్లో కాలచ్చేపం జేసేవోళ్ళూ. యావయ్యోవ్! యీ ప్రెపంచకంలో మంచోళ్ళ కింద శలామణయ్యే శానా మందికన్నా అందరూ శబ్బరదనే మా ముత్తేలమ్మప్పే గొప్పదన్నది.

"అసువంటి నీ సెల్లిని సంపినారే, ముత్తేలమ్మతల్లే" అంటూ బావురమని ఏడ్చేడు పేతురు.

ముత్యాలమ్మ కూడా ఎక్కిళ్ళుపెట్టి ఏడుస్తూ శవం తలదగ్గర కూర్చొని మార్తమ్మ తలను వడిలో పెట్టుకుంది.

మార్తీ...! లెగవ్వే... నీ కొరకు ఎవురెవురు వొచ్చినారో సూడూ! మీ ముత్తేలమ్మప్ప వొచ్చినాది. నీ మొగుడూ, ముగ్గురు బిడ్డలూ యీడ్నే ఉండారు. మాదిగ పల్లెంతా వొచ్చినాది. నా కోసం గాకుంటే ఆళ్ళకోసమైనా లెగవ్వే మార్తీ!" అంటూ శవాన్ని పట్టుకొని మళ్ళీ కదిపేడు పేతురు.

"అవున్లే లెగవ్వు నువ్వు. లెగిస్తే నా ముకం సూడాలగదా! లగ్గమైన కాడ్నించి యియ్యాల్టిదాంకా ముక్కుపుడక గొనలేనోణ్ణి. బీదింటి పేతుర్ని. నీ తోడుగా నిజ్జం మార్తీ! ముక్కుపుడక కొందావనే గందా, అన్నిసార్లు ముంతలో సిల్లర్దాపెట్టినాది. ముక్కుపుడక గొందావనే గందా, సచ్చిన గొడ్డుకోసరం కొట్లాటకి పోనాది. ముక్కుపుడక గొందావనే గందా, ఎలచ్చన్లో దిరిగి పోలీసోళ్ళశాత సావుదెబ్బల్తింది.

"బంగారు లేడికోసరం సీతమ్మోరూ, సీతమ్మోరి కోరికె తీర్చేందుకు రావులోరూ కోరి కట్టాలు దెచ్చుకుండట్టే మనవూ ఎన్ని అగసాట్లు దెచ్చుకున్నావే మార్తీ!

"నా దెబ్బలకి ఏడ్నీళ్ళ కాపు గాసినావు. అప్పకాడ డబ్బుల్దెచ్చి యోహాను కిత్తానని ఎళ్ళినావు. అప్ప యిచ్చిన మిశన్తో గుడ్డలు గుట్టి సంసారం నడిపిత్తానన్నావ్.

"ఇక నాకు ధైర్నం జెప్పేదెవురు? బువ్వెట్టేదెవురు? నాకాడి డబ్బుల్దీసి ముంతలో దాపెట్టేదెవురు? ఇంతజేసినా యోహాను




గాడి ఇల్లు కాలుత్తావుంటే వొద్దనీ, ఏసోబు యింటిమీనబడి అందర్నీ సావగొడతావంటే వొద్దనీ ఆపినానే... నా అసువంటోడికా యిసువంటి కష్టం మార్తీ!" అంటూ పేతురు గోడుగోడున ఏడుస్తూంటే.

అందరి కళ్ళకుమల్లే అక్కడి పొదలు గూడా చెమ్మగిల్లేయి!

"అట్టా యాడవగాకురా, పేతురూ! ఏడిత్తే మాత్తరం సచ్చిన మడిసి లెగిసొచ్చుదా? లెగు...లెగు... పోలీసు కేసెట్టి యవ్వారం సూడు!"

అందుకు పేతురు పగలబడి నవ్వేడు!

"నాకు కేసులమీనా, సట్టాలమీనా, సర్కారుమీనా యిస్వాసం లేదు. ఇదే గోరం యింకెవుడైనా సేత్తే పేపరోళ్ళు తొలి పేజీలో యాస్తారు. రేడియోలో, టీవీలో సెప్తారు. సట్టాలు జేసే సబల్లో నిలదీసి అడుగుతారు. పోలీసోళ్ళొచ్చి కాపలాలు గాస్తారు. లీడర్లొచ్చి మీటింగులు దంచుతారు. పేతురుకు జరిగిన అన్నేలం ప్రెపంచకానికి జరిగిన అన్నేలం అంటారు. మార్తమ్మ కూనీతో దర్మం సచ్చిందంటారు.

"ఈడ జరిగిందదిగాదు! ఇంటోవోడే కంట్లో పుల్లెట్టాడని నావోడే నాకు అన్నేలం జేసిండు. మార్తమ్మను సంపిండు. ఇది పేపరోళ్ళు తొలి పేజీలో ఎయ్యరు. రేడియోల్లో, టీవీల్లో జెప్పరు. సట్టాలు జేసే సబల్లో నిలదీసి అడగరు. లీడర్లొచ్చి మీటింగులు దంచరు. పేతురుకు జరిగిన అన్నేలం ప్రెపంచకానికి జరిగిన అన్నేలం అనరు. మార్తమ్మ కూనీకీ, దర్మం సావటానికీ సమ్మందం జెప్పరు.

"సంపినోళ్ళనూ, సచ్చినోళ్ళనీ బట్టి కేసులుంటయ్యిగానీ గొప్పోళ్ళ దర్మంలో యిది శానా మామూలు కేసు!

"అందుకే నాకు కేసులమీనా, సట్టాలమీనా, సర్కారుమీనా యిస్వాసం లేదు. నాకుండ యిస్వాసవల్లా రగతానికి రగతం! కూనీకి కూనీ!" అని పెద్దగా అరిచి పక్కన పెట్టుకున్న వేట కొడవలిని చేత్తో అందుకొని అమాంతం లేచి నిల్చున్నాడు పేతురు.

అతడి ప్రవర్తనకు అందరూ నిర్ఘాంతపోయారు!

"అరే... యోహానూ!" అంటూ గర్జించేడు.

అందరికీ గుండెలు అవిసిపోయాయి.

వేటకొడవలిని పిడికిట బిగించి పట్టేడు.

పొదల్లో సుళ్ళు పడుతోన్న గాలి యీలల నేపథ్య మృత్యుగానం వెంట అతడలా సాగిపోతోంటే, ఎటునుంచో రివ్వున దూసుకొని వచ్చిన ఏలియా 'దబ్బు'న కిందపడి తండ్రి రెండు కాళ్ళనూ పెనవేసుకున్నాడు.

తూలి పడబోయి తమాయించుకొంటూ కొడుకువేపు కోపంగా చూసేడు పేతురు.

అతడి కనుబొమలు కదిలేయి. ముక్కుపుటాలు కంపించేయి.

"కొడుకా... ఏలియా! నువ్వే ఆపుతుండావా నన్ను? " అని అడిగేడు, అది ప్రకృతి విరుద్ధం అన్నంత నమ్మకంగా.

ఏలియా పెద్దగా ఏడుస్తూ "అయ్యా... నువ్వెళ్ళగాకే! యోహాన్ను సంపగాకే!" అన్నాడు బతిమాలుతూ.

"ఆళ్ళు సంపింది నా పెండ్లాన్నేగాదురా... అది మీ అమ్మగూడా!" అంటూ పేతురు కాళ్ళమీంచి ఏలియాను విదిలించబోయేడు.

అతడి కాళ్ళను వదల్లేదు ఏలియా. పట్టు సడలిపోకుండా మరింత బలంగా పెనవేసుకొంటూ.

"అయ్యా! వాళ్ళని సంపి నువ్ జేలుకుబోతావే? " అని అడిగేడు దీనంగా. "అట్టాగా నువ్వు జేలుకు బోతే మేవు యీదిన బడతాం. ఆకలి సావులు సస్తాం. సెల్లాయి సిన్నది. ఆడూ పెద్దోడుగాదు. ఆళ్ళని నామీన వొదిలి జేలుకుబోతావా అయ్యా? నువ్వు సెప్పులుగుట్టి డబ్బులు తెస్తుంటేనే

ఏంటికీ సాల్టంలేదు. అమ్మకి ముక్కుపుడక, సెల్లికి పలకా, బలపవే గొన్లేక పోనావు. అసువంటిది నువ్వే జేలుకుబోతే ఇల్లెట్టాగా గడుసుద్దే అయ్యా? " అంటూ బావురుమని ఏడ్చేడు ఏలియా.

జీవంలేని కళ్ళతో శూన్యంలోకి చూస్తూ కొంచెం సేపు ఆలోచించి, చేతిలో వున్న వేట కొడవలిని దూరంగా విసిరేడు పేతురు. అమాంతం కిందికి వొంగి ఏలియా భుజాలు పట్టుకొని పైకి లేపేడు.

"బిడ్డా... ఏలియా!" అని ఎక్కిఎక్కి ఏడ వసాగేడు.

ముత్యాలమ్మ దగ్గరికి వచ్చింది. ఏలియా తలమీద ఆప్యాయంగా నిమురుస్తూ "చిన్నవాడివే అయినా ఎంత పెద్ద ఆలోచన నీది!" అంది అభినందనగా.

ఆమె కళ్ళు మందారాలయ్యాయి. గిల్లిన జిల్లేడు కొమ్మలూ అయ్యాయి. కర్తవ్యంలోకి తొంగిచూస్తూ తల పంకించింది ముత్యాలమ్మ!

★ ★ ★

ఎస్సై లోకనాథం నలుగురు కానిస్టేబుళ్ళను ఎక్కించుకొని జీపులో ఊరంతా పహరాకాస్తూ మాదిగ పల్లెవేపుకు వెళ్ళమని డ్రైవర్ను ఆదేశించాడు.

జీపు అటువేపుకు తిరిగింది. మాదిగపల్లె రోడ్డుగుండా వేగంగా వెళ్తోంది.

"సార్! అక్కడెవరో జనం ఉన్నట్టుంది" అని లోకనాథంతో చెప్పేడు జీపు వెనుక కూర్చున్న కానిస్టేబులు.

"జీపు ఆపు!" అన్నాడు లోకనాథం డ్రైవరుతో.

జీపు రోడ్డువారగా ఆగింది.

జీపులోంచి అందరూ కిందికి దిగేరు. అక్కడినుంచే తల ఎత్తి దూరంగా చూసేడు లోకనాథం.

కానిస్టేబులు చెప్పింది నిజమే! అక్కడ గుబురు పొదల దగ్గర జనం కనిపించారు.

టార్చి లైట్లు కూడా వెలుగుతూన్నాయి.

లోకనాథం కానిస్టేబుళ్ళను వెంటపెట్టుకొని అక్కడికి వెళ్ళాడు.

రక్తపు మడుగూ, మార్తమ్మ శవం, శవం దగ్గర జనం, యింకా గువ్వలా వొదిగి కూర్చొని పొర్లిపొర్లి ఏడుస్తున్న పేతురూ, కొంచెం దూరంలో ముత్యాలమ్మా.

పేతుర్ని వెంటనే గుర్తు పట్టేడు ఎస్సై లోకనాథం.

లాఠీతో అతడ్ని తట్టి పిలిచి "ఏం జరిగింది? " అని అడిగేడు.

"కూనీ... కూనీ సేసినారు సారూ... నా పెండ్లాం మార్తమ్మనీ..." అని, చివాల్న లేచి నిలబడి "సారూ...! దేవతలకన్నా ఒక్కోపాలి ఆగ్గరంవొస్తాదేవోగానీ ఆగ్గరం అంటేనే తెలవని మంచి మడిసి నా మార్తమ్మ. అసువంటిదాన్ని అన్నేలంగా సంపినారు. ఆయాళ దేవసహాయాన్ని గొట్టి నాను. టేశన్లో బడితే తవరూ, తవరి పోలీసోళ్ళూ లాటీల్తోన గొట్టి సట్టం సేతులు పొడుగన్నారు. ఎవ్వురైనా సరే సట్టానికి తలొగ్గాలన్నారు. ఇయ్యాళ నానడుగుతుండాను సారూ. సట్టం సేతులు పొడుగే అయితే, ఎవ్వురైనా సట్టానికి తలొగ్గేదయితే మార్తమ్మని సంపినోళ్ళని జేల్లో బెట్టండి. లాటీల్తోన గొట్టండి. కోరుట్లో యిశారిచ్చి జల్మ కైదు సెయ్యండి" అని పేతురు చెప్తోంటే.

"మార్తమ్మని చంపిందెవరు? " అని అడిగేడు లోకనాథం.

"యోహాను!" అన్నాడు పేతురు.

"యోహానా? " ఆశ్చర్యంగా అడిగేడు లోకనాథం.

"అవును సారూ... ఆడూ, ఏసోబూ గలిపి యింత గోరం శేశారు"

"ఆరోజు నిన్ను విడిపించిన ఎం.పీ.గారి మనిషేనా నువ్వు చెప్తోన్న యోహానంటే? "

"అవును సారూ, వాడే!"

లోకనాథం నమ్మనట్టు ముఖం చిట్లించేడు. "పేతురూ! నిజం చెప్పు. నీకోసం అంత శ్రమపడి విడిపించిన ఎం.పీగారి మనిషిమీద అభాండాలు వెయ్యకు" అని "సరే! యోహానూ, ఏసోబూ కలిసి నీ భార్యని చంపేరనటానికి సాక్ష్యం ఉందా? ఎవరైనా చూసినవాళ్ళున్నారా? " అడిగేడు లోకనాథం.

అందరూ వాళ్ళ చర్చను నిశ్శబ్దంగా వింటున్నారు.

"బిడ్డా... ఏలియా!" అని కేకవేసేడు పేతురు. కొడుకు కోసం చుట్టూ చూసి, ఎంతకూ ఏలియా కనిపించకపోయేసరికి,

"పోలీసుదొరా! సచ్చిన నా పెండ్లాం పీనిగెసాచ్చిగా నే జేప్పేదంతా నిజ్జం. మార్తమ్మా, మా అబ్బాయి ఏలియా గలిసి ముత్తేలమ్మ యింటికి బోయినారు. ఆడ్నించి సీకట్లో వస్తాంటే సరిగ్గా యీడకి రాంగానే మార్తమ్మని పట్టుకుండాడు యోహాను. నా బిడ్డ అడ్డంబోతే ఏసోబు గాడు ఆడ్ని దూరంగా గుంజకపోనాడు. ఆడు తప్పిచ్చుకొని పల్లెకొచ్చి సెప్పంగానే అందరం లగువెత్తి వొచ్చి సూత్తే రగతంలో సచ్చి పడుండాది మార్తమ్మ"

"నువ్వు చెప్పేది అబద్ధం!" గర్జించేడు లోకనాథం.

"ఎందుకు అబద్ధం అంటే మీవాడు ఏసోబును తప్పించుకొని పల్లెకు పరుగెత్తేడు కానీ యోహాను మార్తమ్మను చంపటం చూళ్ళేదు. పైగా అతను నీకు సహాయం చేసిన మనిషి. నువ్వు లాకప్పులో వుంటే నీకోసం అతను అట్టు కూడా తెచ్చాడు. అది తిన్ననాకే యింత విశ్వాసం వుంటే నీకోసం అంత చేసిన మనిషిమీద నీకెంత విశ్వాసం ఉండాలి! కానీ నీకు లేదు. ఏదో దురుద్దేశంతో ఎం.పీగారి మనిషిమీదే నేరం మోపుతున్నావ్" అని ఎస్సై లోకనాథం యీ విశ్వాసంలేని ప్రపంచంమీదనే విరక్తి కలిగినట్టు నిట్టూర్చేడు.

అప్పుడు కల్పించుకుంది ముత్యాలమ్మ! "ఎస్సైగారూ! మీరు ఏమైనా అనుకోండిగానీ జరిగింది మాత్రం అది. పేతురు, ఏలియా చెప్పినట్టు కేసు రాసుకొని నేరస్తులను అరెస్టు చెయ్యటం, విచారించటం మీ విధి. సాక్ష్యాల విషయం కోర్టు చూసుకుంటుంది"

"ఐతే యిక మేమెందుకున్నట్టూ? " సహనం కోల్పోయి కోపంగా అన్నాడు లోకనాథం.

"ఫిర్యాదిదారుడు యిచ్చిన సమాచారం మేరకు ముద్దాయిలను పట్టుకొచ్చి విచారించాల్సిన బాధ్యత మీదికాదా? " అడిగింది ముత్యాలమ్మ.

"మాదే!"

"మరి పేతురు చెప్పిందాన్ని యిక్కడే ఎందుకు ఖండిస్తున్నారు? "

"అది మా విచారణలో భాగం"

"దాన్ని యిలాగే కొనసాగిస్తారా, ముద్దాయిలను పట్టుకుంటారా? "

లోకనాథం సహనం పూర్తిగా నశించిపోయింది. అప్పటిదాకా అంత ఓపికగా ఎందుకు మాట్లాడేడంటే అక్కడొక హత్య జరిగింది. జనం ఆవేశంలో వుంటారు. పైగా ముద్దాయిలు ఎం.పీ.గారి మనుషులు కనుక సమస్యను జాగ్రత్తగా తెంచాలని అనుకున్నాడు కనుకనే.

కానీ అధికారంతో సంక్రమించిన తన అహం దెబ్బతినే వాతావరణాన్ని ఎస్సై లోకనాథం సహించలేకపోయాడు.

అందుకే అందర్నీ ఒకసారి కోపంగా కలియచూసి, చూపుల్ని ముత్యాలమ్మమీద నిలుపుతూ,

"ఏది ఎలా చెయ్యాలో మాకంతా తెలుసు! చట్టం చేతులు చాలా పొడుగు. ఎవ్వరూ దాన్నించి తప్పించుకోలేరు" అని,

"ఒక కానిస్టేబుల్ను యిక్కడ కాపలా పెట్టి వెళ్తాను. పొద్దున్నే జరగాల్సిన తతంగం పూర్తిచేసి శవాన్ని పోస్టుమార్టానికి పంపిస్తాను. నేరస్తులను విడిచిపెట్టం. మీరు మాత్రం ప్రశాంతంగా ఉండాలి. భిన్నంగా ప్రవర్తించారో మీక్కూడా చట్టాన్ని రుచి చూపిస్తా" అన్నాడు బొంగురు గొంతుతో.

"నేరస్తులను ఎప్పుడు పట్టుకుంటారు?" అడిగింది ముత్యాలమ్మ.

"వాళ్ళు నేరస్తులో కాదో ముందుగానే మేం ఒక నిర్ణయానికి రాం"

"మరి?"

"వాళ్ళు దొరికితే అనుమానంమీద అదుపులోకి తీసుకుంటాం. విచారించిన తర్వాతనే వాళ్ళను నేరస్తులుగా భావిస్తాం. అది కూడా సాక్ష్యాధారాలు దొరికితేనే" చెప్పాడు లోకనాథం.

"ఐతే యోహానునూ, ఏసోబునూ అరెస్టు చెయ్యండి" అంది ముత్యాలమ్మ.

"అదే ప్రయత్నంలో ఉంటాం"

"వాళ్ళిద్దరూ ఎక్కడున్నారో చెబితే అరెస్టు చేస్తారా వెంటనే?"

"నీకు తెలుసా, వాళ్ళు ఎక్కడ ఉన్నారో?"

"తెలుసు"

"ఐతే చెప్పు. ఎక్కడ ఉన్నా వాళ్ళను పట్టుకుంటాం" అని దర్పంగా చూశాడు లోకనాథం.

"అలా అయితే తప్పకుండా చెబ్తాను"

"ఊ... చెప్పు"

"ఎం.పీ.గారింట్లో" అంది ముత్యాలమ్మ దృఢంగా.

లోకనాథం ముఖం కాంతివాడింది. తన లోతనే ఏదో గొణుక్కున్నాడు. ఏమనుకున్నాడో ఏమోగానీ కొంచెం విరామం తర్వాత "చట్టం చేతులు చాలా పొడుగు" అని సిబ్బందిని వెంటపెట్టుకుని హడావుడిగా వెళ్ళిపోయాడు.

వాళ్ళు అటు వెళ్ళగానే "యోహానూ, ఏసోబూ ఎం.పీ.గారి ఇంట్లోనే ఉండారా?" అని ముత్యాలమ్మను అడిగాడు పేతురు.

"ఊ..." అంది ముత్యాలమ్మ.

"ఆడికెళ్ళి పోలీసోళ్ళు పట్టుకుంటారంటావా?"

"ఊహూ..." అంటూ ముత్యాలమ్మ చేతి గడియారం చూసుకుంది.

తను వచ్చి చాలా సేపైంది. అక్కడ యోహాను, ఏసోబూ తనకోసం ఎదురుచూస్తుంటారు.

ఏది ఏమైనా యింకా తను వెళ్ళకుండా ఆలస్యం చేస్తే యోహాను కోపగిస్తాడని ఆలోచించింది ముత్యాలమ్మ. ఇంటికి వెళ్ళేందుకు సిద్ధమై చివరిసారిగా మార్తమ్మ శవాన్ని చూసేందుకు దగ్గరికి వెళ్ళి నిల్చుంది.

నిర్జీవంగా పడి వున్న మార్తమ్మ ముఖంలోకి చూసింది.

చెవుల్లో ఏదో జలపాతపు హోరు.

గుండెలో అగ్నిపర్వతపు విస్ఫోటనం.

ఆమె చెంపలగుండా రెండు కన్నీటి బొట్లు జారి కింద రాలేయి.

కళ్ళు తుడుచుకుని "వెళ్ళొస్తాను" అంది పేతురుతో.

పేతురు మౌనంగా చూస్తూ ఉండిపోయాడు.

ముత్యాలమ్మ భారంగా అడుగులు వేస్తూ వెళ్ళిపోతోంది.

గుబురు పొదలు దాటింది. 'నాది' అని భూమికి గిరులు గీసుకున్న పంటపొలాల గట్లు దాటింది. మినుకు చుక్కల కాంతిలో కాలిబాట వెంట చివరికంటా నడిచి రోడ్డు ఎక్కింది. నడక వేగం పెంచి ఊరివేపుకు సాగిపోతోంది.

అలా కొంచెం దూరం వెళ్ళి వెనక్కు తిరిగి




చూసింది ముత్యాలమ్మ.

దూరంగా తనను అనుసరించి వస్తోన్న ఓ మానవాకారాన్ని చూసి తృప్తిగా గాలి పీల్చుకుని ముందుకు కదలిపోయింది.



ముత్యాలమ్మ ఇంటికి చేరుకుంది. తాళం తీసి తలుపులు తెరిచి లోపలికి వెళ్ళింది.

తలుపులు తెరచుకున్న శబ్దానికి అప్పటి దాకా సోఫాల్లో పడి కలతనిద్రపోతోన్న యోహానూ, ఏసోబూ ఉలిక్కిపడి లేచారు.

ముత్యాలమ్మను చూసి వాళ్ళ గుండెలు కుదుటపడ్డాయి.

"ఇంత ఆలస్యమైందేం? " అడిగాడు యోహాను.

"అక్కడ గొడవేమీ లేదుకదా? " అంటూ ముత్యాలమ్మవేపు ఆతృతగా చూశాడు ఏసోబు.

"గొడవేంలేదు. వాళ్ల దుఃఖంలో వాళ్ళున్నారు గానీ ఎవ్వరూ కేసుగురించీ, మిమ్మల్ని గురించీ పట్టించుకోవడంలేదు"

"పోలీసులకు తెలిసిందా? "

"తెలిసింది. ఎలా తెలిసిందోగానీ పోలీసులు వచ్చారు. పేతురు మీమీద ఫిర్యాదు చేశాడు. కానీ వాళ్ళు నమ్మలేదు. ఎం.పీ.గారి మనుషులమీద అభాండాలు వెయ్యవద్దని మందలించి వెళ్ళారు"

"ఏలియా ప్రత్యక్షసాక్షికదా"

"అయితేనేం! వాళ్ళు మీపట్లనే అభిమానం చూపిస్తున్నారు. అంతమాత్రాన పోలీసులను నమ్మటానికి వీల్లేదు. మిమ్మల్ని పట్టుకొని విచారిస్తామని పల్లెవాళ్ళతో చెప్పి వెళ్ళారు"

యోహానూ, ఏసోబూ ముఖాలు చూసుకున్నారు.

"పోలీసులు యింకా ఏమన్నారు? " అడిగాడు యోహాను.

"మీరిద్దరూ ఎం.పీ.గారి యింటిదగ్గర ఉండి ఉంటారని చెప్పాను. అందువల్ల వాళ్ళు మీకోసం అక్కడికి వెళ్ళవచ్చునేమో"

"ఎం.పీ.గారికీ విషయం తెలిసేది ఎలా? మనం ఆయన సహాయం పొందేది ఎలా, అక్కడికి వెళ్ళాలికదా! వెళ్తే పోలీసులు..."

"మీరు యిక్కడే యీ రాత్రి గడపటం శ్రేయస్కరం. పొద్దున్నే ఎం.పీ.గారి దగ్గరికి నేను వెళ్తాను. విషయం చెప్పి సహాయం అడుగుతాను. వారు హామీ యిచ్చాక మాత్రమే మీరు యిక్కడ్నుంచి కాలు కదపాలి. లేకపోతే పొరపాటున పోలీసులకు చిక్కితే కొన్ని యిబ్బందులుంటాయి! వాళ్ళు మీకు సహాయం చెయ్యాలనుకున్నా ఆ యిబ్బందులు తప్పవు" అంది ముత్యాలమ్మ.

యోహాను కొంచెంసేపు ఆలోచించాడు.

ముత్యాలమ్మ చెప్పింది అతడికి సబబుగానే తోచింది.

ఎం.పీ.గారి సలహా తీసుకోకుండా ఏ పనీ చెయ్యకూడదు. ఆయనతో సంప్రదింపులు జరిగాక అంతగా అవసరమైతే న్యాయస్థానాలలో కూడా తిమ్మిని బొమ్మిని చెయ్యగల ఎవరైనా సమర్థుడైన న్యాయవాదిని పెట్టి ముందస్తు బెయిలు పొందాలి అనుకున్నాడు

యోహాను.

"అయితే నువ్వు చెప్పినట్టు యీ రాత్రి యిక్కడే గడుపుతాం. కానీ మనసంతా గందరగోళంగా వుంది. ఇద్దరం ఫుల్ బాటిల్ విస్కీ తాగి అన్నం తిని సోఫాల్లో పడుకున్నా సరిగా నిద్రే పట్టలేదు. ఏం చేద్దాం? " అంటూ యోహాను నర్మగర్భంగా నవ్వాడు. ఆమెవేపు చూసి కన్నుగీటాడు.

ముత్యాలమ్మ కిలకిలా నవ్వింది.

"కావాలంటే యింకొక ఫుల్ బాటిల్ తాగండి. సోఫాలో మీకు నిద్ర పట్టకపోతే నా బెడ్‌రూమ్‌లో పడుకోవచ్చు మీ మిత్రుడు ఏసోబుకు మాత్రం సోఫా నిద్రతప్పదు" అంది.

"ఇక్కడ మనకు బయంలేదుకదా? " అడిగాడు ఏసోబు.

"అంతా ముత్యాలమ్మే చూసుకుంటుంది. మనకేం భయం" అని, "ఏసోబూ! నువ్వింకా మందు తాగుతావా? " అని అడిగాడు యోహాను.

"మందూ విందూ వొద్దుగానీ నిద్రవస్తోంది. ఒక దుప్పటి నా ముఖాన కొడితే నేనీ సోఫాలోనే పడుకుంటాను" అన్నాడు ఏసోబు.

ముత్యాలమ్మ దుప్పటి తెచ్చి అతనికిచ్చింది.

దీర్ఘంగా ఆవులించి సోఫాలో పడుకున్నాడు ఏసోబు.

దుప్పటి కప్పుకుంటూ "జాగ్రత్త. ఎవరు వచ్చినా తలుపులు తీయకండి. లోపలి గడి భద్రంగా వెయ్యండి" అంటూ జాగ్రత్తలు చెప్పాడు.

"గడి జాగ్రత్తగానే వేశాను. ఇక్కడికి ఎవ్వరూ రారుగానీ నువ్వింక హాయిగా నిద్రపో" అని చెప్పింది ముత్యాలమ్మ.

ఏసోబు దుప్పట్ని ముఖంమీదికి కప్పుకున్నాడు.

"ముత్యాలమ్మా, యిక మనం మన గదిలోకి వెళ్దామా? " అడిగాడు యోహాను.

ముత్యాలమ్మ అతడి చెయ్యిపట్టుకుని గదిలోకి నడిపించింది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. మంచంమీద కూర్చున్నారు.

"మందు కావాలి నాకు" అడిగాడు యోహాను.

ముత్యాలమ్మ వెళ్ళి మందుసీసా గ్లాసు, షోడాలూ తెచ్చి మంచంపక్కనే బల్లమీద పెట్టింది.

సరిగ్గా అప్పుడే పక్కగదిలోంచి ఖళ్ళు... ఖళ్ళున దగ్గు వినిపించింది.

"అమ్మ నిద్ర లేచినట్టుంది. నేను వెళ్ళి ఆమెకు మంచినీళ్ళూ, మందూ యిచ్చి వస్తాను" అని చెప్పి గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది ముత్యాలమ్మ.

యోహాను గ్లాసులోకి మందు వంపుకుని తాగుతూ కూర్చున్నాడు.

ఐదు నిముషాల్లోనే వచ్చింది ముత్యాలమ్మ.

"ఏసోబు అప్పుడే గురకలు పెట్టి నిద్రపోతున్నాడు" అని చెప్పి అతడిని ఆనుకొని పక్కనే కూర్చుంది.

యోహాను ఆమె బుగ్గలు చిదిమేడు. ముంగురులు సవరించాడు. వాలిపోతోన్న కనురెప్పలను ప్రయత్నంమీద విప్పారుస్తూ "ముత్యంలాగున్నావే ముత్యాలమ్మా నువ్విప్పుడు. నిజం చెప్పొద్దూ... మార్తమ్మకన్నా నువ్వే అందంగా ఉంటావ్. దాన్దేముందీ. కొంచెం ఎర్రగా వుంటుందంతే" అంటూ ఆమెను అమాంతం బాహువుల్లో బంధించాడు.

ముత్యాలమ్మ విషాదంగా నవ్వింది.

"ముత్యాలమ్మా! నాలుగు రోజులాగి హైద్రాబాదు వెళ్దాం. అవసరమైతే ఢిల్లీ వెళ్దాం. నెల రోజుల్లోగా నీకు చర్మకార





సంఘం లోను యిప్పిచ్చకపోతే నా పేరు యోహానే కాదు" అని గ్లాసునిండా మందు వొంపుకొని గటగటా తాగాడు యోహాను.

"అంతగా తాగటం ఎందుకూ? జన్మకుసరి పోయేదంతా యిప్పుడే తాగాలా? " అంది ముత్యాలమ్మ చనువుగా.

"ఎప్పుడో చెప్పానుకదా. యీ జీవితం ఒక గాలిబుడగ. ఎప్పుడు పేలిపోతుందో చెప్పలేం. చెయ్యాల్సిందల్లా బతికి ఉన్నంత కాలం అందిన సుఖాలన్నీ అనుభవించటమే. ఆనందంగా చనిపోవటమే" అని, మళ్ళీ ఒక గ్లాసు విస్కీతాగి,

"మార్తమ్మకూ అదే చెప్పాను. మకురు ముండ అది వినిపించుకోలేదు. యింత దూరం తెచ్చుకుంది. అనవసరంగా చచ్చింది. ప్రపంచం యిప్పుడు దాన్ని 'పతివ్రత' అంటుందా? ఆరాధిస్తుందా? దానికి గుడులూ, దాని పేరుమీద బడులూ కట్టిస్తుందా? " అని పగలబడి నవ్వి,

"ఏంలేదు. ఎవ్వడూ దాన్ని పట్టించుకోడు. ఎవ్వడూ దాన్ని చరిత్రకెక్కించడు. ఎక్కించినా ఎవ్వడూ ఆ చరిత్ర చదవడు. అదంతే.

ప్చ్... పాపం, పిచ్చిముండ, దిక్కులేని చావు చచ్చింది. చచ్చిందికాదు, చంపాను. అయినా ఎవ్వరూ నన్నేం చెయ్యలేరు. నాకు అంత పలుకుబడీ, డబ్బూ హోదా అన్నీ ఉన్నాయి. సంఘంలో గౌరవం ఉంది. నాయకుల్లో పలుకుబడి ఉంది. ప్రభుత్వంలో గుర్తింపుంది.

దానికి ఏమున్నదని నాకు ఎదురు తిరిగింది?

దానికి ఏమున్నదని నన్ను ధిక్కరించింది?

అందుకే అనుభవించింది. అందుకే కుక్క చావు చచ్చింది" అంటూ తూలి ముందుకు పడబోయిన వాడల్లా తమాయించుకొని కూర్చున్నాడు.

గది, గదిలోని వస్తువులూ, తను కూర్చున్న మంచం అన్నీ గిర్రున తిరుగుతోన్నట్టు తోస్తుంటే, అవి తన ఆదేశంమీదనే అలా తిరుగుతోన్నట్టు పగలబడి నవ్వాడు.

'ఇక తిరగకండి' అన్నట్టు చేత్తో సైగచేసి ఎడమచేతి చూపుడువేలుతో శూన్యంలో సున్నాలు చుడుతూ,

"ముత్యాలమ్మా... నీ అందం ముందు మార్తమ్మ ఎందుకూ కొరగాదు. కేవలం అందమేకాదు, నాలాంటివాడికి ఎలా గౌరవం యివ్వాలో నీకు తెలుసు. ఎలా అభిమానించి ఆదరించాలో నీకు తెలుసు. అందుకే అడిగిందే ఆలస్యంగా నా కోర్కెలు తీరుస్తున్నావ్. నిజం ముత్యాలమ్మా, నాకు స్వర్గం చూపిస్తున్నావ్" అంటూ అమాంతం మంచంమీద వొరిగిపోయాడు యోహాను.

ముత్యాలమ్మ హాయిగా శ్వాస పీల్చుకుంది. నెమ్మదిగా మంచంమీంచి లేచి బైటికి వెళ్ళిపోయింది.

★ ★ ★

మార్తమ్మ శవందగ్గర శవజాగరణ చేస్తోన్న పల్లెజనంలో ఏదోకలకలం!

దూరంగా ఎవరెవరో హడావుడిగా పరుగులు తీస్తున్నారు. ఒకళ్ళకొకళ్ళు రహస్యంగా ఏదో చెప్పుకుంటున్నారు. గుసగుసలు పోతోన్నారు.

వాళ్ళ ముఖాల్లో ఎంత సంభ్రమం!

ఎంత ఆశ్చర్యం!

గాలివాలుకు ఎవరివో మాటలు స్పష్టంగా వినిపిస్తోన్నాయి...

"ఏంటిదంటరా, ఆ గోల? "

"ముత్తేలమ్మింటో కూనీలు జరిగినాయంట. వారు గోసే కత్తితో యోహానూ, ఏసోబూల గొంతులు గోసి సంపినారంట"

"సంపిందెవరూ? "

"పేతురు కొడుకులేడూ... ఏలియా!"



# చతురప్రపంచం

## 'టిప్పు'సుల్తానులు

'టిప్పు' ఇవ్వడం మామూలయిపోయిన రోజులివి. చాలా దేశాల్లో టిప్పు ఇవ్వడం గౌరవప్రదంగా, తీసుకోవడం మర్యాదగా భావిస్తున్నారు. వివిధ దేశాల్లో ఈ టిప్పు ఎంత ఇవ్వాలో నియమం కూడా పెట్టారు. అంతకు తక్కువ ఇస్తే నిర్మొహమాటంగా తిరిగి ఇచ్చేస్తారు.

అమెరికాలో హోటళ్లలో అయితే 10 నుంచి 20 శాతం, టాక్సీ డ్రయివర్లకి 10 శాతం, రూం బోయిస్‌కి 10 నుంచి 15 శాతం టిప్పుగా ఇవ్వాలి. ఇంగ్లండు, ఇటలీ, ఇస్తూ వుంటారు. మళ్ళీ వెళ్ళని చోట టిప్పు ఇవ్వనవసరంలేదు.

హాంకాంగ్‌లో కూడా 10 శాతం సర్వీస్ ఛార్జ్‌ని హోటల్ బిల్స్‌కి కలుపుతారు. అయితే మరో 10 శాతం టిప్పుగా క్యాష్ ఇవ్వకపోతే మర్యాద తెలియని వాడివంక చూసినట్టు చూస్తారు వెయిటర్స్.

రష్యాలో టిప్పుగా క్యాష్ కంటే అక్కడ దొరకని తక్కువ ఖరీదుగల వస్తువులిచ్చేవారికే గౌరవం అధికం. చైనాలో టిప్పు




ఫ్రాన్స్, బెల్జియం, హాలెండ్ లాంటి వెస్టర్న్ యూరప్ దేశాల్లో హోటల్స్‌లో 15 శాతం సర్వీస్ ఛార్జి బిల్లుకి కలుపుతారు. ఇది అక్కడి ఉద్యోగస్థులు పంచుకుంటారు. అయితే తరచు ఒకే హోటలుకి వచ్చేవారు మంచి సర్వీస్ కోసం 10 శాతం దాకా టిప్పు ఇవ్వడం నేరం. పుచ్చుకోవడమూ నేరమే. హోటల్స్‌లో ఆ మేరకు బోర్డులు కూడా వుంటాయి. జర్మనీలో బిల్‌లోనే 10 శాతం కృతజ్ఞతగా కలుపుతారు. క్యాష్‌గా టిప్పు ఇవ్వనవసరంలేదు.

ఆస్ట్రేలియాలో టిప్పింగ్ ఎరగరు. వారు మనకెంతో గొప్పసర్వీస్ చేశారన్న భావన కలిగితేనే టిప్పు ఇస్తారక్కడ.

గ్రీస్‌లో టిప్పు ఇవ్వకపోతే అరిచి పోట్లా




డతారు. అది వాళ్ళ హక్కుగా భావిస్తారు వెయిటర్లు.

ఆస్ట్రియా, జపాన్, డెన్మార్క్, పోర్చుగల్, న్యూజిలాండ్, మెక్సికో దేశాల్లో టిప్పు ఇచ్చినా వద్దని నిరాకరిస్తారు.

ఆఫ్రికన్ దేశాల్లో కూడా టిప్పు ఇచ్చే అలవాటులేదు. కారణం అవన్నీ బీదదేశాలు కాబట్టి ఎవరికీ ఏదీ ఊరికే ఇవ్వరు.

గల్ఫ్ దేశాల్లో కనీసం 25 శాతంకన్నా తక్కువ టిప్పు ఇస్తే తీసుకోరు. వందశాతం టిప్పు ఇవ్వడం కూడా అక్కడ సహజమే. కొందరు ధనవంతులు తమ బంగారు ఉంగరాన్ని కూడా టిప్పుగా ఇవ్వడం అక్కడ అరుదుకాదు.




## కలియుగ కుబేరుడు

బిల్ గేట్స్ ప్రపంచంలో అపర కుబేరుడిగా అందరికీ పరిచితుడే. సాఫ్ట్‌వేర్ వ్యాపారం చేస్తున్న ఈయన ప్రపంచంలో నంబర్‌వన్ ధనవంతుడు. కానీ... అతని ఆస్థిపాస్తుల వివరాలు చాలామందికి తెలియవు.

ప్రపంచంలో మొట్ట మొదటగా 100 బిలియన్ డాలర్లు అర్జించింది బిల్ గేట్స్ ఒక్కడే. అతని మైక్రోసాఫ్ట్ కంపెనీలో బిల్ గేట్స్‌కున్న షేర్లు మొత్తం 1,03,15,55,600. దీని విలువ ప్రపంచంలోని 18 ధనికదేశాల ఓ ఏడాది పారిశ్రామిక ఉత్పత్తుల విలువకన్నా ఎక్కువే.

1998లో గేట్స్ ఆర్జన సగటున గంటకి 45,66,000 డాలర్లు. అతని సంపాదన ఇలాగే సాగితే 2004 నాటికి బిల్ గేట్స్ ప్రపంచంలోని తొలి ట్రిలియనీర్ అవుతాడు (ఒకటి పక్కనే పన్నెండు సున్నాలుంచితే ట్రిలియన్ అవుతుంది).

బిల్ గేట్ వ్యక్తిగత ఆస్థిపాస్తులు సర్క్యులేషన్‌లో వున్న అమెరికన్ డాలర్‌నోట్లను కలిపితే వచ్చే మొత్తం కన్నా అత్యధికం.

వ్యక్తిగతంగా బిల్ గేట్స్ ఇష్టంవచ్చినట్లు డబ్బు ఖర్చు చేసే మనిషికాదు. 1998లో అతను ప్రయివేట్ విమానం కొనుక్కున్నాడు. ఇతని సంపాదనలో 1000వ వంతు ఉన్నవారందరికీ సాధారణంగా అమెరికాలో స్వంత విమానాలుంటాయి.

ప్రపంచంలో అతి ఖరీదైన రోల్స్‌రాయిస్ కారు ఈ కోటీశ్వరుడికి లేదు. తన కుటుం

బానికి కేవలం కోటి డాలర్లే మిగిల్చి మిగిలినదంతా బీదప్రజలకి ఖర్చు చేసే ఉద్దేశం ఈ 44 ఏళ్ళ అపర కుబేరుడికి వుందిట.

కోటిన్నర డాలర్లు కొసావో కాందిశీకులకి విరాళంగా ఇచ్చాడు బిల్‌గేట్స్. ఇతను స్థాపించిన రెండు ఫౌండేషన్స్ విలియం హెచ్. గేట్స్ ఫౌండేషన్, గేట్స్‌లెర్నింగ్ ఫౌండేషన్లద్వారా అభివృద్ధి చెందే దేశాల్లోని పేద పిల్లలకు టీకాలకోసం 10 కోట్లడాలర్లు విరాళంగా ఇచ్చాడు.

సొంత విమానం కొనకముందు ఎకనామిక్ క్లాసులో ప్రయాణం చేసేవాడు. ఇతని దుస్తుల ఖరీదు సగటున ఇతని ఆఫీస్‌లోని ఎగ్జిక్యూటివ్‌లు ధరించే దుస్తుల ఖరీదు కన్నా తక్కువే.

2003 కల్లా బిల్‌గేట్స్ కంపెనీలు 288 లో-లెవిల్ శాటిలైట్లను ప్రయోగించి ఇంటర్‌నెట్ కమ్యూనికేషన్‌కి ఇతరుల ఉపగ్రహాల మీద ఆధారపడవు. సియాటిల్ దగ్గరున్న లేక్ వాషింగ్‌టన్ ఒడ్డున ఉన్న ఇతని ఇంటి ఖరీదు 5 కోట్ల 60 లక్షల డాలర్లు. అందులో ఇతని భార్య మిలిండా, ఒకే ఒక్క కూతురితో కలిసి నివశిస్తున్నాడు.

ఇతని ఆస్థిని డాలర్లలోకి మార్చుకుని పక్క కిందదాస్తే ఆ పక్క 16 మైళ్ళ ఎత్తులో వుంటుంది. మైక్రోసాఫ్ట్ కంపెనీలో ఇతని ఆదాయం 4 కోట్ల 90 లక్షల మంది బ్రిటన్ దేశస్థులంతా కలిసి ఏటా సంపాదించే ఆదాయానికి సమానం.

కంప్యూటర్ తరువాత బయోటెక్నాలజీ ప్రపంచాన్ని శాసిస్తుందని నమ్ముతున్న బిల్‌గేట్స్ ఇప్పుడు తన పెట్టుబడులను ఆ రకం కంపెనీలకి వినియోగిస్తున్నాడు. అలాగే ఎక్కువశాతం ఆదాయం రియల్ ఎస్టేట్‌లో పెట్టుబడి పెడుతున్నాడు.

---

## మెలిస్సా వైరస్

కొన్నివేల కంప్యూటర్లని క్షణాల్లో నాశనం చేసే 'మెలిస్సా' అనే వైరస్ సృష్టికర్త ఎట్టకేలకు ఇటీవల దొరికాడు. దీనిని సృష్టించి ప్రపంచంమీదకు వదిలిన ఆ నేరస్థుడిని ఎఫ్.బి.ఐ. డిటెక్టివ్‌లు వారం రోజుల్లో పట్టుకుని 1999 ఏప్రిల్ 2న న్యూజెర్సీ రాష్ట్రంలో అరెస్ట్ చేశారు. ఇతనిపేరు డేవిడ్ ఎల్. స్మిత్. వయసు 30 సంవత్సరాలు. ఈటన్‌టోన్ అనే ఊళ్ళో అతని సోదరుడి



ఇంట్లో ఇతన్ని అదుపులోకి తీసుకున్నారు. మెలిస్సా వైరస్ ఇ-మెయిల్ ద్వారా వ్యాపిస్తుంది. ఈ వైరస్ ఉన్న ఇ-మెయిల్ మెసేజ్‌ని ఓపెన్ చేస్తే అది ఆ ఇ-మెయిల్ ఎకౌంట్‌లో స్టోర్ అయివున్న ఆ ఎకౌంట్ దారుడి బంధుమిత్రుల 50 ఎడ్రస్‌లకి వాళ్ళ కంప్యూటర్లు పాడయ్యేలా నిండిపోయేంత మేసేజ్‌ని పంపుతుంది. దీనిలో వున్న ప్రత్యేకతేమంటే మళ్ళీ ఆ 50 మంది ఇ-మెయిల్ ఎకౌంట్లలో స్టోర్ అయి వున్న మరో 50 మందికి వాళ్ల కంప్యూటర్లు కూడా పాడయ్యేంత మెసేజ్‌ని పంపుతుంది ఈ మెలిస్సా వైరస్.

క్షణక్షణానికీ ఈ వైరస్ ప్రపంచమంతటా ఇ-మెయిల్ ద్వారా వ్యాప్తిచెంది కొన్ని లక్షల కంప్యూటర్లని నాశనం చేసింది.

అమెరికన్ ఇ-మెయిల్ కంపెనీ ఎ.ఒ.ఎల్. ఎఫ్.బి.ఐ.కి ఈ వైరస్ ఎక్కడ పుట్టిందో కనుక్కునేందుకు సహాయం చేసింది. ప్రస్తుతం కేసు కోర్టు విచారణలో వుంది. నేరం ఋజువయితే నేరస్థుడికి 40 ఏళ్ల జైలుశిక్ష, నాగులున్నర లక్షల డాలర్ల ఫైన్ పడచ్చునట!




## ఆకాశయానం

ఆసియాలో సింగపూరు అంతర్జాతీయ టూరిజం కేంద్రం. ఇది ప్రపంచంలోని అన్నిదేశాలనుంచీ సందర్శకులని ఆకర్షిస్తోంది. కంప్యూటర్స్ వాడకం ఆసియాలో సింగపూర్‌లోనే అధికం.

'క్లీనెస్ట్ కంట్రీ'గా పేరొందిన సింగపూర్‌లోని టూరిజం విభాగంవారు ఇటీవల ఓ కొత్త ఆకర్షణని సందర్శకుల కోసం ఏర్పాటు చేశారు. అది 'ఫ్లయిట్ సీయింగ్'. హెలికాప్టర్‌లోంచి సింగపూర్ ఐలాండ్‌ని, అందులోని ముఖ్యమయిన భాగాలనీ సందర్శకులకి చూపిస్తారు.

ప్రతిరోజూ ఉదయం 12 కి ఈ ఆకాశయానం మొదలవుతుంది. ఓరకం హెలికాప్టర్‌లో నలుగురు, మరోరకం హెలికాప్టర్‌లో ఆరుగురు ప్రయాణించవచ్చు పైలట్‌కాక. 30 నిమిషాలసేపు పట్టే ఈ ప్రయాణానికి 12 ఏళ్ళలోపు పిల్లలకి 75 డాలర్లు, పెద్దవాళ్ళకి 150 డాలర్లు రుసు

ముగా వసూలు చేస్తారు.

సెలెటర్ ఎయిర్ పోర్టునుంచి మొదలయిన ఈ ట్రిప్స్ అక్కడే అంతమవుతాయి.

హెలికాప్టర్‌లో సింగపూర్ మీద ఆకాశయానం చేసిన సర్టిఫికెట్ ఒకటి మనపేరుతో సహా ఇస్తారు. ఇంట్లో దాన్ని డ్రాయింగ్ హాల్లో వుంచుకుంటే స్టేటస్ సింబల్ అనుకుని ఎక్కువమంది ఈ టూర్ చేయడానికి ఉత్సాహంగా ముందుకొస్తారని ఈ సర్టిఫికెట్ పద్ధతి ప్రవేశపెట్టారు.

---

## మితాహారం అమితజలపానం

మనిషి మనుగడకు నీరు ఎంత అవసరమో, అగ్ని కూడా అంతే ఆవశ్యకం. నీరు మనిషికి ప్రకృతి ఇచ్చినవరం. కానీ అగ్ని అలాకాదు. అడవుల్లో దావాగ్ని మండి, అడవులు కాలుతుంటే చూడడం, లేదా అగ్ని పర్వతాలలోని జ్వాలాముఖులను చూసి సురక్షిత ప్రదేశాలకి పారిపోవడం తప్ప, అగ్నిని ఎలా తయారు చెయ్యాలో ఆదిమానవునికి తెలియదు. అయినా మనిషి కనిపెట్టిన అద్భుతాల్లో అగ్నిదే ప్రథమస్థానం. అగ్నిని కనిపెట్టకముందు ఆదిమానవుడు మిణుగురులనుపట్టి వాటిని మైనానికి అంటించి, లేదా గాజు పాత్రలలో బంధించి దుర్గమారణ్యాలలో చీకట్లలో లాంతర్లుగా వుపయోగించేవారు.




అయితే మనిషి బతకడానికి కావలసిన ప్రాథమిక అవసరాల్లో ప్రప్రథమస్థానం నీటికే వుంది. మనిషి తన జీవిత కాలంలో ఎంత ఆహారం తీసుకుంటాడనే విషయాన్ని లెక్క కట్టలేదుగానీ, ఎన్ని నీళ్ళు తాగుతాడనేది మాత్రం అంచనావేశారు. మనిషి తన జీవితకాలంలో 16 వేల గాలన్ల నీటిని తాగుతాడు. నీరు, ఆహారం శరీరానికి ముఖ్యావసర వస్తువులే అయినా ఆహారాన్ని మితంగా తీసుకునేవాళ్ళు ఎక్కువ కాలం బతుకుతారు. ఆరోగ్యంగా వుంటారు.

అలాగే నీటిని ఎక్కువగా తాగేవారు ఆరోగ్యంగా వుండటమేకాక, ఎక్కువకాలం జీవిస్తారు. కాబట్టి మితాహారం తీసుకుని, అమిత జలపానం చేసేవాళ్ళు ఆరోగ్యంగా, పది కాలాలపాటు జీవిస్తారని తెలుస్తోంది.

★




# సచిత్ర విచిత్రం



## మరణానికి చిరునామా

హాలీవుడ్ నటి ఎలిజబెత్ టేలర్ కోడలు ఎయ్‌లీన్ (39) భయంకర వ్యాధి అయిన ఎయిడ్స్‌తో బాధపడుతోంది. లిజ్ కొడుకైన క్రిస్ వైల్డింగ్ భార్య ఎయ్‌లీన్. వారికి ఇద్దరు పిల్లలు కూడా. ఆమెయున్న అక్రమ శారీరక సంబంధాలు ఆమెకీ వ్యాధిని తెచ్చిపెట్టాయి. ఈమె తండ్రి కోటీశ్వరుడు. అయినా కూతురికి దూరంగా వుంటాడు. ఇప్పుడామెకి మంచం దిగినడిచే ఓపిక కూడా లేదు. మృత్యుముఖంలో వున్న ఆ అమ్మాయికి కొద్ది నెలలలో తనకి మరణం తథ్యమని తెలుసు. 'డెత్ రో' అనే ఆర్ట్ వర్క్‌ని తనే తయారుచేయించుకుని ఫొటో తీయించుకునివుంచుకుంది. ఎలిజబెత్ ఆమె ఆలనా పాలనా చూస్తోంది.

# ఏరిన ముత్యాలు

★ మనిషిచేతలు, ప్రవర్తన అతని జీవితానికి పీఠికలవంటివి.

–థామస్ ఫుల్లర్

★ తప్పుచేసి సిగ్గుపడని వ్యక్తిని సంస్కరించడం ఎవరివల్లా కాదు.

–సిమ్స్

★ పోరాడి సాధించిన విజయాలే అత్యంత ప్రియమైనవి.

–పీచర్

★ వాళ్ళు పరిష్కారాన్ని చూడడంలేదన్నది కాదు ప్రశ్న. అసలు వాళ్ళు సమస్యనే చూడడంలేదు.

–చెస్టర్‌టన్

★ ఏ పని చేయడానికైనా వుండవలసింది దృఢసంకల్పం.

–జె.ఆర్. లోవెల్

★ మహనీయతను వదిలిపెట్టుకోకూడదనుకుంటే ఎప్పుడూ సహనాన్నే పాటించాలి.

–తిరువళ్ళువార్

★ నీవు ఏది తెలుసుకుంటే సర్వం తెలుస్తుందో అదే అసలైన విద్య.

–శంకరాచార్య

★ రాజకీయాలు వ్యక్తిత్వాన్ని నాశనంచేస్తాయి.

–బిస్మార్క్

★ తప్పుడు ఆలోచనలు ఆలస్యంగానైనా దుష్ఫలితాలనిస్తాయి.

–హక్స్‌లీ

★ దూరదృష్టి ఉన్నవాడే తన దారిని సరిగా గుర్తిస్తాడు.

–హోమార్స్ జోల్ట్

★ ఉదాహరణలనుంచి కాదు, పొరపాట్లనుంచి నేర్చుకోవడం నిజమైన మానవస్వభావం.

–ఫైద్

★ పంచిపెట్టినకొద్దీ పెరిగేది మంచితనం ఒక్కటే.

–మిల్టన్

★ జీవితంలో అన్నింటికంటే ముఖ్యం ఒక లక్ష్యం కలిగి వుండటం.

–గోర్కి

సేకరణ : కొత్రగడ్డ వెంకట్రావు

# చతురకతలు

## అరుదైన వంటకం

అర్ధరాత్రి తుపాన్‌లో చిక్కుకున్న ఓ ఓడ మునగసాగింది. అందులో ప్రయాణిస్తున్న డాక్టర్ తన మెడికల్ కిట్‌ని ఓ చేత్తో, నీళ్ళ సీసాలున్న సంచీని ఇంకోచేత్తో పట్టుకుని లైఫ్‌బోట్‌వైపు పరుగులు తీసాడు. చాలా మంది వాటికోసం తోసుకుంటున్నారు. డాక్టర్ ఈదుకుంటూ వెళ్ళి మొత్తానికి ఓ




లైఫ్‌బోట్‌లోకి ఎక్కాడు. అందులోని ముగ్గురు డాక్టర్‌వంక చూశారు.

తెల్లారాక ఒకర్నొకరు పరిచయం చేసుకున్నారు. ఒకతను జర్మన్ సైనికుడు. ఇంకొకతను అమెరికన్ టూరిస్ట్. మూడోవాడు ఇంగ్లీస్ బారిస్టర్. నాలుగోవాడు మన ఇండియన్ డాక్టర్.

అంతా తమతో ఎమర్జన్సీకోసం తెచ్చుకున్న ఆహారపదార్థాలని పంచుకుని తిన్నారు. డాక్టర్ తెచ్చిన నీళ్ళని తాగారు. నాలుగు రోజుల్లో ఆహారం అయిపోయింది. మరో రెండు రోజులు లైఫ్‌బోట్ ప్రయాణించాక దూరంగా పక్షులు కనిపించాయి. వాళ్ళు ఉత్సాహంగా తెడ్లు వేసి లైఫ్‌బోట్‌ని ఆ పక్షులవైపు నడిపించారు. మధ్యాహ్నానికల్లా వాళ్ళకి దూరంనించే కొండలు, చెట్లు కనిపించడంతో ఆనందంతో అరిచారంతా సాయంకాలానికి వాళ్ళ పడవ తీరం చేరింది.

అంతా దిగి కొద్దిదూరం నడవగానే మొలలకి చర్మాలు కట్టుకున్న ఆటవికులు అకస్మాత్తుగా వాళ్ళ మీదకి దూకి ఆ నలుగుర్నీ బంధించి తమ నాయకుడి దగ్గరకి తీసుకెళ్లారు.

అతని సింహాసనానికి కట్టివున్న కపాలాలని, మెళ్లోని ఎముకలసైజుని చూసి తాము నరమాంస భక్షకుల చేతిలో చిక్కామని గ్రహించాడు డాక్టరు. ఆ విషయం మిగిలిన

కవర్ ఫొటోగ్రాఫర్ : వి. సత్యమూర్తి

వాళ్ళతో చెప్పలేదు వాళ్ళని కంగారు పెట్టడం దేనికని. ఆ రాత్రి వాళ్ళని ఓ కొండగుహలో బంధించి ఉంచారు. మర్నాడు ఉదయం వండడానికి డాక్టర్‌ని తీసుకెళ్లారు వాళ్ళు.

పెద్ద మంటమీద వున్న ఆరడుగుల గంగాళంలో డాక్టర్‌ని కూర్చోమని సైగచేసాడు వాళ్ళ నాయకుడు. అయితే ఎర్రబడ్డ అతని కళ్ళని చూసి, కళ్ళకలక వచ్చిందని గ్రహించి అతనికి వైద్యం చేసాడు డాక్టర్.

అతను డాక్టర్ అని తెలియగానే అమెరికన్ టూరిస్ట్‌ని తెప్పించి అతన్ని వండి డాక్టర్‌తోసహా అందరికీ వడ్డించారు. ఆ తండాలో, ఇంగ్లీష్ కొద్దికొద్దిగా మాట్లాడే ఒకడు చెప్పాడు డాక్టర్‌కి. "ఇది ఆర్డినరీ లంచ్. ఎక్కడ చూసినా అమెరికన్ టూరిస్టులే" మర్నాడు వైరస్ ఫీవర్‌తో బాధపడుతున్న వాళ్ళ నాయకుడి కొడుక్కి ఏంటీబయటిక్స్ ఇచ్చి నయంచేసాడు డాక్టర్

జర్మన్ సైనికుడిని తెప్పించి వండారు. లంచ్ దగ్గర చెప్పాడు ఇంగ్లీష్ తెలిసినవాడు.

"ఇది కాస్తంత స్పెషల్ లంచ్. సైనికులు అరుదుగా దొరుకుతూంటారు. వాళ్ళ మాంసం ఎండబెట్టి ఊరగాయ చేసుకుని ఏడాదిపొడుగూతా తింటూంటాం".

మూడోరోజు బ్రిటిష్ లాయర్‌ని తెచ్చి వండాక చెప్పాడు ఇంగ్లీష్ తెలిసినవాడు.

"మా నాయకుడి కళ్ళకి, ఆయన కొడుక్కి వైద్యం చేసినందుకు కృతజ్ఞతగా ఈపూట నీకు సరైన విందు చేస్తున్నాం అని చెప్పమన్నాడు మా నాయకుడు"

"ఈ విందులో ప్రత్యేకత ఏమిటి? " అడిగాడు డాక్టర్.

"గుండెతో వండిన ఈ అరుదైన కూర మొత్తం నీకే. లాయర్లు మాకు రెగ్యులర్‌గా దొరుకుతూనే వుంటారు కాని గుండె వున్న లాయర్స్ చాలా అరుదుగా మాత్రమే దొరుకుతూంటారు" చెప్పాడు వాడు.

**–డి.పద్మజ**

---

# ఛీర్స్

మిత్రులంతా కలిసి న్యూఇయర్‌కి మందు పార్టీచేసుకుంటున్నారు. బ్యాంక్‌లో పనిచేసే రామనాధానికి డిసెంబర్ 31న పార్టీకి బయలుదేరబోతూండగా గుర్తొచ్చింది, అంతా తలో బాటిలూ తీసుకురావాలని ముందే అనుకున్నారని.

తను ఉత్తి చేతులతో వెడితే బావుండదుగదా! అలా అని బాటిల్ కొందామంటే వైన్‌షాపులన్నీ మూసేసి వున్నాయి. రాత్రి పదిన్నర దాటడంతో ఇయర్ ఎండింగ్ కారణంగా బ్యాంకు పని లేట్‌గా పూర్తయింది రామనాధానికి. ఆ పనివత్తిడిలో బాటిల్ సంగతి మర్చిపోయాడు. పోలీసులు ఆ రాత్రి గొడవ కాకూడదని వైన్‌షాపులన్నిటినీ టైముకి దగ్గరుండి మూయించేశారు. రామనాధానికి పక్కింటివాళ్ల తాళం చెవి గుర్తుకు వచ్చింది. వాళ్లు ఊరికి వెడుతూ తాళం చెవిని రామనాధానికి ఇచ్చివెళ్లారు, ఎలక్ట్రిసిటీ మీటర్ రీడింగ్ వాడువస్తే రీడింగ్ చూసి వెడతాడని. పక్కింటాయన ప్రతిరాత్రీ రెండు పెగ్గులు తాగిగాని పడుకోడని రామనాధానికి తెలుసు.

వెంటనే ఇంటికి వెళ్లి భార్యనడిగి పక్కింటివాళ్ల తాళం చెవి తీసుకున్నాడు. తలుపు తెరిచి లోపలికెళ్లి చూస్తే అతడు ఆశించినట్లుగానే అల్మైరాలో ఓ బాటిల్ కనిపించింది. దాన్ని తీసుకుని ఆరాత్రి పార్టీ ఇచ్చే చోటుకు చేరుకున్నాడు రామనాధం.

మర్నాడు ఉదయం అలాంటి బాటిల్ కొని పక్కింట్లో యథాస్థానంలో వుంచాలనుకున్నాడు. ఖాళీ బాటిల్‌ను తీసుకుని తమ ఇంటివద్దవున్న వైన్‌షాపుకి వెళ్లి దాన్ని చూపించి అలాంటిది ఒకటి ఇమ్మని అడిగాడు.

"మా దగ్గర ఆ బ్రాండ్ లేదుసార్! రాష్ట్ర







పతి రోడ్‌లోని పెద్ద షాపులో అది దొరకచ్చు'' అని ఆ షాపు ఎడ్రస్ చెప్పాడు వాడు.

రామనాధం ఆ షాపుకి వెళ్లి ఆ బాటిల్‌ని చూపించాడు.

"వుంది సార్! ఖరీదు పదకొండు వందల రూపాయలు'' చెప్పాడు షాపు యజమాని.

"పదకొండు వందలే!"

"అవును సార్! అది ఇంపోర్టెడ్ స్కాచ్ విస్కీ'' అన్నాడు.

నిజానికి రామనాధం రెండు మూడు వందలు ఖరీదు చేసే బాటిల్ తీసుకు వెళ్లాలనుకున్నాడు. చేసేదిలేక పదకొండు వందలిచ్చి అలాంటి బాటిల్ ఒకటి కొని తీసుకెళ్లి దాన్ని పక్కింట్లో యథాస్థానంలో వుంచాడు.

పక్కింటివాళ్లు వచ్చారు. రామనాధం పక్కింటాయనతో మాట్లాడుతూ మధ్యలో ఆయనకి లిక్కర్ మీదున్న అభిరుచిని అభినందిస్తూ చెప్పాడు.

"పదకొండు వందల రూపాయలు ఖరీదు చేసే బాటిల్‌ని మీరు వారంలో పూర్తి చేస్తున్నారు''

దానికాయన నవ్వి ఇలా చెప్పాడు.

"పొరపాటు, నేను తాగేది 300 రూపాయల బాటిల్‌లోని విస్కీనే''

"అదేమిటీ? ఈ ఫారిన్ ఇంపోర్టెడ్ విస్కీ ఖరీదు పదకొండు వందలుగదా?"

"అదా! ఆ బాటిల్ ఓ ఫ్రెండ్ దగ్గర తెచ్చాన్లెండి. నేను కొనే బాటిల్‌లోని విస్కీని షో కోసం వుంచిన ఈ బాటిల్‌లోకి వంపుకుంటాను'' చెప్పాడు పక్కింటాయన.

—యం.కావ్య

## తనదాకా వస్తే

యస్.ఐ భీమారావ్ నిరాహారదీక్ష శిబిరం దగ్గరకొచ్చాడు.

ఎందుకొచ్చిన ఖర్మరా భగవంతుడా? అన్నట్టు ఓ యువతి మెళ్లో దండలు వేసుకొని ‘బేలగా చూస్తోంది. ఆమె వెన్నుకుదన్నుగా వెనకాల వీధి లీడర్లు, మహిళా శిరోమణులూ వున్నారు.

"హంగర్ స్ట్రయిక్ ఎందుకు చేస్తున్నట్లు? "

"నన్ను మోసం చేసి శివరావ్ అనే అతను గర్భవతిని చేశాడు. వాడు పెళ్ళిచేసుకొనేంత వరకు ఈ దీక్ష వీడను"

"మోసం చేయడం అంటే... 'రేప్' చేశాడా? "

"కాదు... మంచి మాటలు చెప్పి, నా శీలం



దోచాడు"
"అంటే ఎవరు మంచి మాటలు చెప్పినా, ఇలాగే జరుగుతుందా? "
"కాదు... వాడు ప్రేమించానని అన్నాడు"
"నువ్వు ప్రేమించలేదా? "
"ఏమిటి యస్.ఐ. గారూ... వాదన. ఆ సన్నాసిని నాలుగు తన్ని తాళికట్టించండి"
"అదెలా కుదురుతుంది. శారీరక కలయిక ఇద్దరి ఇష్టప్రకారం జరిగింది. ఇప్పుడు బెడి సికొట్టటంతో ఈమె నిరాహార దీక్షకు పూను కుంది. ఈమె ఏమి తెలియని పసిపాప కాదు కదా? మేజర్"
వాళ్ళు యస్.ఐ.కి వ్యతిరేకంగా స్లోగన్లు అర వటం మొదలుపెట్టారు.
భీమారావ్‌కి ఒకటే లక్ష్యం. ఏదైనా వివాదం వచ్చినప్పుడు ఒక పార్టీ దగ్గర కాస్త మంచి మాటలు చెప్పి వాళ్ళను మార్చాలని చూస్తాడు. దానికి ప్రతిఫలంగా అవతలి వాళ్ళ దగ్గర బాగా సొమ్ముతింటాడు. ఈ కేసులో ఇరుపార్టీల దగ్గిరా లంచం కొట్టేసి, 'పెళ్ళి' సెటిల్ చేసేశాడు.
ఆ కుర్రాడు గోలగోల పెట్టాడు. లవ్, గివ్... ప్రేమా, దోమా అంటూ ఆమే తనని ఈ రొంపిలోకి దింపిందని,అరచి గీపెట్టాడు. లాఠీ వూపి భయపెట్టి, పెళ్ళి జరిగేలా చూశాడు భీమారావ్.
నిండిన తన జేబుని హాపీగా తడుము కుంటూ, బులెట్ మీద ఇంటిదారిపట్టాడు. అక్కడ దృశ్యం చూసి షాక్ తిన్నాడు.
తన ఇంటి ఎదురుగా నిరాహారదీక్ష శిబిరం పెట్టారు. శ్రీకాంత్ తనని మోసం చేశాడు, పెళ్ళిచేయండంటూ ఓ వనితాలలామ దీక్ష పట్టింది. ఆ విషయం తాటికాయంత అక్ష రాలతో బోర్డు మీద రాసి వుంది.
చప్పుడయితే తల తిప్పి చూశాడు.
"నాకేం తెలియదు, ఆ అమ్మాయే నాన్నా... నన్ను ప్రేమా, దోమా అంటూ ఈ రొంపి లోకి దింపింది" అంటున్నాడు కొడుకు శ్రీకాంత్"

**–డాక్టర్ కె.శివసుబ్బారావు**

---

# బలహీనత

నలుగురు మిత్రులు ఆఫీస్ పనిమీద హైద్రాబాద్‌నుంచి వరంగల్‌కి బయలుదే రారు. కొద్దిసేపటికి ప్రయాణం విసుగు కలి గించడంతో ఒకడు మిగిలిన ముగ్గురితో అన్నాడు.
"చూడండి. మనం గత మూడేళ్ళుగా కలిసి పని చేస్తున్నాం కానీ, ఒకరి గురించి మరొకరికి పూర్తిగా తెలీదు. 'ఓ మనిషి ఏ విషయంలో బలహీనుడో నాకు చెప్తే, అత



నెలాంటి వాడో చెప్తాను' అన్నాడో నల్లగడ్డం తెల్లవాడు అమెరికాలో. కాబట్టి మనం నలుగురం మన వీక్‌నెస్‌లని ఒకరికొకరు చెప్పుకుందాం"

అందుకు మిగిలిన ముగ్గురు అంగీకరించాక మొదటివాడు చెప్పాడు తన బలహీనతని.

"నేనిది సజెస్ట్ చేశాను కాబట్టి ముందస్తుగా నా వీక్‌నెస్ చెప్తాను. అది ఆల్కహాల్. నెలకోసారి నాలుగైదురోజులపాటు వేరే ఊరికి వెళ్ళి హోటల్‌లో గది తీసుకుని అన్నం నిద్ర మానేసి అదేపనిగా డజను ఫుల్‌బాటిల్స్ దాకా తాగుతాను" అది విని రెండోవాడు చెప్పాడు.

"నేనూ నిజాయితీగా నా బలహీనత చెప్తాను. అది గుర్రప్పందాలు. ఏటా ఓసారి పూనాకి వెళ్ళి వున్నదంతా గుర్రప్పందాలకి ఖర్చు చేసేస్తుంటాను. అందుకే ఎప్పుడూ తలమునకలుగా అప్పుల్లో ఉంటాను"

మూడోవాడు గొంతు సర్దుకుని చెప్పాడు.

"నేనూ ఏదీ దాచకుండా నిజంచెప్తాను. నాకు అమ్మాయిల పిచ్చి. వీలున్నప్పుడల్లా అమ్మాయిల బ్రోకర్‌ని కాంటాక్ట్ చేసి వాళ్ళ 'అపార్ట్‌మెంట్‌కి వెళ్ళి గడుపుతుంటాను."

నాలుగో వ్యక్తి ఏంమాట్లాడకపోవడంతో, మిగిలిన ముగ్గురు అతన్ని అడిగారు.

"నీకేం వీక్‌నెస్ లేదా? "

"ఉంది" సిగ్గుగా చెప్పాడతను.

"మేమంతా మనసు విప్పి చెప్పలా? కమాన్ ఐ సే నువ్వూ చెప్పు నీది"

"నా వీక్‌నెస్ గాసిప్. అది తప్పని తెలిసినా ఇతరులమీద వదంతులు ప్రచారం చేయడం నా బలహీనత. మన కారు తిరిగి ఎప్పుడు హైదరాబాద్ చేరుతుందా, ఎప్పుడు అక్కడి మన కొలీగ్స్‌ని చూస్తానా, ఇవన్నీ చెపుతానా అని ఆతృతగా ఉంది నాకు"

**-యం.ఊహ**

---

## "వేదిక అలంకరించండి"

"లౌట్!" ఆగ్రహోదగ్రులై మెడలోని దండ టేబుల్ మీదకి విసిరికొట్టారు ఎమ్మెల్యే గారు.

ఈ చర్యకు -స్టేజ్ మీద వున్న మిగతా అతిథులు కొయ్యబారిపోయారు!

అతిథుల ఉపన్యాసాలను శ్రద్ధగా వింటున్న విద్యార్థులంతా అయోమయంగా వున్నారు.

ప్రిన్సిపాల్‌కి పల్స్‌డౌన్ అయిపోయింది. టేబుల్‌మీద వున్న మినరల్ వాటర్ బాటిల్ పైకెత్తి గడగడా తాగేశాడు!



కాలేజీ వార్షికోత్సవానికి ఆ నియోజకవర్గ ఎమ్మెల్యేను, మున్సిపల్ ఛైర్‌మెన్‌ను, ఇంకా ఆ పట్టణంలోని ప్రముఖుల్ని ఆహ్వానించారు కాలేజీవారు.

స్టూడెంట్స్ ఛైర్మన్ స్టేజీమీద వున్న వారిని సంబోధించి ఇంకా ఏదో మాట్లాడబోతున్నంతలో ఈ గలాభా సృష్టించారు ఎమ్మెల్యేగారు!

"పిలిచి ఇంత అవమానిస్తారా? " ఆవేశంతో ఊగిపోతున్నారు ఎమ్మెల్యేగారు!

అందరూ అచేతనంగా వుండిపోయారే తప్ప తమ ఆగ్రహానికి కారణం ఏమిటని ఎమ్మెల్యేగారిని అడగలేకపోయారెవరూ!

"శాంతించండి ఎమ్మెల్యేగారూ!... అసలేం జరిగింది? ..." ఎట్టకేలకు ధైర్యం తెచ్చుకొని మున్సిపల్ ఛైర్మన్ అడిగాడు.

"ఇంత జరిగినా... ఏం జరిగిందంటున్నావా? ఆ కుర్రకుంక అన్నమాట మీకెవరికీ చీమ కుట్టినట్టుగా కూడా లేదూ? " ఆ స్టేజీమీద వున్న అందర్నీ అడిగారు ఎమ్మెల్యేగారు.

"క్షమించండి సార్!" తడారిపోతున్న గొంతు పెగుల్చుకుని అన్నాడు ప్రిన్సిపాల్ తప్పేమిటో తెలియకపోయినా!

"ఇలాగేనటయ్యా స్టూడెంట్స్‌ని తయారు చేసేది? కాస్త మర్యాద మన్ననలు నేర్పక్కర్లేదా? ... అందుకే. కుర్రాళ్ళ మీటింగ్‌కి రానన్నాను"

"ఇంతకీ ఆ కుర్రాడు ఏం తప్పు మాట్లాడాడో చెప్పండి ఎమ్మెల్యేగారూ? " అడిగాడు మున్సిపల్ ఛైర్మన్.

"ఈ మున్సిపాల్టీకి ఛైర్మన్ అయిన నిన్ను ఈ నియోజకవర్గ ఎమ్మెల్యేనైన నన్ను... స్టేజీమీదున్న ఈ పెద్దమనుషుల్ని పట్టుకొని వేదికనలంకరించమంటాడా? ఈ బోడి స్టేజీకి కర్టెన్లు... పూలు... దండలు అవన్నీ... కట్టి అలంకరించవలసిన ఖర్మ మనకేంటి? " అసలు బాధను వెళ్ళగక్కుకున్నారు ఎమ్మెల్యేగారు.

"ఆ మాటకి అర్థం అదికాదు సార్! వేదికమీద ఎక్కువమంది వుండడంతో అందర్నీ పేరు పేరునా సంబోధించేసరికి...టైమ్ చాలా పడుతుందని... వేదికనలంకరించిన పెద్దలకు అని అన్నాను!" స్టూడెంట్ ఛైర్మన్ ఇచ్చిన వివరణతో తాటాకు మంటలా చల్లబడ్డారు ఎమ్మెల్యేగారు!

–కొలుపూరి త్రిమూర్తి సత్యనారాయణ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78